# టామ్ సాయర్

Tom Sayar

## మార్క్‌ట్వేన్

Mark Twain

అనువాదం:

నండూరి రామమోహనరావు

Nanduri Ramamohana Rao



ఆంధ్ర గ్రంథమాల

7, తంబుసెట్టివీధి, మద్రాసు-1.

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికనుండి
పునర్ముద్రితము.
2000 కాపీలు

వెల రు. 2/-

ముద్రణ:
ఆంధ్రపత్రికా ముద్రణాలయము
చెన్నపురి
1951.

# టామ్ సాయర్

"టామ్!"

జవాబు లేదు.

"టామ్!"

జవాబు లేదు.

"ఏమైపోయినట్టు? ఓరే, టామ్!" జవాబు లేదు.

ముసలావిడ కళ్లజోడు ముక్కు చివరకి లాగి వాటిమీదుగా గది అంతటా కలయచూసింది. తరువాత కళ్లజోడు పైకి లాగి వాటికిందుగా చూసింది. కుర్రాడంటి చిన్న వస్తువుకోసం కళ్లజోడు లోంచి చూడటం ఆవిడకి అలవాటు లేదు. అయినా అది అలంకారార్థం కళ్ల జోడు గాని, అవసరానికి కళ్ల జోడు కాదు. దాన్లోంచి చూసినా ఒకటే, రెండు చిల్లపెంకుల్లోనుంచి చూసినా ఒకటె. ఆవిడ కాస్సేపు విస్తుపోయినట్టు కనబడి, తరవాత, కుర్చీలకీ, బల్లలకీ వినిపించేలాగా, "ఈసారి దొరకవూ, అప్పుడు నీ పని—"

ఆవిడ మంచంకింద గడచీపురుతో పొడవడం కోసం వంగటం చేత మాట మధ్యలో ఆపవలిసి వచ్చింది. మంచంకింది నుంచి పిల్లి మాత్రమే పైకొచ్చింది.

"ఈ వెధవ అంతూ తేలకుండా ఉంది."

ఆవిడ పెరటివాకిలిదగ్గరకి పోయి దొడ్లో పాదులన్నీ పరీక్షించింది. టామ్ లేడు. అందుకని ఆవిడ గొంతెత్తి, బాగా దూరం వినిపించేలాగ, "ఒరే-ఏ-ఏ, టామ్!" అని కేకపెట్టింది.

తన వెనక అలికిడి కాగా ఆమె వెనక్కు తిరిగి, పారిపోబోతున్న కుర్రాణ్ణి కాస్తా పట్టేసింది.

"అలమారుమాట తట్టనేలేదు. ఏం చేస్తున్నావందులో?"

"ఏం లేదు."

ఏం లేదూ! నీ చేతులుచూడు. మూతి చూడు ఏమిటది?"

"నాకు తెలీదు, పెద్దమ్మా."

"నాకు తెలుసు. వెన్న—తెలిసిందా. దాని జోలికి పోతే తాట వొలుస్తానని నలభైసార్లు చెప్పా. ఆ బెత్తం ఇలా తే."

బెత్తం మీదపడటానికి సిద్ధంగా ఉంది.—

"అమ్మో, నీ వెనకేమిటి, చూడమ్మోయ్?"

ముసలావిడ కంగారుపడి వెనక్కి తిరిగేసరికి కుర్రాడు ఒక్క గెంతేసి, పిట్టగోడ మీదుగా దూకి మాయమైనాడు. ఆవిడ నవ్వింది.

"పిడిశకము పుడకా! నా తెలివి తగలబెట్టే ఉంది. ఎన్నిసార్లు వాడు టోకరా ఇచ్చినా మళ్లీమళ్లీ మోస పోతూనే ఉంటా. అయినా ఒకసారి వేసిన ఎత్తు మరో సారి వెయ్యడుగా. నన్నెట్లా ఏడిపించాలో వాడికి సరిగ్గా తెలుసు. ఒక్క క్షణం ఏమరుపాటున ఉండి నవ్వితినా చెయ్యి నొప్పెడుతుంటాను. కొట్టక పోతే నేమో మకుటుతనం నేర్చి ఎందుకూ కాకుండా పోతాడేమో. కొడదామన్నా, పిచ్చివెధవ, తల్లి లేనివాడే అనిపిస్తుంది. కొట్టకపోతే రేపు పని చేయించాలి. శని వారంనాడు స్కూలుండదాయె అనుకుంటాంటే వాడు పని చేస్తాడా? అసలే పనికి మొండి. చూస్తూ ఊరుకుంటే నేమో చెడిపోతాడు," అనుకున్నదావిడ.

టామ్ రోజల్లా ఆడుకుని కులాసాగా గడిపి ఇంటికి వచ్చాడు. వాడింటికి వచ్చేసరికి నీగ్రో కుర్రాడు జిమ్ రేపటికని కట్టెలు పగలేస్తున్నాడు. టామ్ జిమ్‌కు సాయం పట్టాడు. నిజం చెప్పాలంటే మూడు వంతులు పని జిమ్‌ను చెయ్యనిచ్చి తాను రోజల్లా చేసిన పనులనుగురించి వాడికి కబుర్లు చెప్పాడు. టామ్ తమ్ముడు

సిడ్ (సొంతతమ్ముడు కాదు) తనవంతు పని పూర్తి చేశాడు. వాడు నెమ్మదైనవాడు.

టామ్ అన్నం తింటూ, వీలుదొరికినప్పుడల్లా పంచదార చాటుగా బొక్కుతూ ఉన్న సమయంలో పోలీ పెద్దమ్మ టామ్‌ను పట్టుకోవటానికని ఎంతో యుక్తిగా ప్రశ్నలు వేసింది.

"ఇవాళ బళ్ళో చాలా వేడిగా అనిపించింది కాదూ?"

"అవును, పెద్దమ్మా."

"వడగొట్టింది కాదూ?"

"అవును, పెద్దమ్మా."

"నువ్వు ఈతలకు పోలేదా, టామ్?"

టామ్ ఉలికిపడ్డాడు.

"లేదు, పెద్దమ్మా."

ముసలావిడ టామ్‌చొక్కా ముట్టుకు చూసింది.

"నీవొళ్ళేమంత వేడిగా లేదే?"

టామ్ రానున్నది ఊహించి, ముందుగానే "ఒకళ్ళమీద ఒకళ్ళం నీళ్లు చల్లుకున్నాం. తల చూడు, ఇంకా తడిగానే ఉంది, అన్నాడు.

తల తడిమి చూడనందుకు ముసలావిడ పశ్చాత్తాపపడ్డది. ఆవిడ కింకో ఆలోచన తట్టింది.

"ఒకళ్ల నెత్తిన ఒకళ్లు నీళ్లు చల్లుకుంటే చొక్కా ఊడదీయక్కర్లేదుగా? కాలరు అంట కుట్టానే, సరిగా ఉందో లేదో చూపించు!" అన్న

టామ్ చూపించాడు. చొక్కా కాలరు కుట్టే ఉన్నది.

"సరే, పద. గొట్టికాయలాడి ఈతలు కొట్టావేమో అనుకున్నా. నీతో చిక్కేమిటంటే నువ్వు పైకి కనిపిస్తేంత చెడ్డవెధవ్వు కావు- ఈ తడవ."

టామ్ ఈసారన్నా సరిగా ప్రవర్తించినందు కామెక కొంత సంతోషించింది.

"నువ్వు తెల్లదారంతో వాడి చొక్కా అంట కుట్టావేమో ఇప్పుడు నల్లదారం ఉంది" అన్నాడు సిడ్.

"అవును. తెల్ల దారంతోనే కుట్టా!"

కాని టామ్ అక్కడనిలవలేదు. వాడు బయటికి పోతూ, "ఒరే, సిడ్, నీ తాటఒలుస్తా!" అన్నాడు.

టామ్దగ్గిర రెండు సూదులున్నాయి. ఒకదానికి తెల్లదారమూ, మరోదానికి నల్లదారమూ ఉండనే ఉన్నది. కాని పోలీ పెద్దమ్మ ఎప్పుడేదారం పెట్టికుట్టినదీ వాడికి సరిగా జ్ఞాపకం ఉండదు.

టామ్ బుద్ధిమంతుడు కాడు. గ్రామంలో కల్లా బుద్ధిమంతుడని పించుకున్న కుర్రాణ్ణి చూసి వాడు ఏవగించుకునేవాడు.

పెద్దవాళ్లకు వాళ్ల కష్టాలెటువంటివో, టామ్‌కు వాడి కష్టాలూ అటువంటివే. కాని ఇప్పుడు వాడికొక కొత్తవిద్య అభ్యసించవలసి ఉండటంచేత వాటిని మరిచిపోయినాడు. ఆ విద్య ఏమిటంటే ఈల వెయ్యటం. టామ్‌కు ఎవరో నీగ్రోవాడు ఈల వెయ్యటం నేర్పాడు. ఈ విద్యను టామ్ సావధానంగా అభ్యసించాడు. త్వరలోనే వాడికది పట్టుపడింది. టామ్ వీధివెంట ఈల పాడుకుంటూ వెళ్లాడు.

వేసవికాలం. ఇంకా చీకటిపడ లేదు. కొంత దూరం వెళ్లి టామ్ ఈలవెయ్యటం ఆపాడు. వాడి ఎట్ట ఎదురుగా ఒక కొత్త కుర్రవాడు, వాడికన్న కొంచెం పెద్దవాడు కనిపించాడు. కుగ్రామమైన సెయింట్ పీటర్స్‌బర్గు ప్రజలను కొత్తవాళ్లు వెంటనే ఆకర్షిస్తారు. అందులో ఈ కుర్రవాడు, ఆదివారం కాకపోయినా, మంచి దుస్తులు వేసుకుని ఉన్నాడు. ఈకుర్రవాడినెత్తి మీద అందమైన టోపీ ఉన్నది. మెరిసే నీలంకోటూ, పంట్లామూ, కాళ్లకి బూట్లూ వేసుకున్నాడు. అందమైన నెక్‌టై పెట్టుకున్నాడు. వాడి బస్తీవాలకం చూసి టామ్ దహించుకుపోయినాడు. వాణ్ణి చూస్తున్నకొద్దీ తన దుస్తులు చాలా కుళ్లువిగా తోచసాగాయి.

ఇద్దరూ ఒకరి కొకరు ఎదురుగా నిలబడి చాలా సేపు మౌనంగా చూసుకున్నారు.

చివరకు టాం, "నిన్ను పచ్చడి చెయ్యగలను" అన్నాడు.

"చెయ్యి చూద్దాం" అన్నాడు కొత్తకుర్రాడు.

"కావాలంటే చెయ్యగలను."

"చెయ్యలేవు."

"నా చాతనవును."

"కాదు."

కొంచెంసేపు ఆగి టాం, "నీ పేరేమిటి?" అన్నాడు.

"నా పేరుతో నీకేం పని?"

"ఏం పనా? చెబుతా."

"చెప్పు చూద్దాం."

"ఆటే అన్నావంటే చూపిస్తా"

"ఆటే-ఆటే-ఆటే! ఏం?"

"చాలా గొప్ప వాణ్ణనుకుంటున్నావే, ఒక్క చేత్తో కిందపడెయ్యగలను. జాగర్త."

"పడెయ్యగల నంటావుగాని పడెయ్యవేం?"

"కోపం తెప్పించావంటే ఊరుకునేది లేదు."

"ఇటువంటి వాళ్లని చాలామందిని చూశాం."

"బడాయిఖోర్!"

"నువ్వే బడాయిఖోర్!"

"కొండతాట్ల మొనగాడు."

"పద పద."

"ఆహా మాట్లాడావంటే పెంకు ఊడిపోగల్దు."

"కాదు మరి!"

"అంతపనీ చేస్తా"

"చేస్తానంటావు చెయ్యవేం? పిరికి!"

"నే నేం కాదు."

"అవును."

"కాదు."

"నువ్విక్కణ్ణుంచి వెళ్లిపో."

"నువ్వేపో."

"నే నేం పోను."

"నేనూ పోను."

ఇద్దరూ మెల్లిమెల్లిగా దగ్గిరికివచ్చి భుజానికి భుజంపెట్టి నెట్టుకోవటానికి ప్రయత్నించారు. ఇద్దరూ మళ్లీ కాస్త వెనక్కు తగ్గారు.

"నువ్వు పిరికిపందవి. మా అన్నయ్యతో చెప్పానంటే నిన్ను చిటికెనవేలితో కొట్టేస్తాడు." అన్నాడు టామ్.

"మీ అన్నయ్యయితే భయమనుకున్నావా? నాకు అంతకన్నా పెద్ద అన్నయ్యే ఉన్నాడు. మీ అన్నయ్యను ఎత్తి గోడమీదుగా పారేస్తాడు."

ఇద్దరికీ అన్నలు లేరు.

"పచ్చి అబద్ధం."

"నువ్వనగానే సరా?"

టాం నేలమీది మట్టిలో కాలి బొటనవేలితో గీత గీసి, "గుండెలుంటే అది దాటిరా. ప్రాణం తీసేస్తాను. గెలవలేని కుక్కా!" అన్నాడు.

వెంటనే రెండోవాడు గీత దాటి "ఏం చేస్తావో చెయ్యి. చూద్దాం!"

"వొళ్లు జాగర్త, తన్నులు తినగలవు."

"చేస్తానంటావుగాని చెయ్యవేం?"

ఇద్దరు కుర్రాళ్లూ కలియబడ్డారు. ఒకరి నొకరు గుద్దుకున్నారు, రక్కుకున్నారు, తన్నుకున్నారు, మట్టిలో పొర్లారు. దుమ్ము లేచింది. ఆఖరుకు టాం రెండో కుర్రాడి గుండెమీద ఎక్కికూచుని గుండెల మీద రెండు చేతులూ బాదుతూ, "చాలు అను." అన్నాడు.

రెండోవాడు తప్పించుకోవటానికి ప్రయత్నిస్తూ కోపంకొద్దీ ఏడిచాడు.

"చాలు అను," అన్నాడు టాం గుండెలమీద గుద్దుతూ.

చివరకు రెండో కుర్రాడు "చాలు,"అన్నాడు.

టాం వాణ్ణి లేవనిచ్చి, "జాగ్రత్త ఒళ్లు దగ్గర పెట్టుకు నుండు ఎవరితో మాట్లాడుతున్నదీ తెలుసుకు మాట్లాడు." అన్నాడు.

రెండో కుర్రాడు లేచి, మన్ను దులుపుకుని, ఏడుస్తూ, మధ్యమధ్య వెనక్కి తిరిగి చూసి, ఈసారి దొరికితే ఏం చేస్తానో చూడమని టాంను బెదిరిస్తూ వెళ్లి పోయినాడు. టాం వాణ్ణి తేలిక్కి కొట్టి ఉత్సాహంతో బయలుదేరాడు. టాం వీపు కనిపించగానే రెండో కుర్రాడు రాయి తీసి, టాం గూళ్ల మధ్య తగిలేటట్టు కొట్టి తోక ముడిచి పరుగు తీశాడు. టాం ఆ ద్రోహి వెంట పడి వాడి ఇల్లు తెలుసు కున్నాడు. శత్రువు బయటికి వస్తాడేమోనని టాం వాకిలి దగ్గర కొంతసేపు కాపలా కాచాడు. కాని శత్రువు బయటికి రావటానికి బదులు కిటికీలో నుంచి వెక్కిరించ సాగాడు. ఇంతలో శత్రువుతల్లి బయటికివచ్చి టాంను నానాతిట్లూ తిట్టి వెళ్లి పొమ్మంది.

టాం చాలా పొద్దుపోయి ఇంటికి వెళ్ళి కిటికీలో గుండా చడీచప్పుడు లేకుండా ఎక్కి, తన కోసం కని పెట్టుకుని ఉన్న పెద్దమ్మకు దొరికి పోయినాడు. అవతారం చూడగానే ఆవిడ మర్నాడు వాడిచేత వెట్టిపని చేయించాలని నిశ్చయించు కున్నది.

మర్నాడు శనివారం ఉదయం బొక్కెన (బాల్చీలో) తెల్లరంగూ, చేతిలో పొడుగుపాటి కర్రకుం కుంచె తీసుకుని టామ్ చెక్కల గోడకు రంగువెయ్యటానికి హాజరైనాడు. 30 గజాల పొడుగూ, తొమ్మిది అడుగుల ఎత్తూగల ఆ గోడ చూడగానే టామ్‌గుండె జారిపోయింది. జీవితం నిస్సారమనిపించింది. ఒకనిట్టూర్పు విడిచి వాడు కుంచె బొక్కెనలో ముంచి గోడపైవరస చెక్కవెంబడి రంగు పూశాడు. ఈ రకంగా నాలుగైదు చెక్కలకు రంగు పూశాడు. మొత్తం గోడలో రంగు పూసిన మేరచూస్తే సముద్రములో కాకిరెట్టలాగా ఉన్నది. అది చూసి నిరుత్సాహం చెంది వాడు చతికిలబడ్డాడు.

ఇంతలో జిమ్ వీధిపంపునుంచి నీళ్లు పట్టుకురావటానికని బొక్కెనతో పాటపాడుకుంటూ బయటికి వచ్చాడు. పంపునుంచి నీళ్లు పట్టుకురావటంలో ఆనందం ఉన్నదని టామ్ అదివరకెన్నడూ అనుకోలేదుగాని ఇప్పుడనుకున్నాడు. అక్కడ చాలామంది ఆడపిల్లలూ, మగపిల్లలూ ఉంటారు. పిల్లలమధ్య ఆటవస్తువుల మారకమూ, ఆటలూ, పోట్లాటలూ, అల్లరీ, ఆగమూ జరుగుతూంటాయి. పంపు 150 గజాల దూరంలోనే ఉందిగాని, అక్కడికి వెళ్లితే జిమ్ గంటకులోపుగా ఎన్నడూ రాడు.

"ఒకే, జిమ్. నువ్వు కాస్త రంగువేసేట్టయితే నే వెళ్లి నీళ్లు పట్టుకొస్తా," అన్నాడు టాం.

"లేదు, టాందొరా. అమ్మగారు నన్నే నీళ్లు తెమ్మంది. నువు తెస్తానంటావని కూడా అన్నది. నన్ను రంగుజోలికి పోవద్దన్నది."

"ఆవిడ అట్లాగే అంటుందిలే జిమ్. బొక్కెన ఇచ్చెయ్యి. క్షణంలో వస్తా. ఆవిడకు తెలీను కూడా తెలియదు."

"అమ్మో, అమ్మగారు గొంతు పిసికేస్తుంది."

ఆవిడేం కొడుతుందిరా. నెత్తిన మొట్టుతుంది. మొట్టనీ! జిమ్, నీకు భలేదిస్తా. తెల్లగోలీ ఇస్తా."

జిమ్ చలించాడు.

తెల్లగోలీ, జిమ్! మంచి బిళ్లేరుగోలీ, అన్నాడు"

"బిళ్లేరుగోలీనా, అమ్మో! మరి అమ్మగారంటే భయంగా ఉందే—"

"నువొప్పుకున్నావంటే నా చితికిన కాలివేలు కూడా చూపిస్తా"

జిమ్ లొంగిపోయాడు. బొక్కెన కింద పెట్టి, గోలీ తీసుకుని, టాం కాలికట్టు విప్పుతుంటే శ్రద్ధగా చూడసాగాడు. మరుక్షణమే వాడు బొక్కెన తీసుకుని

వీధివెంట పరుగెత్తటం మొదలుపెట్టాడు. టామ్ చకచకా చెక్కగోడకు రంగు వెయ్యసాగాడు. పోలీ పెద్దమ్మ మళ్ళీ ఇంట్లోకి వెళ్ళిపోయింది.

టాం ఉత్సాహం ఎంతోకాలం నిక్కలేదు. ఆట విడుపు పిల్లలందరూ హాయిగా తిరుగుతారు. పనిచేస్తున్నందుకు తనని చూసి నవ్వుతారు. ఏ కుర్రాడికన్నా లంచంపెట్టి వాడిచేత తనపని చేయిద్దామన్నా తనదగ్గిర ఏమీలేదు. కాని ఇంతలో వాడి కొక గొప్ప ఆలోచన తట్టింది. ఈ ఆలోచన మనసులో పెట్టుకుని టాం ప్రశాంతంగా రంగు పూయసాగాడు.

కొద్దిసేపట్లో గెంతుకుంటూ బెన్ రోజర్స్ అటు వచ్చాడు. వాడు ఆపిల్ పండొకటి తింటూ స్టీమరు ఆట ఆడుతూ, మధ్యమధ్య స్టీమరుకూత వేస్తూ వచ్చాడు. వాడే పడవా, వాడే సరంగూ, వాడే గంటలూనూ.

"పడవ ఆపండి హోయ్! టింగ్, టింగ్, టింగ్!...కాస్త వెనక్కి మళ్ళించండి! టింగ్, టింగ్, టింగ్!...ఎడంపక్కకి. భుక్కు, భుక్కు, భుక్కు!... తాడు భద్రం!" అంటూ బెన్ ఆడుతున్నాడు.

ఈ స్టీమరును లక్ష్యపెట్టకుండా టాం తదేక ధ్యానంతో రంగువేస్తున్నాడు. బెన్ వాడికేసి కాసేపు చూసి, "హి, హి! అణిగిందీ అబ్బాయిగారి తిక్క?" అన్నాడు.

జవాబు లేదు. టాం తాను అప్పుడే వేసిన రంగు కేసి పరీక్షగా చూసి, ఇంకోసారి పామి మళ్ళీ అట్లాగే చూశాడు. బెన్ వచ్చి టాం సరసనే నిలబడ్డాడు. ఆపిల్ కోసం టాం నోరూరుతున్నది. కాని వాడు పని మాన లేదు.

"చాకిరి తగిలిందిరా, అబ్బీ?" అన్నాడు బెన్.

టాం గిర్రున తిరిగి, "నువ్వురా, బెన్. నే చూళ్ళేదే?" అన్నాడు.

"ఏమ్, నేను ఈతకొట్టటానికి పోతున్నా. నిజం! నీకూ కూడా రావాలని లేదూ? అయినా నీకు పనిచెయ్యా లనుందేమోలే."

"పనేమిటి?" అన్నాడు టాం.

"అది పని కాదూ?"

"ఒకవేళ అవునేమో! రంగు వేసే అవకాశం రమ్మన్నప్పుడల్లా వస్తుందా?"

ఈమాట అనేసరికి బెన్ అభిప్రాయం మారింది. టాం రంగు వెయ్యటమూ, వెనక్కు అడుగువేసి చూసు కోవటమూ, అక్కడక్కడా రంగు సర్దటమూ చూస్తున్న కొద్దీ బెన్‌కు ఉత్సాహం హెచ్చింది.

"ఒరే, టాం. నన్నుకూడా కాస్త రంగువెయ్య నివ్వరా."

"అమ్మో, పెద్దమ్మ ఒప్పుకోదు. వీధి వేపున్న భాగం కూడాను. అదే వెనకభాగమైతే ఫరవాలేదు. దానికిసరిగా రంగు వెయ్యటం అందరివల్లా అవుతుం దనుకున్నావా?"

"అల్లాగా? పోనీ కొంచెం వెయ్యనీ. ఒక్కరవ్వ!"

"నాకేం అభ్యంతరం లేదురా. దొడ్డమ్మ ఒప్పుకోదు. జిమ్ రంగువేస్తానంటే ఆవిడ ఒప్పుకోలా. సిడ్ వేస్తానన్నా ఒప్పుకోలా. నువ్వే పని పాడుచేశా వంటే—"

"ఓయబ్బ, నే జాగర్తగానే చేస్తాలే. ఒక్కసారి చూడనీ. పోనీ, నా ఆపిల్‌లో కొంత ఇస్తాలే."

"నువ్వు పాడుచేస్తావు, బెన్."

"ఆపిల్ అంతా తీసుకోలే!"

అయిష్టం నటిస్తూ టాం కుంచె బెన్ చేతికిచ్చి, హాయిగా నీడలో కూచుని కాళ్లాడిస్తూ ఆపిల్ తిన సాగాడు. బెన్‌లాంటి కుర్రవాళ్లు టాంకు చాలా మంది దొరికారు. బెన్ అలిసిపోయే సమయానికి బిల్లీ ఫిషర్ వచ్చాడు. వాడి తరవాత జానీ మిల్లర్ వచ్చాడు. అందరూ టాంకు లంచాలు పెట్టి వాడి పని చేసిపెట్టారు. టాం చెయ్యి కదలించకుండా చెక్కలగోడకు మూడు పూతల రంగుపడింది. రంగు అయిపోబట్టి గాని, లేక పోతే టాం ఊళ్లో ఉన్న కుర్రాళ్లందర్నీ దోచేసేవాడే.

# 2

పడకగదీ, భోజనాలగదీ, చదువుకునేగదీ అయిన వెనక గదిలో కూర్చుని ఊలు అల్లుతూ జోగుతున్న పోలీ పెద్దమ్మ ఎదుట టామ్ హాజరైనాడు. ఆవిడ ఒళ్ళో పడుకుని నిద్రపోతున్న పిల్లి తప్ప ఆవిడకు వేరే తోడెవరూ లేరు. ఆవిడ కళ్ళజోడు తలమీదికి ఎగదోయబడి ఉన్నది. ఎప్పుడో పరారీ అయి ఉంటాడను కున్న టామ్ తన ఎదట హాజరయ్యేసరికి ఆమె ఆశ్చర్య పడ్డది.

"నే నిక వెళ్ళి ఆడుకోవచ్చా, పెద్దమ్మా?" అని అడిగాడు టామ్.

"అప్పుడేనా? పని ఎంతవరకయింది?"

"అంతా అయిపోయింది. పెద్దమ్మా."

"అబద్ధాలాడకు, టామ్-నాకు చిరాకేస్తుంది."

"అబద్ధాలు కాదు. అంతా అయిపోయింది."

పెద్దమ్మకు ఇటువంటి సాక్ష్యంలో నమ్మకంలేక స్వయంగా చూడటానికి బయలుదేరింది, టామ్ చెప్పిన దాన్లో అయిదో వంతు నిజంఉన్నా ఆవిడ సంతోషించటానికి సిద్ధంగానే ఉండింది. అటువంటప్పుడు చెక్కలగోడ యావత్తూ తెల్లగా రంగువేసిఉండటమే కాక ఒకటికి రెండు విడతలు రంగువేసి ఉండటం చూసి ఆవిడకు నోట మాట రానంతపని అయింది.

"నాయిల్లు బంగారంగానూ! చూశావా, తలుచుకుంటే నువ్వు పని చెయ్యగలవు. కాని తలుచుకోటమే ఉండదు. పో, వెళ్లి ఆడుకో, కాని అదేపోత పోయ్యేవు. వీపు చిట్లగొడతా." అన్నది పెద్దమ్మ.

వాడు చేసినపనికి ఆవిడ, పాగం ఎంతో సంతోషించి వాడికి మంచి ఆపిల్‌పండు ఏరిఇస్తూ, బుద్ధిమంతులుగా ఉండి చెప్పినమాట వినేపిల్లలు ఎట్లా బాగుపడతారో చిన్న ఉపన్యాసం ఇచ్చింది. ఈ సందడిలో టామ్ ఆవిడకు తెలీకుండా ఒక్క అప్పచ్చి చేతివాటు వేశాడు.

టామ్ బయటికి వస్తూ మేడమీదికి వెళ్ళే మెట్లెక్కుతున్న సిడ్‌ను చూశాడు. కావలిసినన్ని మట్టిబెడ్డలు అందుబాటులో ఉన్నాయి సిడ్ మీద విసరటానికి. టామ్‌కు క్షణంకూడా పట్టలేదు. బిత్తర పోయిన పెద్దమ్మ కదిలివచ్చి సిడ్‌ను రక్షించేలోపుగా సిడ్‌కు ఆరేడు బెడ్డలు గురిగా తగిలాయి. టామ్ గోడ దూకి పారిపోయినాడు. చక్కగోడకు వాకిలి లేక పోలేదు. కాని టామ్‌కు సామాన్యంగా దీన్ని ఉపయోగించే వ్యవధి ఉండేదికాదు. చొక్కాకు కుట్టేసిన్న దారం నల్లదారమని బయటపెట్టినందుకు సిడ్‌కు తగినశాస్తి అయింది. ఇప్పుడు టామ్‌కు మనస్సు శాంతించింది.

టామ్ ఇంటిపక్క సందులోనుంచి పెద్దమ్మ ఆవులుండే పాకపక్కగా గ్రామంమధ్యకు వెళ్లాడు. అక్కడ రెండు పిల్లలసేనలు యుద్ధానికిగాను చేరి ఉన్నాయి. అందులో ఒక సేనకు సేనానాయకుడు టామ్. రెండో సేనకు నాయకుడైన జో హార్పర్ టామ్‌కు ప్రాణస్నేహితుడు. సేనానాయకులిద్దరూ యుద్ధంలో పాల్గొన్నారు. వారు ఎత్తైన దిబ్బమీద కూర్చొని తమ అంగరక్షకులద్వారా సైనికులకు ఆజ్ఞలిచ్చి యుద్ధం చేయిస్తారు. యుద్ధం చాలాసేపు తీవ్రంగా జరిగి చివరకు టామ్ బలాలు గెలిచాయి. యుద్ధంలో చచ్చిపోయిన వారు లెక్కించబడ్డారు. యుద్ధఖైదీలు వాపసు చేయబడ్డారు. మరొకయుద్ధానికి షరతులుకూడా ఆమోదించబడ్డాయి. తరవాత రెండుసేనలూ రెండువరుసలుగా నిలబడి "మార్చ్" చేసుకుంటూ వెళ్లిపోయాయి. టామ్ ఒంటిగా ఇంటిముఖం పట్టాడు.

జెఫ్ థాచెర్ ఇంటిమీదుగా వస్తుండగా వాళ్ళ దొడ్లో టామ్‌కు ఒకకొత్త అమ్మాయికనిపించింది. నీలమైన కళ్లు పెట్టుకుని అందంగా ఉంది. బంగారురంగు జుట్టు రెండుజడలు వేసుకుంది. తెల్లటి ఫ్రాక్ వేసుకుని, కుట్టుపని చేసిన కుచ్చీ లాగు తొడుక్కుంది. ఈమెను చూస్తూనే యోధుడు నిలువునా కూలినట్టయినాడు. ఆమీ లారెన్స్ అనే ఒకానొకపిల్ల టామ్ హృదయంలోనుంచి ఒక్కసారిగా మాయమైపోయింది.

టామ్ ఈ కొత్త పిల్లను ఆరాధించసాగాడు. ఆమె తనను చూసేదాకా చాటుగా ఆమెను తాను చూడసాగాడు. ఆ తర్వాత ఆమెను చూడనట్టు నటిస్తూ, ఆమెను ఆకర్షించటానికని రకరకాల పిల్ల కొర్నాసి చేష్టలు చేయసాగాడు. ఏదో మొగ్గవేస్తూ టామ్ చూసేసరికి ఆ పిల్ల దొడ్లోనుంచి ఇంట్లోకి వెళ్ళి పోవటం కనబడింది. టామ్ విచారంతో కంచె దగ్గరికి వచ్చి నిలబడి, ఆ పిల్ల కొంచెం సేపు నిలబడుతుందని ఆశించాడు. ఆమె మెట్లమీద ఒకక్షణం ఆగి గడప లోపలికి అడుగు పెట్టటం చూసి ఒక్క నిట్టూర్పు విడిచాడు. కాని మరుక్షణమే వాడి మొహం వికసించింది. ఇంతకుముందు లోపలికి పోతూ ఆ పిల్ల బంతి పువ్వొకటి కంచెమీదుగా విసిరివేసింది.

టామ్ గబగబా పరిగెత్తుకుంటూ వచ్చి నేల మీద పడివున్న పువ్వుకు ఒకటి, రెండడుగుల దూరాన ఆగి కళ్ళకు చెయ్యిపెట్టి దూరాన ఏదో వింత జరుగుతున్నట్టుగా వీధివెంట చూశాడు. తరవాత గడ్డిపరక ఒకటి ఏరి, తలపైకెత్తి ముక్కుమీద గడ్డిపరకను నిలబెట్టటానికి యత్నించాడు. అది పడిపోకుండా అటూ ఇటూ కదులుతూ మెల్లిగా పువ్వు దగ్గరికి జరిగాడు. ఉపాయంగా పువ్వుతోడిమ కాలి వేళ్ళమధ్య పట్టుకుని వీధిమలుపుదాకా కుంటుకుంటూ పోయి, పువ్వు తీసుకుని జేబులో వేసుకుని మళ్ళీ కంచె

దగ్గిరికి తిరిగివచ్చి పొద్దూకేదాకా అక్కడే తారట్లాడుతూ, వెనకటిలాగే పిల్లి మొగ్గలు వేయసాగాడు. అయినా ఆ పిల్ల మళ్లీ కనిపించలేదు. ఆ పిల్ల ఏ కిటికీలోనుంచిగాని తనను చూసిఉంటుందని టాం ఆశించాడు. చివరకు వాడు ఇంటికి వెళ్లాడు.

రాత్రి అన్నం తింటున్నంతసేపూ వాడి ఉత్సాహం చూసి పెద్దమ్మ, "వీడికేం వచ్చింది!" అని ఆశ్చర్యపడింది. సిడ్‌మీద బెడ్డలు వేసినందుకు బాగా చివాట్లు తినికూడా టామ్ చలించలేదు. మీదుమిక్కిలి పెద్దమ్మ ఎదురుగానే పంచదార కాజెయ్యటానికి ప్రయత్నించి మొణుకులు విరగగొట్టించుకున్నాడు.

"సిడ్ పంచదార తీసుకుంటే కొట్టవే?" అన్నాడు టాం పెద్దమ్మతో.

"అవును, సిడ్ నీలాగా కొరుక్కుతినడు. నే చూడనప్పుడల్లా నీ చెయ్యి పంచదారమీదికే పోతుంది," అన్నది పెద్దమ్మ.

కొద్దిసేపటికి పెద్దమ్మ వంటింట్లోకి వెళ్లింది. సిడ్ ఎవరూ ఏమీ అంటారన్న భయం లేకుండా పంచదార పోసిన పింగాణీదొన్నె అందుకున్నాడు. కాని అది వాడి వేళ్ళనుంచి జారి కిందపడి పగిలిపోయింది. టామ్‌కు పరమానంద మయింది. కాని వాడు కిక్కురుమనలేదు. పెద్దమ్మ వచ్చి, "ఈ పని ఎవరు చేశారు?" అని అడిగేదాకా టామ్ నోరు మెదపదలచలేదు. ఆ

తరవాత ఈ "పత్తిత్తు" గాకి భరతం పట్టించి ఆనందిస్తా మనుకున్నాడు.

పెద్దమ్మ తిరిగివచ్చింది. పగిలిన పంచదార డొన్నె చూసి కళ్ళజోడుమీదుగా నిప్పురవ్వలు కురిపించింది "ఇంకొక్క క్షణంలో అబ్బాయిగారిపని!" అని టామ్ అనుకుంటున్నాడు. మరుక్షణం వాడు నేలమీద పడి ఉన్నాడు. పెద్దమ్మ రెండో దెబ్బ వెయ్యటానికి చెయ్యి ఎత్తింది. "నన్నెందుకు కొడతావ్? సిడ్ పగలగొట్టాడు," అని టామ్ అరిచాడు.

పోలీ పెద్దమ్మ నిశ్చేష్టురాలయింది. ఆవిడ నుంచి ఇక దయారసం ఒలుకుతుందని టామ్ అనుకున్నాడు. కాని ఆవిడ, "దెబ్బతింటే ఏం లే? నే చూడకుండా ఎన్ని వెధవపనులు చేశావో!" అన్నది.

అయినా ఆవిడ అంతరాత్మ బాధపడింది. జాలిగా ఏమన్నా అందామనుకున్నది గాని గుట్టుచెడిపోయి, టామ్‌కు అలుసవుతుందని సంకోచించింది. అందుచేత ఆవిడ పైకేమీ అనకుండా తనపనులు చూసుకోసాగింది.

పెద్దమ్మ మెత్తబడ్డ సంగతి టామ్ గ్రహించాడు. కాని తాను మెత్తబడదలచుకోలేదు. ఆవిడ కుమిలిపోవాలిసిందే. తాను జబ్బుచేసి చచ్చిపోతున్నట్టు ఊహించుకున్నాడు. మంచిగా ఒక్కమాట అనమని ఆవిడ బతిమాలుతుంది. తాను గోడకు తిరిగి అట్లాగే

చచ్చిపోతాడుగాని, తననోట ఆ మాటమట్టుకు రాదు. అప్పుడెట్లా ఉంటుంది ఆవిడకి? తాను నదిలో పడి చచ్చి పోయినట్టూ, తన శవాన్ని తడితడిగా ఇంటికి తెచ్చినట్టూ టామ్ ఊహించుకున్నాడు. ఆవిడ తనమీద పడి వలవలా, కన్నీరు వరదలయేట్టు ఏడుస్తుంది. తన పిల్లవాణ్ణి తన కిమ్మనీ, ఇక ఎన్నడూ వాణ్ణి కోప్పడనని దేవుడికి దణ్ణాలు పెడుతుంది. కాని తన కష్టాలన్నీ గట్టెక్కి ఉంటాయి.

ఈవిధంగా ఆలోచించుకుపోతున్న కొద్దీ టామ్‌కు దుఃఖం తెరలు తెరలుగా పొర్లి వచ్చి ఉక్కిరిబిక్కిరి అయినాడు. వాడి కంటివెంట కన్నీరు ఉబికి వచ్చి ముక్కుమీదికి కారసాగింది. తన కష్టాలను తలచుకొనడంవల్ల కలిగే ఈ దుఃఖంతో కలిగిన ఆనందాన్ని ఇతర ప్రాపంచిక సుఖాలతో పాడుచేసుకొన దలచ లేదు. అందుచేత వారంరోజుల క్రితం చుట్టాలింటికి వెళ్ళి తిరిగివచ్చిన మేరీ గెంతుతూ, పాడుతూ తనగదికి వచ్చేసమయానికి టామ్ మరో వాకిలిగుండా తన దుఃఖాన్ని శాలువలాగా కప్పుకుని బయటికి వెళ్ళి పోయినాడు.

టామ్ బయటికి వెళ్లాడు. కొత్తచోట్లా, పిల్లలు రానిచోట్లా తిరిగాడు. నదిలో ఒక కొయ్యతెప్ప కనిపించింది. దానిమీద ఎక్కికూర్చున్నాడు. బాధ లేకుండా నీళ్ళలో పడి చావగలిగితే బాగుండు ననుకున్నాడు.

దాచుకున్న బంతిపువ్వు జ్ఞాపకంవచ్చింది. అది పైకి తీశాడు. నలిగి వాడిపోయి ఉంది. పేరు తెలియని ఆ అమ్మాయి కసేపం తనను చూసి జాలిపడుతుందా అనుకున్నాడు. చివరకు తెప్పను వదిలి చీకట్లో బయలు దేరాడు.

రాత్రి తొమ్మిదిన్నర, పదిప్రాంతాల "ఆ అమ్మాయి" ఉండే గొందిలోకి వచ్చాడు టామ్. ఎక్కడా మనుష్యసంచారం లేదు. మిద్దెమీద ఒక గదిలో దీపం వెలుగుతున్నది. ఆ అమ్మాయి అక్కడ ఉంటుందా అనుకున్నాడు. వాడు కంచెమీదనుంచి లోపలికి దిగి పాదులమధ్యగా ఆ గదికిందికి వెళ్లి చాలా సేపు పైకి చూశాడు. తరవాత అక్కడే నేలమీద వెల్లకిలా పడుకుని, నలిగిన పువ్వు చేత్తోపట్టుకుని, చేతులు రొమ్ముమీద పెట్టుకున్నాడు. ఇల్లూ, నీడా, దిక్కూ, మొక్కూ లేకుండా తను ఇట్లాగే చచ్చిపోతే రేపుఉదయం తెల్లారిన తరవాత ఆ అమ్మాయి కిటికీతలుపు తెరిచి ఆనందంతో బయటికి చూసినప్పుడు తాను కనిపిస్తాడు. తనకోసం ఆ పిల్ల ఒక్క కన్నీటిచుక్క రాల్చదా?

ఇంతలో కిటికీ తెరుచుకుంది. పనిమనిషి మొరటుతిట్లు వినిపించాయి. చావసిద్ధంగా ఉన్న అభాగ్యుడిమీద కుండెడు నీరు పడింది. వాడు లేచాడు. తనమీద ఎవరో ఏదో విసిరిన చప్పుడయింది. తర

వాత ఏదో గాజువస్తువు పెళపెళా పగిలినట్టయింది. టామ్ కంచె దూకి దారితీశాడు.

మరి కొంతసేపటికి టామ్ తన తడిసిన దుస్తులు విప్పేసి పడుకోవటానికి సిద్ధపడుతూండగా సిడ్ నిద్ర లేచాడు. వాడేదో అందామనుకున్నాడు. కాని టామ్ నోటికి వెరిచి ఊరుకున్నాడు. టామ్ ఆ పూట దేవుడి ప్రార్థన చెయ్యకుండా పడుకున్న సంగతి మాత్రం సిడ్ కడుపులో పెట్టుకున్నాడు.

మర్నాడు ఆదివారం. ఉదయం భోజనాలు పూర్తికాగానే పోలీ పెద్దమ్మ అందరినీ చేర్చి ప్రార్థనలు చేసింది. టామ్ పళ్ళబిగువున బైబిల్‌లో అయిదుగీతలు వప్పగించటానికి పూనుకున్నాడు. సిడ్ తనవంతు ఎప్పుడో వప్పగించేశాడు.

టామ్ అరగంటసేపు పఠించినా కొంచెంకూడా తల కెక్కలేదు. వాడి ఆలోచనలు ఎటో వెళ్లాయి. వాడి చేతులుకూడా ఒక్క క్షణంపాటు ఊరికే ఉండలేదు.

మేరీ వచ్చి టామ్ వల్లించిన గీతలు వప్పగించుకోవటానికి ప్రయత్నించింది. కాని ఎన్నిసార్లు అందించినా వాడికి కవి రాలేదు.

“ఒరే, పిచ్చివాడా! నీకేమీ రాలేదు. మళ్ళీ చదువు. వల్లించావంటే భలే వస్తువు ఇస్తాను. చదువు. మంచివాడివి కాదూ?” అన్నది మేరీ.

"అట్లాగే, మేరీ. ఏమిస్తావు?"

"ఇప్పుడు చెప్పను. ఎంతో మంచివస్తువు."

ఈసారి టామ్‌కు అయిదుగీతలూ క్షణంలో వచ్చేశాయి. మేరీ వాడికి కొత్తచాకు ఇచ్చింది. దానిమీద "బార్లో" అనేపేరు చూసి టామ్ పరవశుడైనాడు. ఆ చాకు ఏది కొయ్యటానికీ పనికిరాదు. అయితేనేం? అది "బార్లో" చాకు. దాంతో టామ్ అలమారు ఉత కత్తాడు. బీరువామీద కూడా దాన్ని ప్రయోగిస్తూండగా ఆదివారం బడికి పోవాలని పిలుపు వచ్చింది.

మేరీ నీళ్లూ, సబ్బూ ఇచ్చింది. టామ్ వాటిని తీసుకుని బయటికి వెళ్ళాడు. నీటిని ఒక బెంచిమీద పెట్టి, సబ్బు నీటిలో ముంచి పక్కనే పెట్టాడు. చొక్కా చేతులు పైకి మడిచి మెల్లిగా నీరు పారబోసి లోపలికి వచ్చి తలుపుచాటున తువాలుతో శ్రద్ధగా మొహం తుడుచుకోసాగాడు.

మేరీ వాడిచేతిలోనుంచి తువాలు లాగేసి,

"సిగ్గు లేదురా, టామ్? నీళ్లు తగిలితే మొహం పాడవుతుందా?" అని అడిగింది.

మళ్ళీ నీరు ప్రత్యక్షమయింది. టామ్ కొంతసేపు సంకోచంగా నిలబడి, గట్టిగా పీల్చి ఉపక్రమించాడు. కొంతసేపటికి వాడు కళ్లు రెండూ మూసుకుని, తువాలు కోసం తడుముకుంటూ లోపలికి వచ్చాడు. ఈ సారి

వాడి మొహంనిండా సబ్బుబుడగలుసాక్ష్యం ఉన్నాయి. కాని మొహం తుడుచుకున్నాక చూస్తే గడ్డంవరకూ, దవడవరకూ మాత్రమే శుభ్రమయింది. మెడమీద మట్టి నల్లగా ఉండనే ఉన్నది. ఈసారి మేరీ స్వయంగా చెయ్యిచేసుకుంది. ఆమె వాడిఅంతు కనుక్కున్న అనంతరం తడిజుట్టు చక్కగా దువ్వింది. మంచి దుస్తులు-ఆదివారంనాడు మాత్రమే వేసుకునేవి-తొడిగింది. ఇప్పుడు వాడు చూడటానికి బాగున్నాడు. కాని సుఖంగా లేడు. వాడికి ఇన్ని దుస్తులుగాని, ఇంత శుచిత్వంగాని సరిపడవు. మేరీ టామ్ కాలిజోళ్లుకూడా మరిచిపోలేదు.

కొద్దిసేపట్లో మేరీ, ముగ్గురు పిల్లలూ ఆదివారంబడికి బయల్దేరారు. ఈ బడి అంటే టామ్‌కు మంట. కాని సిడ్‌కూ, మేరీకి చాలా ఇష్టం.

తొమ్మిదినుంచి పదిన్నరదాకా బడి. తరవాత చర్చి. చర్చివాకిలిదగ్గిర టామ్ వెనకపడి ఒక కుర్రాణ్ణి పలకరించి, "బిల్లీ, నీదగ్గిర పచ్చ టిక్కెట్టుందా?" అని అడిగాడు.

తనదగ్గిర ఉన్న వస్తువొకటి బిల్లీకి అంటగట్టి టామ్ వాడిదగ్గిర ఉన్న పచ్చటిక్కెట్టు తీసుకున్నాడు. మరొకడికి బిళ్ళేరుగోలీ లిచ్చి మూడు ఎర్రటిక్కెట్లు తీసుకున్నాడు. ఇంకొకడిదగ్గిర రెండు నీలంటిక్కెట్లు తీసుకున్నాడు. పది, పదిహేను నిమిషాలపాటు టామ్ ఈ విధంగా రంగురంగుల టిక్కెట్లు పోగుచేసి, ఇతర పిల్ల

లతో బాటు చర్చిలోకి ప్రవేశించాడు. వాడు తన స్థానంలో చేరి దొరికిన మొదటి పిల్లవాడితో పోట్లాట పెట్టుకున్నాడు. పంతులు వచ్చి తగువు నిలిపాడు. ఆయన అటు తిరగ్గానే ఇంకో పిల్లవాడి జుట్టులాగి, వాడు తిరిగి చూసేలోపల టామ్ దీక్షగా పుస్తకం చదవసాగాడు. తరవాత ఇంకో కుర్రాణ్ణి పిన్నుతో పొడిచాడు. పంతులు వచ్చి చివాట్లు పెట్టాడు.

ఈపిల్లలలో ఒకడికీ నిజంగా పాఠం రాదు. ఏదో విధంగా నట్టుతో గీతాలు వప్పగించి రంగు టిక్కెట్లు పుచ్చుకొనేవాళ్లు. రెండుగీతాలు వప్పగించిన వారికి ఒక నీలంటిక్కెట్టు. ఒక ఎర్రటికెట్టు పది నీలంటికెట్లకు సమానం. ఒక పచ్చటిక్కెట్టు, పది ఎర్రటిక్కెట్లకు సమానం. పది పచ్చటిక్కెట్లు సంపాదించిన పిల్లలకు సూపర్నెంటు సాదాబైండు చేసిన బైబిలు ఇచ్చేవాడు. పాతవిద్యార్థులు మాత్రమే ఈ రంగు టిక్కెట్లను భద్రంగా దాచుకుని కొన్ని ఏళ్ళతరువాత బైబిల్ సంపాదించుకొనేవాళ్ళు. ఎవరైనా బైబిల్ తీసుకున్న రోజు వింతగా ఉండేది.

కొంతసేపైన తరవాత సూపర్నెంటు లేచి నిలబడ్డాడు. ఈయనపేరు వాల్టర్స్. వయసు 35 ఏళ్ళు. ఆయనకు ఆదివారమంటే ఎంతో భక్తి. ఆ రోజున

ఆయన గొంతే మరోలా ఉండేది. ఆయన ఈ విధంగా మాట్లాడసాగాడు.

"చూడండి, పిల్లలూ, మీరంతా ఒక్క క్షణం నిశ్శబ్దంగా కూర్చుని నే చెప్పేది వినండి. అదీ! మంచి అబ్బాయిలూ, అమ్మాయిలూ అలాఉండాలి. ఒకపిల్ల కిటికీలోంచి చూస్తూంది. నేను బయట ఎక్కడో, ఏ చెట్టుకొమ్మమీదో ఉండి, ఏ పిట్టలతోనో మాట్లాడుతున్నా ననుకుంటోంది కామోసు. (పిల్లల నవ్వు) మీరంతా శుచిగా, మంచిగా, సత్ప్రవర్తన కలిగి ఉండటం నాకెంతో ముచ్చటగా ఉంటుంది." ఈ ధోరణిలో ఆయన మాట్లాడుకుపోయాడు. ఆయన ఉపన్యాసం కొంతసేపు కొనసాగినంతలో మళ్ళీ యుద్ధం ఆరంభమయింది. గుసగుసలు ఎక్కువైనాయి. శ్రద్ధగా భక్తిగా వినేవాళ్ళ ఏకాగ్రతకూడా చెడింది. ఉన్నట్టుండి అకస్మాత్తుగా సద్దు నిలిచిపోయింది. వాల్టర్ ఉపన్యాసం నిలిచిపోవడంతో మౌనంగా పిల్లలందరూ కృతజ్ఞతా సూచకంగా చిరునవ్వులు వెదజల్లారు.

అసలు గుసగుసలు ఆరంభించడానికి కారణం కొత్తవాళ్ల రాక. ఒక వృద్ధుడు, ఒక మధ్యవయస్కుడు థాచర్, అతని భార్యా వచ్చారు. అతని భార్య ఠీవిగా నడుస్తుంది. ఆమెకుకూడా ఒక అమ్మాయివుంది టామ్ హడావిడిగా అటూఇటూ చూస్తున్నాడు. అతనిహృదయంలో ఆవేగం హెచ్చింది. ఆమీలారెన్స్ ప్రేమ

ఉట్టిపడేలాగు అతనివంక చూస్తోంది. కాని టామ్ ఆమె కళ్ళల్లోకి చూడలేకపోతున్నాడు. అతని దృష్టి ఒకసారి ఆమెవంకా, మరొకసారి ఆ కొత్త అమ్మాయివంకా, పరుగులు పెడుతోంది. ఆ కొత్త అమ్మాయిని చూస్తుంటే అతనిఒళ్లు పరవశమైపోతోంది. హుషారెక్కువయింది. నలుగురూ చూడాలన్నట్టు మరింత అల్లరి చెయ్యడం ఆరంభించాడు టామ్. పక్కనున్న వాళ్ళను పొడవడం, గెంటడం, జుట్టు పీకడం మొదలెట్టాడు. తనకి చేతనైన కొంటెపనులన్నీ చూపిస్తున్నాడు. ఆ పిల్లకి తనప్రజ్ఞ పూర్తిగా బోధపడింది. అయితే ఈ హుషారులో రాత్రి మీదపడిన చన్నీళ్ళు కూడా అప్పుడప్పుడు జ్ఞాపకం వస్తూనేఉన్నాయి.

వాల్టర్ ఉపన్యాసం ముగించగానే కొత్త వాళ్ళని అందరికీ పరిచయం చేశాడు. మధ్యవయస్కుడు చాలా గొప్పవాడు—జడ్జి. అతని వూరు ఇక్కడికి చాలా దూరంకూడా. దేశంచాలా చూశాడన్నమాట. ఆయన తమ్ముడు థాచర్. అప్పుడక్కడ చేరినవాళ్ళందరూ ఎవళ్ల గొప్ప వాళ్లు చూపించుకుంటున్నారు. వాల్టర్ అందరికీ ఆజ్ఞలిస్తున్నాడు. లేడీటీచర్లు మాటిమాటికీ జుట్టు సవరించుకుంటున్నారు. మాటిమాటికీ రుమాళ్లు తీసి ముఖాలు అద్దుకుంటున్నారు. అల్లరి చేస్తున్న పిల్లలకేసి ఒకసారి కోపంతో చూసి, అంతలోనే ముఖమంతా విప్పారించి నవ్వు తెచ్చుకుంటు

న్నారు. మొగపిల్లలు మహాగర్వంతో ఎగిరిపడుతున్నారు. ఆడపిల్లలకి మరింత నాజూకు ఎక్కువయింది. ఇదంతా చూస్తూ తన్ని గౌరవిస్తున్నారని జడ్జీగారి మూతి నవ్వుతో బిగుసుకుపోయింది.

ఇవ్వాళ ఎలాగైనాసరే తన స్కూల్లో అద్భుతంకల పిల్లలున్నట్టు చూపించుకోవాలని వాల్టర్ తాపత్రయపడుతున్నాడు. ఒకణ్ణి ఎంచి వాడికి బైబిల్ బహుమతీ ఇవ్వాలనుకున్నాడు. పిల్లలదగ్గిర కెళ్లి వాళ్ళ దగ్గిర టికెట్లు లెక్క పెట్టటం మొదలెట్టాడు. కాని బైబిల్ బహుమతి ఇవ్వడానికి కావలసినన్ని టిక్కెట్లు ఎవ్వరి దగ్గిరా కనబడలేదు. పాపం చూస్తున్నకొద్దీ వాల్టర్ మొహం మాడిపోతోంది.

పాపం చాలా వరకు ఆశ చచ్చిపోయింది. ఇంతలో టామ్‌సాయర్ ముందుకొచ్చాడు ఠీవిగా. వాడివద్ద తొమ్మిది పసుపుపచ్చ టిక్కెట్లు, తొమ్మిది ఎర్రటిక్కెట్లు, తొమ్మిదినీలిరంగుటిక్కెట్లు ఉన్నాయి. అవి చూపించి బైబిల్ ఇవ్వమని దర్జాగా అడిగాడు. వాల్టర్ కి నెత్తిమీద పిడుగు పడినట్టయింది. 5 ఏళ్ళ నించి టామ్ సంగతి ఆయనకి తెలుసును. టామ్‌కి ఈ సమర్థత ఉండదని ఆయన నమ్మకం. కాని ఎల్లా? టామ్‌దగ్గర అన్నిటిక్కెట్లు ఉన్నాయి. సరే ఇంకతప్పింది కాదు. టామ్‌ను జడ్జి, థాచర్ కూచున్న పీఠం దగ్గిరికి తీసుకెళ్లారు. హాల్లో ఉన్నవాళ్లందరూ ఆశ్చర్యపడ్డారు.

ఈమాటలు అందరూ జడ్జి కేసేకాదు టామ్‌వంక కూడా అద్భుతంగా చూస్తున్నారు. పిల్లలంతా అసూయపడ్డారు. గోళీలూ, అవీ తీసుకుని టిక్కెట్లిచ్చిన వాళ్ల సంగతి చెప్పనే అక్కర్లేదు. వీడి కెందుకిచ్చామా అనుకుని మరింత రోషంతో ఉడికి పోతున్నారు.

పెద్ద ఆర్భాటంతో సౌగన్యాలతో టామ్‌కి బహుమతి ఇచ్చారు. టామ్‌కి లోలోపల బెరుగ్గానే వుంది. తనలో ఎంత సరుకుందో తనకే తెలుసును. ఆమీ-లారెన్స్ ప్రేమతో, గర్వంతో టామ్‌వంకనే తదేకంగా చూస్తోంది. టామ్ తనవంక చూడాలని కోరుకుంది. కాని వాడు ఆమె చూపుల్నుంచి తన చూపులు తప్పించుకుంటున్నాడు. ఆమెకి కొంత ఆశ్చర్యం కలిగింది. క్రమంగా ఏదో అనుమానంకూడా కలిగింది. పరీక్షగా వాడిని చూసింది. వెంటనే ఆమెకి అర్థం అయింది. భంగపడిన ఆమె హృదయంలో అసూయ భగభగమండ నారంభించింది. కోపం వచ్చింది, కళ్ళు నీళ్లతో నిండాయి.

టామ్ నోరు మెదపడంలేదు. గుండె గబగబా కొట్టుకుంటోంది. జడ్జిగారుటామ్‌తలపైన చెయ్యివేశారు.

"నీపేరేమిటమ్మా" అని అడిగారు.

టామ్‌కు ఊపిరి నిలిచిపోయినట్టయింది. బలవంతాన మాటలు పెగిలివచ్చాయి. "టామ్''

"ఆ హా హా టామ్ అనకూడదు..."

"థామస్"

"ఆ. అలాగ, అయితే ఏదీ, అంతేనా నీ పేరు? ఇంకా వుంది కాదూ? చెప్పమరి"

"నీ పేరు పూర్తిగా చెప్పు నాయనా. చివర సర్ అనికూడా అనాలి ఆయనతో."

"థామస్ సాయర్ సర్."

"అదీ, అలాగ, నువ్వు మంచివాడవ్, అబ్బా రెండువేలు పద్యాలు కంఠతాపట్టావ్! అల్లా కష్టపడి నేర్చుకోవాలి. అదే గొప్పవాళ్ల లక్షణం, నువ్వుకూడా పెద్దవాడివైన తరువాత ఇంకా నేర్చుకుంటావ్. గొప్ప వాడవు తావ్. ఏదీ నేర్చుకున్నవాటిలో రెండుపదాలు చదువు వింటాం అందరమూ ముందు క్రీస్తు శిష్యులు పన్నెండుగురి పేర్లు చెప్పు చూద్దాం."

టామ్ చొక్కా బొత్తాం పట్టుకుని నలుపు తున్నాడు. బుర్ర వొంచుకున్నాడు. ముఖం, ముక్కు ఎర్రబడ్డాయి. కాళ్లు వొణికిపోతున్నాయి. వాణ్ని చూస్తుంటే వాల్టర్ కి గుండెలు జారిపోయాయ్. తెల్ల మొహం వేశాడు. హు. ఎందుకొచ్చిందిరా బాబూ ఈ పీడ అనుకుంటున్నాడు.

"జవాబు చెప్పు థామస్, జడ్జీగా రడుగుతు న్నారు. భయపడకూడదు".

టామ్ తలెత్తలేదు, నోరు మెదపలేదు.

ఈమారు జడ్జీగారి భార్య అడిగింది. "నాకు చెప్తావుకాదు బాబూ, మంచివాడివ్, చెప్పు పన్నెండు గురు శిష్యులూ ఎవరు?"

"డేవిడ్, గోలియత్"

వాల్టర్ గతుక్కుమన్నాడు. జడ్జీగారి భార్య నిర్ఘాంతపడి కుర్చీలో వెనక్కి చేరబడింది. ఇహా మరి ఏం జరిగిందో చెప్పడంకంటె మానడం మంచిది. పాపం టామ్.

# 4

మళ్లీ ఆదివారం పదిన్నర గంటలకి చర్చికి వెళ్లాడు టామ్. కూడా పోలీ పెద్దమ్మ, సిడ్, మేరీ ఉన్నారు. ప్రార్థనలూ మొదలైనవి నడుస్తున్నాయి. కాని ఏదీ టామ్‌కి చెవి కెక్కడంలేదు. మధ్య మధ్య గుసగుసలు తప్ప ఎక్కువసద్దు వినపడ్డంలేదు. ముందున్న బెంచిచెక్కమీద ఈగ ఒకటి వాలింది. అది చూసేసరికి టామ్‌కి చెయ్యి ఆగడంలేదు. ఆ ఈగ ఊరికే చేతులు (ముందు కాళ్లు) నులుముకుంటోంది. మెడవొంచి చేతుల్తో రుద్దుకుంటోంది. సన్నని మెడ కనిపించీ కనిపించకుండా ఉంది. తల ఊడిపడుతుందా అనిపించింది టామ్‌కి. ముఖం సబ్బుతో రుద్దుకుంటు న్నట్టు గబగబా చేతుల్తో తల రాచుకొంటోంది ఈగ. అది చూసినకొద్దీ టామ్ ఉండబట్టలేకపోతున్నాడు.

కాని అక్కడ దేవుడి ప్రార్థన జరుగుతుండగా ఇలాటి పని చేస్తే అమ్మో! అనుకున్నాడు టామ్. అలాగే చూస్తూ ఊరుకున్నాడు. ప్రార్థన పూర్తికావడం తడవు గభాల్న పట్టేశాడు ఈగని. చక్కగా చేతిలో చిక్కింది ఈగ. పోలీపెద్దమ్మ పీడిని కనిపెడుతూనే వుంది. వెంటనే ఈగని వొదిలిపెట్టించింది.

ప్రార్థనతరవాత ఫాదర్ ఏదో చెప్పుకుపోతున్నాడు. అదంతా ఏమిటో టామ్‌కి ఒక్కముక్కైనా అర్థం కాలేదు. కాని ఒక మాటమాత్రం వాడికి చిత్రంగా తోచింది. అదేదో గొప్ప రోజు వొస్తుందట. ఆరోజున సింహాం మేకపిల్ల కలిసి చెట్టాపట్టాలు వేసుకుని నడుస్తాయట. చిన్న పాపకూడా వాటిని నడపగలుగుతాడు. ఈ మాటలుమాత్రం టామ్ చెవికెక్కాయి. వాడి కష్టండు బలే ఉద్దేశం తట్టింది. ఆ నడిపే పిల్లవాడు తనే ఎందుకు కాకూడదు? సింహాం అంత మంచిదీ, సాధువు అయితే?

ఇంతలోకే టామ్‌కి తన జేబులో దాచుకున్న పేడపురుగు జ్ఞాపకంవచ్చింది. దాన్ని అగ్గిపెట్టిలో దాచాడు. మెల్లిగా పైకి తీశాడు. అగ్గిపెట్టి తెరవగానే అది చేతిమీదికి పాకింది. దానికి పెద్ద నోరుంది. అది తెరిచి వేలు కరిచింది. దాంతో వాడు వేలు టపటప విదిల్చాడు. పురుగు వెళ్లి బెంచీలపక్కగా నేలమీద పడింది. పడ్డంలో వెల్లకిలా పడి బోర్ల పడలేక వెన్ను

మీద గుండ్రంగా తిరగడం మొదలెట్టింది. కాళ్లు ఊరికే తన్నుకుంటోందికాని ఫోర్స్ పడ లేదు. టామ్ చూశాడు. వెళ్లి పట్టుకోవాలనివుందికాని కదలడానికి వీల్లేదు. పురుగుని పక్కనున్న వాళ్లు కూడా చూశారు. ఫాదర్ ఉపన్యాసంతో విసుగెత్తింది కాబోలు వాళ్లు పురుగునే చూస్తూ ఉండిపోయారు.

మెల్లిగా అక్కడికొక బుల్లి సీమకుక్క పిల్ల వొచ్చింది. దానిక్కూడా యజమానిదగ్గర అంత సేపు ఏమీ చెయ్యకుండా కూర్చోడానికి విసుగుపుట్టింది. ఏమిచేద్దామా అని ఆలోచిస్తూ నడిచి వొస్తోంది. దారిలో పురుగు కనిపించేసరికి దాన్ని పరామర్శించాలని బుద్ధిపుట్టింది. ముడుచుకున్న తోక లేచి నాట్యం చెయ్యడం మొదలెట్టింది. పురుగుని శ్రద్ధగా అంత దూరంనించి చూసింది. కొంతదూరంగానే వుంటూ చుట్టూ తిరిగి నాలుగు పెడల్నించీ పరికించింది. వాసన చూసింది. ఇంకోచుట్టు తిరిగింది. ఈమారు కొంచెం దగ్గరకివచ్చి చూసింది. వాసన చూసింది. మరోచుట్టు తిరిగింది. మరి కొంత ధైర్యం చిక్కింది. పురుక్కి దగ్గరగా ముక్కుపెట్టి వాసన చూసింది. ముట్టె పై పెదవి తెరిచి పళ్లతో పట్టుకోబోయింది. కాని కాస్తలో తప్పిపోయింది. సరిగా పట్టుకోడానికి ధైర్యం లేకపోయింది. ఇలాగ పురుగుని తాకకుండా దాని చుట్టూ ఆడుతోంది. ఇంక పురుగు తననేమీ చెయ్య

దని ధైర్యం తోచినప్పుడు మెల్లిగా దానిదగ్గిర పొట్ట మీద పడుకుంది. ముందు రెండుకాళ్ల మధ్యనూ పురుగువుంది. ముక్కుతో వాసన చూడ్డం కొంతసేపు జరిగాక కుక్కపిల్లకి విసుగుపుట్టింది. ఆట మార్చాలనుకుంది తల కొంచెం ఓరగా పెట్టి ముట్టెతో పురుగుని ముట్టుకుంది. ముట్టుకోడంతపని పురుగు ముట్టెని కరిచి పట్టుకుంది. కుక్కపిల్ల కుయ్యో, మొయ్యో మంటూ గంతు లేసింది. బుర్రగట్టిగా ఝూడించింది. పురుగు వెళ్లి రెండు గజాలదూరంలో పడింది. కాని మళ్లీ వెల్లకిలానే పడింది. చూస్తున్న వాళ్లందరికీ నవ్వొచ్చింది. విసనకర్రలూ, రుమాళ్లూ ముఖాలకి అడ్డుపెట్టుకున్నారు. టామ్‌కి ఇదంతా బలేగా ఉందనిపించింది.

కుక్కపిల్ల వెర్రిమొహం వేసుకు చూసింది. కొంచెం ఉక్రోషం వచ్చింది. పురుగుమీద కసితీర్చుకోవాలనుకుంది. పురుగు దగ్గిరకెళ్లి దాడి మొదలెట్టింది. పురుగుచుట్టూ తిరిగి అన్నివైపుల్నించీ దానిమీద కురకడం మొదలెట్టింది. కాలితో పురుగుని ఝాడడానికి ప్రయత్నించేది. కాని ధైర్యంచాలక కొద్దిదూరంలో పడేది కాలు. పళ్ళతో పట్టుకోబోయి మానేది. తల అటూఇటూ తిప్పేది. చెవులు టపటపమనేవి. కొంతసేపటికి కుక్కపిల్లకి మళ్లీ విసుగుపుట్టిదిం. ఆ పరిసరాల్లో ఈగలూ, చీమలూ ఏవైనా దొరుతా

యేమో అని వెతికింది. గోడమూలలు చూసింది. ఒక చోట ఒక కండచీమ కనపడింది. దాని వెనకాలే మట్టిలో చూసుకుంటూ వెళ్ళింది. కొంతదూరంపోయాక అది ఒకకన్నంలో దూరిపోయింది. ఇంక చెయ్యడాని కేంలేక కుక్కపిల్ల అటూఇటూ చూసుకుంటూ వెళ్లింది. ఆవులించింది. కూచుంది. పేడపురుగుమాట మరిచి పోయింది. వెళ్లి వెళ్లి చూసుకోకుండా దానిమీద కూచుంది. కూచుని కూచోడంతోనే మళ్లీ కుయ్యో మంటూ పరుగు తీసింది. బెంచీలకింద దూరి పరుగు లెత్తింది. తలుపుల్ని రాసుకుంటూ హాల్లో అటూఇటూ ఎగగంతులేసింది. పరిగెత్తిన కొద్దీ అరుపు లెక్కువై నాయి. ఒకచోట ఆగి ముడ్డి రాసుకుంటూ గిరగిరా తిరిగింది. తరవాత దేకింది. అప్పటితో బాధ తీరింది. ఇంక మరి ఆగలేదు. యజమాని దగ్గిర కెళ్ళి పడింది. అత నొక్క తోపుతోశాడు. ఒక్కసారి కుంయ్‌మంది. తరవాత కొంతదూరాన వెళ్లి దీనంగా చూస్తూ కూచుంది.

ఈ గొడవతో ఫాదర్ ప్రబోధం హరాం చేసింది. అందరూ నవ్వుతున్నారు. ధ్యానం మళ్లిపోయి నందువల్ల ఫాదర్ ఎంత పవిత్రసందేశాల్ని గురించి చెప్పినా అందరికీ వేళాకోళంగా, అదో తమాషాగా తోచాయి. ఫాదర్ ఇంక ఆట్టేసేపు ఉపన్యాసం చెప్ప లేదు. రెండుమాటల్లో పూర్తిచేశాడు.

చర్చికి వెళ్ళడం అంటే ఇంక ఫరవాలేదను కున్నాడు టామ్. ఇలాంటి గమ్మత్తులుంటే చాలు ఫరవాలేదు. కాని తనపురుగు మాత్రం తనికి మళ్ళీ దొరకలేదు.

సోమవారం వచ్చింది. సోమవారం వచ్చిందంటేనే టామ్‌కి బాధ. రెండురోజులు సెలవుల తరవాత వారంరోజులుబడి. అసలు సెలవులు రాకుండా ఉంటే మంచిదనిపిస్తుంది.

టామ్ ఆలోచిస్తూ పడుకున్నాడు. ఈపళాన్ని తనకి ఏదో జబ్బు రాకూడదూ! వస్తే స్కూలుకి వెళ్ళనక్కర లేకుండా ఇంటిదగ్గరే ఉండిపోవచ్చు. ఇదెందుకు వీల్లేదు? టామ్ గట్టిగా ఆలోచించాడు. ఒంట్లో ఇప్పుడేం బాధ వుంది? ఏదీ ఉన్నట్లు కనిపించలేదు. ఒంట్లో ఎక్కడ ఏకాస్తకూడా నెప్పిలేదు? అని పరిక్ష చేసుకున్నాడు. పొట్ట ఉబ్బరం ఉందేమో! నెప్పి పెట్టడంలేదూ? కాస్సేపు నెప్పి ఉంటే ఎలా వుంటుందో ఆలోచించు కున్నాడు. అబ్బే ఆ లక్షణమేమీ కనపట్టంలేదు. ఇంకో ఆలోచన చట్టున తట్టింది. పై పళ్ళలో ఒకటి కొంచెం కదుల్తోంది. ఆ బలేగా దొరికింది. ఇంక మూలగడం మొదలెట్టా లనుకున్నాడు. కాని తీరా ఇది మొదలెడితే పెద్దమ్మ వచ్చి ఆ పన్ను పీకుతుందేమో నని భయం వేసింది. ఇదిప్పటికి మానేద్దా మనుకున్నాడు. ఎప్పుడో ఒకడాక్టర్ ఒకటి చెప్పినట్లు జ్ఞాపకం

వచ్చింది. అదొస్తే రెండుమూడు వారాలు మంచమెక్కుతారట. కాలి బొటనవేలు కోసెయ్యవలసి వస్తుందికూడా. కప్పుకున్న దుప్పటి కొంచెం పైకిలాగి కాలి బొటనవేలు—దెబ్బ తగిలినది—పైకి తీశాడు. పడుకునే దానివంక చూశాడు. మరైతే దీని లక్షణాలేమిటో టామ్‌కి తెలియదు. అయితే అయింది, ప్రయత్నం చెయ్యాలనుకున్నాడు. అక్కడనించి గట్టిగా మూలగడం మొదలెట్టాడు. సిడ్ లేవలేదు. మరీగట్టిగా మూలిగాడు. సిడ్‌కి మెళుకువ రాలేదు. గుర్రుపెడుతున్నాడు కూడా. ఇంక టామ్ నోరెత్తి అబ్బో అమ్మో అని గట్టిగా అరిచాడు. ఊహు. సిడ్ కదల్లేదు. ఒళ్లు మండుకొచ్చింది. సిడ్‌ని ఒక్కగుంజు గుంజాడు. వాడు లేచాడు. కళ్లు నులుముకుని చూసేటంతలో గట్టిగా మూలగడం రొప్పడం మొదలెట్టాడు టామ్.

"అరె ఏమిట్రా, ఏమయింది?"

టామ్ జవాబివ్వలేదు. మరీ గట్టిగా మూలిగి చేతులూ కాళ్లూ గిజగిజ కొట్టుకుంటున్నాడు.

సిడ్‌కి భయంవేసింది.

"అరె టామ్. ఇదిగో చూడు, ఏమిటయింది, నాకు చెప్పు."

"ఉండరా బాబూ. నన్ను ముట్టుకోకు చచ్చిపోతున్నాను."

"ఛ. అదేమిటి. అసలు బాధేమిటో చెప్పరా... కాస్సేపు మూలగటం ఆపెయ్. ఏమిటో నాకు చెప్పు."

"వొద్దులేరా ఉండు. అదే తగ్గిపోతుంది. ఎవర్నీ పిలవకు."

"అదేమిటి, అసలెంత సేపట్నుంచి?"

"అబ్బో చాలా సేపట్నుంచి."

"మరి నన్నెందుకు లేపలేదు"

"పోనీలేరా. ఇంతవరకూ నువ్వు చేసిన వాటన్నిటికీ నిన్ను క్షమించాను సిడ్. నేను పోయినప్పుడు..."

"ఛ, అవేం మాటల్రా! ఉండు చెప్తా..."

"ఏం వొద్దురా సిడ్. అందర్నీ క్షమించాను. అలాగని అందరితోను చెప్పు.. నా ఒంటికన్ను పిల్లిని ఆకొత్తమ్మాయి కిచ్చెయ్యి. ఆఅమ్మాయితో చెప్పు..."

"పెద్దమ్మా, పెద్దమ్మా రావాలి, తొరగా రా. టామ్ చచ్చిపోతున్నాడు," అంటూ పొలికేకలు పెట్టాడు సిడ్.

"ఏడిశావు. అంతా ఉత్తదే" అంటూనే పెద్దమ్మ గబగబా వచ్చింది. వెనకాలే మేరీకూడా వచ్చింది. టామ్ని చూసేసరికి పెద్దమ్మకి ముచ్చెమట్లూ పోశాయి. "నాయనా ఏమిట్రా. చెప్పు టామ్, ఏమిటి?

"పెద్దమ్మా..."

"ఏమిటి"

"బాబో నా వేలు పుండు బాబో"

పెద్దమ్మ గబగబా బొటనవేలు చూసింది. కుర్చీలో కూలబడి "హారీ. నీకడుపుడక. ఎంత అల్లరి చేశావురా దీనికి. చాల్లే ఇంక నోర్మూయ్."

మూలుగు ఆగిపోయింది. "కాదు పెద్దమ్మా నిజంగా చచ్చిపోతా ననుకున్నాను. అంత బాధ పెట్టింది. పన్ను పోటుకూడా మరచిపోయాను."

"ఓహో పన్నుపోటా. ఏదీ చూపనీ"

"ఒకటి కదుల్తోంది."

"అలాగా, అయితే ఉండు. కదలకు. చూడు మేరీ పట్టుపేనుతాడూ కొరకంచూ పట్టుకురా."

మేరీ వెళ్లి తీసుకొచ్చింది.

"వొద్దు పెద్దమ్మా వొద్దు, పన్ను పీకెయ్యకు. ఇంక ఆట్టే నెప్పిపెట్టదులే."

"పరవాలేదు, ఒక్కక్షణం ఓర్చుకో."

పెద్దమ్మ పట్టుతాడుతో పన్ను బిగించింది. రెండోకొస మంచంకోడుకి కట్టింది. కొరకంచు తీసుకొచ్చి ముక్కుమీద పెట్టబోయింది. టామ్ గుంజుకోడంతో పన్ను ఇట్టే ఊడివచ్చింది.

అబ్బో అన్నాడు టామ్. "ఫరవాలేదులే. ఇంక నెప్పివుండదు" అని బుజ్జగించింది పెద్దమ్మ.

టామ్‌కి ఇదీ ఒక మంచికే వచ్చింది. నోట్లో నీళ్లు నిండాపోసుకుని తొస్సిలోనుంచి జంయ్‌మని ధార వొదలచ్చు. దగ్గాకి ఆమడదూరానికి కూడా గురిచూసి ఉమ్మివెయ్యవచ్చు. స్కూల్లో ఈ గొప్ప చూపించుకున్నాడు.

స్కూల్‌కి వెళ్లేదారిలో రౌడీ హక్కల్ బెర్రీఫిన్ కనిపించాడు. వీడితండ్రి తాగుబోతు. వాడితో స్నేహం చెయ్యకూడదని, అసలు వాడితో మాట్లాడకూడదని పిల్లల్ని అమ్మలు ఆంక్షపెడతారు. వాడితో మాట్లాడ్డం తిరగడం పిల్లలకి సరదా. అదో గొప్పనుకుంటారు. పిక్కలుదిగే పెద్దవాళ్ల చొక్కా, నేలని తుడుచుకుపోయే లాగు తొడుగుతాడు. మాసి అట్టలుకట్టివుంటాయి ఆ బట్టలు. నడినెత్తిని పెద్ద బొర్రిఉన్న టోపీ వేసుకుంటాడు. దానిచుట్టూ రంగుల కాగితాలు అంటిస్తాడు.

వాడిష్టంవొచ్చినట్లు తిరుగుతాడు. వాడిననేవాడెవడూ లేడు. మంచి బట్టలు వేసుకోవాలనీ, ముఖం రుద్దుకోవాలనీ, రాత్రి ఎనిమిదింటికే పడుకోవాలనీ కాలవలో ఈతలు కొట్టకూడదనీ వాడిమీద ఎవ్వరూ పెత్తనం చెయ్యరు. బలేస్వేచ్ఛ. అలా వుంటే ఎంత బాగుండు ననిపిస్తుంది టామ్‌కి.

"ఏమోయ్ హాక్."

"ఏమ్ చూడు. చవుడా నాదగ్గరేముంది!"

"ఏముంది."

"చచ్చిన పిల్లి.

"బలే. బాగా బిగుసుకుపోయింది."

"ఆ మరేమిటనుకున్నావ్"

"ఎక్కడిది"?

"కొన్నాను, ఒక సెంటికెట్టు, ఒక ఉపతి తోకా ఇచ్చి తీసుకున్నాను బెక్ రోజర్సు దగ్గర."

"ఎందుకూ?"

"నులిపురుగులు తీసేసుకోడానికి."

"అజ్జే, దీంతో ఎల్లా తీసేస్తారేమిటి; నాకు మంచి పద్ధతొకటి తెలుసు మంత్రపునీళ్లతో"

"ఓస్ నాకది తెలుసులే. కాని అది పని చెయ్యదు."

"నీ కెల్లా తెలుసేమిటి? చెప్పు ఏంచేస్తారో"

"ఏంచేస్తారు? బాబ్ టానర్ చేశాడు. కొట్టేసిన చెట్టు మొదలు చూశాడు. దాని గతుకుల్లో నిలవున్న నీళ్లలో చెయ్యి పెట్టాడు. అంతే."

"ఏం అనలేదా అప్పుడు"

"ఏమో. లేదనుకుంటాను."

ఇంకనేం. మరి అలాగేనా ఏమిటి చెయ్యాలం! నేచెప్తా చూడు. ఎవ్వరుకూడా ఉండకూడదు. ఒక్కడే అడివిమధ్యలోకి వెళ్లిపోవాలి. అక్కడ నరికేసిన చెట్టు మొదలు వెతకాలి. సరిగా అర్ధరాత్రివేళకి దానిదగ్గర కెళ్లి దానికేసి చూడకుండా—వెనక్కి తిరిగి నిలబడాలి. చెయ్యి—వెనగ్గానే—ఆ నీళ్లలోపెట్టి సురుపుడుకాయలు పోవాలి, పోవాలి, పోవాలి అని మూడుసార్లు అనాలి. వెంటనే కళ్లు మూసుకుని పదకొండు అడుగులు ముందుకి వెయ్యాలి. అక్కడ మూడుసార్లు కళ్లుమూసుకునే చుట్టూ తిరగాలి. ఆపైన ఎవ్వరితోనూ మాట్లాడకుండా ఇంటికొచ్చెయ్యాలి. మాట్లాడితే మంత్రం పట్టుపోతుంది.

"అవును. ఇది బాగుంది. ఇలాచేస్తే ఫరవాలేదు. వాడికి తెలియదు కాబట్టే ఎన్నిసార్లు ఏం చేసినా వాడి సురుపుడుకాయలు పోలేదు."

"మరి చచ్చినపిల్లితో నువెల్లా చేస్తావ్?"

"ఏముంది! చూడు చెప్తా. ఒట్టి దుర్మార్గుడైన వాడు చచ్చిపోయిన రోజున అర్ధరాత్రివేళ ఈ చచ్చిన పిల్లిని తీసుకుని శ్మశానానికి వెళ్లాలి. సరిగ్గా అర్ధరాత్రయ్యేసరికి దెయ్యాలొస్తాయి. అవి కనిపించవు గాని చప్పుడైనట్టు వినిపిస్తుంది అంటే, ఒక్కొక్కప్పుడు అవి మాట్లాడుకునే మాటలుకూడా వినిపిస్తాయి. చచ్చిపోయినవాడిని అవి తీసుకుపోతున్న సమయంలో పిల్లిని

వాటివెంట విడిచిపెట్టాలి. 'శవంవెంట పిల్లి, పిల్లివెంట సురుపురుకాయలూ పోవాలి పోవాలి పోవాలి' అనాలి. అంతే అవి పోతాయి."

"బలే బాగుంది. మరెప్పుడు చేస్తావు. శ్మశానానికి?"

"యీ రాత్రే. హాస్‌విలియమ్స్ చచ్చిపోయాడుగా."

"మరి వాడిని మొన్ననే పాతిపెట్టారే"

"అయితే ఫరవాలేదు. మధ్య ఆదివారం వచ్చిందిగా. బహుశా సైతాన్లు రావు ఆదివారంనాడు."

"అయితే ఇవ్వాళ రాత్రే వెడతావన్నమాట. నేను నీకూడా రానా?"

"ఏ. కాని నీకు భయముండకూడదు మరి."

"ఓస్ నాకెప్పుడూ భయంలేదు. సరేకాని ఆ గిన్నెల్లో ఏమిటుంది హాక్"

"అది జోరీగ"

"అది నాకివ్వవ్"

"అబ్బే అది నే నమ్మదల్చుకోలేదు"

"పోనీలే. వెధవ జోరీగలు బోలెడు దొరుకుతాయి."

"ఇది నీకిస్తే నువ్వు నాకేమిస్తావ్?

టామ్ ఆలోచించాడు. జేబులోంచి మెల్లిగా పన్ను తీసి చూపించాడు.

"అది నిజమైన పన్నేనా?"

"ఓ. ఇటుచూడు" అని టామ్ పైపెదవి ఎత్తి తోసి చూపించాడు.

"రైట్."

టామ్ జోరీగ తీసుకుని అగ్గిపెట్టెలో దాచుకున్నాడు. ఇద్దరూ చెరోదారినీ వెళ్ళిపోయారు. టామ్ స్కూలుదారి పట్టాడు.

# 5

అంతవరకూ ఆడుతూ పాడుతూ వెళ్ళినవాడు బడి సమీపించగానే పెద్దగా ఒగర్చుకుంటూ పరుగు దీశాడు టామ్. గభాల్న పుస్తకాలు డస్కు మీదకు గిరవాటేసి ఉశ్ అనుకుంటూ సీట్‌లో కూలబడ్డాడు. ఎత్తైన ప్లాటుఫారంపైన కుర్చీలో కూర్చుని జోగుతున్న మేష్టారికి నిద్రాభంగం అయింది.

"థామస్ సాయర్!"

పూర్తి పేరుతో మేష్టారు పిలవంగానే ఇంకతన పని మూడిందనుకున్నాడు టామ్.

"సార్"

"ఇలాగా ఇవాళకూడా లేటయిందేం దొర గారికి?"

టామ్ ఏదో కల్పించి చెప్పాలను కున్నాడు. కాని ఇంతలో రిబ్బను ముడివేసిన రెండుచక్కటి జడలు వెన్నుమీదనుంచి ఒయ్యారంగా ముందుకు వేసుకుంటున్న అన్లికళ్ల అమ్మాయి అతనికళ్లబడ్డది. సరిగ్గా ఆమె ప్రక్క ఒక్కటే సీట్ ఖాళీగాఉంది కూడా. వెంటనే గ్రహించాడు టామ్. మగపిల్లల్ని గేలి చెయ్యాలనుకున్ననాడు మేష్టారు ఆడపిల్లల ప్రక్కన కూచో పెడతాడు. క్లాసంతానవ్వతారు.

టామ్ నిర్భయంగా, అదొక గర్వంతో చెప్పాడు; "హాక్కల్ బెరీఫిన్ కనిపించాడండి. వాడితో మాట్లాడుతున్నాను, అందువల్ల ఆలస్యంఅయిందండి."

మేష్టారు ఆపళాన నోరు తెరిచేశాడు. క్లాసులో పాఠాలు చదువుతున్న పిల్లల రణగొణ ధ్వని ఠక్కున ఆగి పోయింది. టామ్కి మతి పోయిందనుకున్నారు క్లాసంతా.'

"ఏమిటీ. ఏమన్నావ్?"

"హాక్కల్ బెరీఫిన్తో మాట్లాడు తున్నా నండి"

"థామస్ సాయర్. నీకు సిగ్గు లేదూ? అలా చెప్పుకోడానికి? ఆగు నీకు మామూలు పేకబెత్తం కూడా చాలదు. చొక్కావిప్పు"

మేష్టారు చెయ్యి నొప్పి పెట్టేవరకు కొట్టాడు. "ఊ ఇంక వెళ్లు. ఇవాళంతా నీ సీటు ఆడపిల్లల పక్కనే. ఇదిగో చెప్తున్నా విను. ఈమాటు జాగ్రత్త."

టామ్ కిక్కురుమనలేదు. క్లాసంతా కిచకిచ లాడుతున్నారు. కాని టామ్‌కి లెక్కలేదు. ఆ అమ్మాయి ముఖం వంక మాత్రం సగర్వంగా చూశాడు. తిన్నగా వెళ్లి ఆమె పక్కసీట్‌లో కూచు న్నాడు. అమ్మాయి బుర్ర ఎగరేసి కొంచెం దూరంగా వొదిగి కూచుంది. క్లాసులో గుసగుసలు బయలు దేరాయి. టామ్ నిశ్శబ్దంగా డస్కుమీద చేతులు చాపి కూచున్నాడు. చదువుతున్నట్లు పుస్తకం వంక చూస్తున్నాడు.

కొంత సేపటికి క్లాసు పిల్లలు టామ్ వంక చూడ్డం మానేశారు. మెల్లిగా పాఠాలు వల్లెవేస్తు న్నారు. సన్నని రొద తేనెటీగల తెంపూ లేకుండా వస్తోంది. టామ్ మెల్లిగా ఆ అమ్మాయి వంక పక్క చూపులు చూస్తున్నాడు. ఇది ఆమె కనిపెట్టింది. ఒక సారి పళ్లికిలించి వెక్కిరించి బుర్ర వెనక్కి తిప్పేసింది. కాని ఇంకో నిమిషంలో మెల్లిగా తలతిప్పి చూసింది. డస్కుమీద ఆమె ఎదురుగా ఒక ఈతపండు కనిపించింది.

దాన్ని పక్కకి గెంటేసింది. టామ్ మెల్లిగా దాన్ని ఆమె వద్దకు జరిపాడు. మళ్లీ ఆమె గెంటేసింది. కాని ఈమాటు గెంటడంలో అంత జోరు లేదు. మెల్లిగా తోసింది. మళ్ళీ ఓపికతో టామ్ దాన్ని జరిపాడు. ఆమె ఈమాటు దాన్ని అలాగే ఉండనిచ్చింది. టామ్ తన పలకమీద ఇలా రాశాడు. "అది తీసుకో, నా దగ్గిరింకా ఉన్నాయ్." అమ్మాయి పలక చూసింది. కాని దాన్ని ముట్టుకోలేదు. ఈ తడవ టామ్ తన పలకమీ దేమిటో రాస్తున్నాడు. అది ఆమెకి కనపడకుండా ఎడంచెయ్యి అడ్డు పెట్టాడు. కొంతసేపు అది చూడనట్టూరుకుంది అమ్మాయి. కాని ఆమె కుతూహలం పెచ్చు కావడానికి ఆట్టే సేపు పట్టలేదు. టామ్ మాట్లాడకుండా రాసుకుపోతున్నాడు. మొదట చూడనట్టే చూడ్డానికి ప్రయత్నించింది ఆమె. అది కనిపెట్టనట్టు నటించాడు టామ్. చివరికి ఆమె లొంగిపోయి అడిగింది "అదేమిటి? చూడ నివ్వవ్?"

టామ్ చెయ్యి అడ్డుతీశాడు. అదొక ఇల్లుబొమ్మ. ఆ ఇల్లు నిలకడలేక కూలిపోతోన్నట్టుంది. పైగా ఆ కిటికీలు, ద్వారాలూ, ఆయింటివి కావల్లే ఉంది. ఆ ఇంట్లో నించి పొగ బొంగరం చుట్టు తాడల్లే వుంది. దాంతో ఆ అమ్మాయి టామ్‌వంక తిరిగి కూచుంది. బొమ్మ చూడ్డంలో పాఠం మరచిపోయింది. బొమ్మ పూర్తికాగానే కళ్లు ఇంతింత చేసుకుని

"బలే ఎంచక్కా వుంది. మరి మనిషిబొమ్మ గియ్యి" అంది రహస్యంగా.

గబ గబా ఇంటి పంచలో ఒక మనిషిని నిల బెట్టాడు రేఖాశిల్పి. అయితే ఆ మనిషి పంచలో నిల బడ్డాడో, ఇంటిమీదే ఉన్నాడో ఇల్లే వాడి మీదుందో తెలియదు. మొత్తానికి మనిషి ఇల్లంతా ఉన్నాడు. అయితే ఆ అమ్మాయికి కుశంకలు లేవు. తృప్తిపడింది.

"బలే. ఎంచక్కా ఉన్నాడు. మరి నేను నడిచి వొస్తున్నట్టు గియ్యి. చూద్దాం," అంది.

వెంటనే కళాకారుడు బొమ్మ వేసేశాడు. చంద మామ లాగ గుండ్రని ముఖం. అందులోంచి నేరుగా తిరిగిన ఒంటిగీత కాళ్లు. అందులోంచి రెండు చేతులు. విచ్చుకున్న అయిదు వేళ్లమధ్య ఒక విసన కర్ర.

"బలేగా వుంది. బొమ్మలు గియ్యడం నాకూడా చేతవుతే ఎంత బావుండును!"

"ఓశ్, అదేం కష్టమనుకున్నావా? నీ కిట్టే నేర్పెయ్యగల్ను."

"నిజంగా! ఎప్పుడు?"

మధ్యాహ్నం. నువ్వు మధ్యాహ్నం అన్నానికి ఇంటి కెడతావా?"

"నువ్వుండమంటే ఉండిపోతాను వెళ్లను."

"ఓ. ఉండిపో. నీకూ నాకూ జట్టు [illegible] రేమిటి?"

"జెకీ థాచర్. నీ పేరు? ఓ నాకు తెలుసులే. థామస్ సాయర్ కాదూ?"

"నన్ను కొట్టాలనుకున్నప్పుడు ఆ పేరుతో పిలుస్తారు. మామూలుగా నేను మంచివాణ్ణిగా ఉంటే టామ్ అంటారు. నన్ను నువ్వు టామ్ అని పిలుస్తావ్ కాదూ ఏం?"

"అవును. అలాగే పిలుస్తాను."

టామ్ పలకమీద ఏవో గీకుతున్నాడు; అక్షరాలు అమ్మాయికి కనపడకుండా దాస్తూ. ఈమాటు ఆమె ఆగలేదు. చూడనిమ్మని బతిమాలుకుంది.''

"అబ్బె అదేం లేదు."

"అందుకే వొస్తుంది మరి."

"నిజంగా, ఏం లేదు. నువ్వు చూడకూడదు."

"కాదు. చూడాలంటె చూడ నివ్వవ్?

"బాబో చెప్పేస్తావ్."

"ఉహు చెప్పను. ముచ్చంగా మూడుమాట్లు చెప్పనూ, చెప్పనూ చెప్పను."

"ఎవ్వరికీ చెప్పవు కదా? ఈ జన్మలోకి–అంటే నువ్వు చచ్చి పోయేవరకూ కూడా?"

"చచ్చినా చెప్పను. ఎవ్వరికీ చెప్పను. మరి చూడనియ్యి."

"అహా. నువ్వు చూస్తే ఎల్లాగ బాబూ."

"అదుగో. అల్లా అంటున్నందుకు చూసి తీర తాను." అంటూ ఆమె తన బుల్లిచేత్తో టామ్ చెయ్యి లాగింది. కొంచెంసేపు చేతిపట్లు జరిగాయి. చెయ్యి అడ్డుగా ఉంచడానికే నన్నట్లు నటిస్తూ టామ్ మెల్లి మెల్లిగా చెయ్యి జరిపాడు. అందులో "నువ్వంటే నాకు ఇష్టం" అన్న మాటలు కనిపించాయి."

"ఛీ దొంగా" అంటూ తమాషా కోపంతో ఆమె టామ్ బుగ్గమీద బుల్లి దెబ్బ వేసింది. ఆమె ముఖం ఎర్రబడింది. ఆమెలో సంతోషం కూడా కన పడింది.

సరిగ్గా ఈ సమయంలో టామ్ చెవి నులుముకు పోయి ఎక్కలాగబడింది. ఆ చెవితో పాటు లేచి నిల బడ్డాడు టామ్. అలాగే వెళ్లి టామ్ తన అసలు సీట్ దగ్గరి కెళ్లాడు. తలెత్తి చూసేసరికి మేష్టారు. క్లాసంతా కిచకిచ మన్నారు. తరవాత మేష్టారు ఒక్కమాటేనా అనకుండా కుర్చీ దగ్గిర కెళ్లారు. టామ్‌కి చెవి నెప్పి పెట్టింది కాని హుషారులో అది ఆట్టే కనిపించలేదు.

సద్దుమణిగాక టామ్ పుస్తకం చదవాలని గట్టిగా ప్రయత్నం చేశాడు. కాని లోపల ఆవేగం ఎక్కువై

చదువు సాగలేదు. పుస్తకం మీద బుద్ధి నిలుపుదామని ప్రయత్నించిన కొద్దీ బుద్ధి నిలవలేదు. సంచారం చెయ్యడం మొదలెట్టింది. చివరికి విసుగెత్తి ఒక్కసారి ఆవలించి పుస్తకం మూసేశాడు. మధ్యాహ్నం గంట ఇంక ఎంతకీ కొట్టరేమో అనిపించింది. అంతా మంద కొడిగా వుంది. దూరంగా ఉన్న కొండలు అల్లరి చేసే పిల్లలు లేక బోగులు బోగులు మంటున్నట్టున్నాయి. ఆకాశంలో పనిలేక పక్షులు షైర్ కొడుతున్నాయి. ఆవులు నెమరువేస్తూ జోగుతున్నాయి.

ఏమీ తోచక టామ్ చెయ్యి లాగు జేబులోకి పోయింది. చేతికి అగ్గిపెట్టె తగలగానే ముఖం తేట పడింది. మెల్లగా పెట్టి ఇవతల కొచ్చింది. జోరీగని డస్కు మీద వొదిలాడు. ఎగరకుండా రెక్కల్ని తుమ్మజిగురుతో అంటించి వుంచాడు హాక్. జోరీగ డస్కు మీద పాకడం మొదలెట్టింది. పిన్నీసు తీసి దాంతో దారి అడ్డగిస్తూ వెనక్కి నెట్టాడు టామ్. టామ్ పక్కనే కూచున్నాడు వాడి ప్రాణమిత్రుడు జోహార్పర్. వారమంతా ఇద్దరూ ప్రాణమిత్రులు. శని వారంనాడు యుద్ధాలకి మాత్రం పరమ శత్రువులు. జో ఒక పిన్ను తీశాడు. ఇద్దరూ కలిసి జోరీగని ఎటు వెడితే అటు అడ్డగించి నెట్టడం మొదలెట్టారు. కాస్సే పట్లోనే ఆట జోరెక్కువయింది. ఇద్దరూ గెంటడంలో ఆట కుదిరింది కాదు. ఒక డొకవేపుకి నెడితే ఇంకోడు

ఇంకో వేపుకి గెంటుతున్నాడు. జో తన పలకతీసి డస్కుమీద పెట్టాడు. పలకమధ్యన నిలువుగా ఒక గీత గీశాడు.

"ఇదిగో ఇది మనిద్దరి మధ్యా సరిహద్దు. అది నీకోట. ఇది నా కోట. ఖైదీ నీకోటలో ఉన్నంత సేపూ నేను దాని జోలికి పోను. నా కోటలో ఉన్నంత సేపూ నువ్వు ముట్టుకో కూడదు. ఏం? ఒప్పందమేనా?"

"ఆల్ రైట్. కాని నువ్వు ముందు ఆట మొదలెట్టు."

జోరీగ టామ్‌దగ్గర్నించి తప్పించుకుని కోట ప్రాకారం దాటి జో కోట ప్రవేశించింది. జో తన పిన్నుతో పీడించడం మొదలెట్టేడు. జోరీగ టామ్ కోటలోకి వెళ్లింది. ఈ మాదిరిగా జోరీగ మాటి మాటికీ కోటను మారుతూ వచ్చినంతవరకూ బాగానే వుంది. ఒకడు జోరీగని పిన్నుతో ఆడిస్తోంటే రెండో వాడు చూస్తున్నాడు. రెండు బుర్రలూ పలకమీద ఒరిగి తాకుతున్నాయి. ఆటతమకంలో క్లాసులో ఉన్నారన్న మాట మరిచిపోయారిద్దరూ. చివరికి అదృష్టదేవత జోని వరించింది. జోరీగ జో కోటలో నుంచి కదలడం లేదు. టామ్‌కి ఉక్రోషం వచ్చింది. వాడి వేళ్లు ఊరికే దురదపెట్టడం మొదలెట్టాయ్. ఎంత సేపటికీ తన ఖైదీ తన కోటలోకి రావటం లేదు. చివరికి టామ్ సరిహద్దుదాటి జో కోటలోకి తన చెయి

పోనిచ్చి పిన్నుతో జోరీగని గెంటడం మొదలెట్టాడు. జోకి బలే కోపం వచ్చేసింది.

"అదే టామ్. దాన్ని వొదిలిపెట్టరా."

"కొంచెం కదుపుతున్నానం తేరా."

"అలా వల్లకాదు. ఇది అన్యాయం.దాన్ని వొదిలెయ్యి."

"నే నేం చేశా్రనా. తప్పంతా దానిదే. నేను మాత్రం ఏం పెద్ద కదిపా నేమిటి?"

"దాన్నొదలెయ్యి చెప్తున్నాను."

"నే నొదల్ను."

"ఎందుకొదలవ్. మహా చక్కాగా వొదుల్తావ్ లే. అది నాకోటలో ఉంది."

"ఇదిగో చూడరా జో. అసలా జోరీగ ఎవరిది?"

"అ దెవరి దైతేం? నాకు తెలీదు."

"అది నా సరిహద్దులో ఉంది. దాన్ని నువ్వు తాకకూడదు."

"చూద్దాం ఎందుకు తాకకూడదో! అది నా జోరీగ. దాన్ని నా ఇష్ట మొచ్చినట్టు చేస్తా. అది నా యిష్టం దాన్ని చచ్చినా వొదల్ను."

టామ్ వీపు ఛళే ల్మంది. వెంటనే జో వీపు ఫెటీ ల్మంది. చొక్కాలమీద దుమ్ము జాయిగా లేచి

రెండునిమిషాలు వెలుగులో నాట్యంచేసి దిగిపోయింది. ఇద్దరి వెనకాలా మాష్టారు నిలబడి ఉన్నాడు. చడీ చప్పుడూ కాకుండా ఎప్పుడో వొచ్చి వాళ్ల వెనక నిలబడ్డాడు.

మధ్యాహ్నం బడి విడిచిపెట్టగానే పిల్లలందరూ వెళ్ళిపోయాక క్లాస్‌రూమ్‌లో టామ్, బెకీ మిగిలారు. ముందు పలక వేసుకొని ఒక డస్కు వద్ద ఇద్దరూ కలిసి కూచున్నారు. బెకీచేతికి బలపం ఇచ్చి ఆమెచెయ్యి పట్టుకుని బొమ్మ గీయించాడు టామ్. ఒక ఇల్లులా గుంది బొమ్మ. బొమ్మలు గియ్యడంలో సరదా ఇట్టే మాయమై ఇద్దరూ కబుర్లలో పడ్డారు. టామ్‌కి ఒళ్లు పరవశమై పోతోంది.

"నీకు ఎలకలంటే ఇష్టమేనా?" అని అడిగాడు.

"ఛా అవంటే నాకు అసహ్యం."

"నిజమే నాకూ అసహ్యమే బతికినవాటిని చూస్తే. కాని నేచెప్పేది అవ్వి కాదు. చచ్చిన ఎలకలు. చచ్చినఎలక తోకకి తాడుకట్టి నెత్తి చుట్టూ గిర గిరా తిప్పుతే బాగుండదూ?"

"ఎబ్బే. అసలు ఎలకల సంగతే నాకు గిట్టదు. నాకు పిప్పర మెంట్లంటే ఇష్టం."

"అవును నిజమే. నాకూ అంతే. ఇప్పు డవ్వి ఉంటే ఎంత బాగుండును!"

"నిజంగా? బాగుంటుందా? నా దగ్గి రొకటుంది కొంచెంసేపు నీకిస్తాను. చప్పరించు. కాని మళ్లీ ఇచ్చెయ్యాలి సుమా."

ఇది ఇద్దరికీ ఒప్పుదలయింది. ఒకళ్ల తరవాత ఒకళ్లు పిప్పరమెంటుబిళ్ల చప్పరించారు. బెంచీ మీంచి కాళ్లు వేళ్లాడేసి ఊగిస లాడిస్తున్నారు.

"నువ్వెప్పుడేనా సర్కస్ చూశావా?" అని అడిగాడు టామ్.

"ఓ, మళ్లీ ఇంకోసారి చూస్తాగా. నేను అల్లరిచెయ్యకుండా ఉంటే మళ్లీ సర్కస్‌కి తీసుకెడతానన్నాడు నాన్న."

"ఓశ్. నే నప్పుడే నాలుగైదుసార్లు చూశాను. సర్కస్ చూసితీరాలి. అంతే కాని చర్చిలో ఏముంది నా మొహం. సర్కస్‌లో ఎప్పుడూ ఏదో గమ్మత్తు జరుగుతూనే వుంటుంది. బలే బాగుంటుంది. పెద్దవాడ్నైన తరవాత సర్కస్‌లో బఫూన్ వేషం వేస్తా నేను."

"నిజంగా. భలేగా వుంటుంది. చుక్కలు చుక్కల చొక్కాలూ వాళ్లూ ఎంచక్కావుంటారు కదూ?"

"అవును. వాళ్ల కెంత డబ్బొస్తుందనుకున్నావ్. దోసిళ్లనిండా వొస్తు-దట. రోజూ పదిరూపాయిలైనా వస్తాయన్నాడు బెన్‌రోజర్స్. అయితే బెకీ నాకో మాట చెప్తావా? నువ్వెవ్వరికేనా మాటిచ్చావా?"

"అంటే? ఏం మాట?"

"ఛీ. తెలియనట్టు మాట్లాడతావ్"

"వొట్టు. తెలీదు."

"పెళ్లి చేసుకోడానికి."

"లేదు."

"పోనీ ఇప్పుడు మాటివ్వకూడదూ?"

"కామోసు. ఏమో. అంటే ఎలా ఇవ్వాలి?"

"ఎలాగా? చెప్తా విను. నీకిష్టమైన అబ్బాయితో నిన్నే గాని మరొకణ్ని చచ్చినా పెళ్లి చేసుకోను. చేసుకోను చేసుకోను అని ముచ్చెంగా మూడు సార్లు ఒట్టుపెట్టుకుని చెప్పాలి. ఆ తరవాత ఆ అబ్బాయిని ముద్దెట్టుకోవాలి. అంతే. అదేమంత కష్టం?"

"ముద్దా? ఎందుకు?"

"ఎందుకా? ఎందుకేమిటి? ఎందుకంటే మరి... అంతేలే. అందరూ అలా చేస్తారు కాబట్టి."

"ప్రతీవాళ్లూనా?"

"ఆ. ప్రేమించుకున్న ప్రతీవాళ్ళూ అలా ముద్దుపెట్టుకోవాలి. నేను పలకమీద ఏం రాశానో జ్ఞాపకం ఉందా?"

"ఆ, ఆ. జ్ఞాప..."

"ఏం రాశాను?"

"నే చెప్పను."

"పోనీ నే చెప్పనా?"

"చెప్పు ... కాదులే ఇప్పుడు కాదు. మళ్లీ ఇంకోసారి."

"అహా. అల్లాకాదు, ఇప్పుడే"

"ఇప్పుడు కాదు బాబూ. పోనీ రేపు."

"కాదమ్మా మరి ఇవ్వాళే చెప్పాలి. పోన్లే రహస్యంగా నీ చెవిలో చెప్తాను. ఏం బెకీ? ఇట్టే చెప్పేస్తానుగా. ఎంతోసేపు లేదు."

బెకీ, సంకోచిస్తూ ఏమనలేదు. ఏమనకపోవడం ఒప్పుకున్నట్టే ననుకున్నాడు టామ్. మెల్లిగా చెట్టాపట్టాలు వేసుకున్నట్టు ఆమె బుజంమీద తన చెయ్యి వేసి చెవిలో ఊదాడు. ఆ తరవాత "మరి ఈ మాట నువ్వు నాచెవిలో చెప్పు. ఆ ఒక్క మాటేగా. ఏం" అన్నాడు.

మొదట బెకీ ఒప్పుకోలేదు. తరవాత "మరైతే నువ్వు మొహాం అటు తిప్పు. ఇటు చూడకూడదు. అప్పుడు చెప్తాను. కాని మరి నువ్వు ఎవ్వరితోనూ చచ్చినా చెప్పకూడదు. ఏం టామ్ చెప్తావా? చెప్పవు కాదూ."

"అబ్బే. చెప్తానేమిటి? చస్తే చెప్పను. మరి నువ్వు అను బెకీ."

మొహం అటు తిప్పేశాడు. మెల్లిగా జంకుతూ వాడి చెవిదగ్గిరకి వొంగింది. "నువ్వంటే నా కిష్టం."

అనీ అనడం తడవు ఒక్క పరుగుతీసి ఒక డెస్కు చాటున దాక్కుంది. టామ్ వెంబడించాడు. డెస్కుల చుట్టూ పరుగు లెత్తడం మొదలెట్టా రిద్దరూ. చివరికి ఒక మూలకి వెళ్లి నిలబడింది బెకీ. మెడని చుట్టుకున్న రుమాలు తీసి మొహం కప్పుకుంది. టామ్ దగ్గిర కెళ్ళి స్నేహంగా భుజంమీదికి చెయ్యి వేసిచ్చాడు. మెల్లిగా అన్నాడు. "అంతా అయి పోయిందిగా బెకీ. ఇదిగో ఈ పైన ఇంక నువ్వెవ్వర్నీ ప్రేమించకూడదు. ఎవ్వరికీ మా టివ్వకూడదు. నన్ను తప్ప ఎవ్వర్నీ పెళ్ళి చేసుకోకూడదు. ఎప్పుడూ ఎప్పుడూ ఎప్పుడూ, ఏం."

"అంటే టామ్ మరి నువ్వూ అంతేనా?"

"అంతే నన్ను మాటేగా, ఇంక స్కూలు కొచ్చే టప్పుడూ ఇంటి కెళ్లే టప్పుడూ ఎప్పుడూ మనిద్దరం కలిసే ఉండాలి. అంటే ఎవ్వళ్లూ చూడకుండానే లే."

"అవును ఎంచక్కా వుంటుంది. మాటివ్వడం అంటే ఇంతేనా ? నాకు తెలీ దింతవరకూ."

"నిజంగా ఎంత బాగుంటుందనుకున్నావ్. నేనూ ఆమీలారెన్సూ కలిసి..."

మాట అంటున్నంతలోనే ఆమె పెద్దకళ్లు చూసి తన తప్పు గ్రహించి ఆగిపోయాడు టామ్.

"టామ్. అయితే మాటివ్వడం నీ కిది మొదటి సారి కాదన్నమాట. ఇంకో అమ్మాయి..." అంటుండ గానే ఏడుపొచ్చేసింది. రుమాల్లో మొహం కప్పు కుంది. ఏడుపులో ఎక్కిలుకూడా వచ్చాయి.

"ఏడవకూడదు మరి. బెకీ చూడు ఆ అమ్మా యంటే నాకింక ఇష్టం లేదుగా."

"లేదు నీకిష్టమే ఆఅమ్మాయంటే. తెలుసులే."

మరీ ఏడుపొచ్చింది ఆమెకు. ఒక్క తోపు తోసింది టామ్ని. గోడవేపు మొహం తిప్పుకుంది. టామ్ బతి మాలు కున్నాడు. ఆమె ఏడుపు మానలేదు. దగ్గర కొచ్చే సరికల్లా మోటుగా గెంటేసింది.

దాంతో టామ్కి అభిమానం వచ్చింది. గబ గబా పెద్దపెద్ద అంగ లేసుకుంటూ వెళ్లిపోయాడు. ద్వారంవద్ద ఒకసారి నిలబడి తటపటాయించాడు. ఆమె వెనక్కి తిరిగి చూస్తుందనుకున్నాడు. ఆమె చూడలేదు. తను చాలా పెద్ద పొరపాటు చేశానను కున్నాడు టామ్. ఆమె నెల్లా బతిమాలుకోవాలో తెలియలేదు. ఎలాగైనా ప్రయత్నం చెయ్యాలను కున్నాడు. ఆమెవద్దకు వెళ్లాడు. ఆమె అక్కడే అలాగే నిలబడి వెక్కి వెక్కి ఏడుస్తున్నది. టామ్కి గుండె బద్ద లైనట్టుంది. నట్టుతూ అన్నాడు. "బెకీ, నిజంగా నువ్వు తప్ప నా కింకెవ్వరన్నా ఇష్టంలేదు." జవాబు లేదు. ఎక్కిళ్లు వినిపించినై.

"బెకీ బెకీ నాతో మాట్లాడవ్వా. ఇలా చూడు."

టామ్ ముత్యపు బొత్తం తీశాడు. తలచుట్టు తిప్పి కళ్లముందు పెట్టాడు. దాన్ని నేలనేసి కొట్టింది.

టామ్ చకచకా నడిచి వెళ్ళిపోయాడు. ఇంక స్కూల్ కి రాకూడదనుకున్నాడు. ఊరికి దూరంగా వెళ్లి పోతున్నాడు. ఆ అమ్మాయికి అప్పుడు అనుమానం కలిగింది. గబగబా తలుపు వద్దకు పరుగెత్తింది. టామ్ కనిపించలేదు. ప్లేగ్రౌండ్ లోకి పరుగెత్తింది. అక్కడా కనిపించలేదు. "టామ్. టామ్! టా-ఆమ్. రావ్వా" అని పిలిచింది. విన్నది ... కాని సమాధానం లేదు. అక్కడే కూచుని వలవలా ఏడ్చింది. ఇంతలో మధ్యాహ్నం బడికి పిల్లలు వస్తున్న సవ్వడి వినవచ్చింది. కళ్లు తుడుచుకుని బింగమూతితో క్లాస్ లోకి వెళ్లి కూచింది.

## 5

కొత్తమ్మాయితో పోట్లాడి బయల్దేరిన టామ్ కాస్సేపు కాలుగాలిన పిల్లిలా అటూ ఇటూ తచ్చాడి, స్కూలుకు తిరిగివచ్చే పిల్లలు ఎదురుపడకుండా ఊరి బైటకు వెళ్లి పోయాడు. ఊరికి కొంచెం దూరముగా ఒకచిన్న కొండ వున్నది. ఆ కొండనుకూడా దాటాడు.

చివరకి ఒక దట్టమైన అడవిలో ప్రవేశించాడు. మధ్యాహ్నపు ఎండవేడికి అడవిలో పక్షులన్నీ కొమ్మల

నీడల్లోనే కదలకుండా కూచున్నాయి. టామ్ మన స్సంతా దిగులుగా, బెంగగా వుంది. ఒకపెద్ద చెట్టు నీడలో చతికిలబడి ఆలోచించుకున్నాడు. జీవితమనేది కష్టాలతో నిండిన పెద్ద జైలులాగా వుంది. ఈమధ్య చచ్చిపోయిన జిమ్మీ హాడ్జెస్‌లాగా తనుకూడా చచ్చిపోతే! శ్మశానంలో భూమిలో పడుకుని అలాగే శాశ్వతంగా నిద్రపోతూ కలలు కంటూవుంటే ఎంత బావుంటుంది? అయినా తను చేసిన పెద్ద తప్పు మాత్రం ఏముంది. ఆ కొత్తమ్మాయిని తను ఎంత ప్రేమించాడు! తనని కుక్కని తోసేసినట్టు తోసేసింది. కానీలే. ఎప్పటికైనా ఆ అమ్మాయికే తెలిసివస్తుంది. టామ్ లాంటి మంచి అబ్బాయిని తోసేసినందుకు ఆ అమ్మాయికి ఎప్పటికైనా విచారం కలక్కపోదు.

ఈ విధంగా టామ్ తన్నుతనే సముదాయించుకున్నాడు. మళ్లీ ఇంకో ఆలోచన తట్టింది. తను ఇక ఇంటికి పోకుండా పారిపోతే? ఎక్కడికో దూరదేశాలకు పోయి వెనక్కి రాకుండావుంటే ఆ అమ్మాయి కెల్లా వుంటుంది? ఊహూ. తను మిలిటరీలో చేరి యుద్ధాల్లో పోట్లాడి పెద్దపేరు సంపాదించుకు ఇంటికి వస్తాడు. ఆ అమ్మాయి భలే పిల్లే. తనలాంటి గొప్పవాణ్ణి సర్కస్‌లో బఫూన్ వేషం వెయ్య మంది. ఛా, బఫూన్ వేషంలో ఏముంది, వెకిలిచేష్టలు తప్ప.

ఊహూ. తను ఏ కోయవాళ్లలోనో కలిసిపోయి, విలువిద్య, గుఱ్ఱపుస్వారీ నేర్చుకుంటాడు. చాల ఏళ్లయింతరవాత గుఱ్ఱంమీద స్వారిచేస్తూ వచ్చి, స్కూల్లో తన శత్రువుల నందర్నీ చెర్నాకోల్ పెట్టి బాదుతాడు. ఊహూ. ఇంతకంటే మంచి ఉపాయం వుంది. తను సముద్రపు దొంగ అవుతాడు. ఆ, అది! భలే ఉపాయం. ఒక పెద్ద ఓడసంపాదించాలి. అందులో బోలెడుమంది దొంగల్ని చేర్చి సముద్రంమీద పోయే వర్తకుల ఓడల్ని కొల్లగొట్టాలి. తనపేరు ప్రపంచ మంతా మోగిపోతుంది. తన పేరు చెప్పేటప్పటికి ఎంత గొప్పవాడికైనా గుండె ఠపీమని ఆగిపోవలసిందే. కొన్నేళ్ళతరవాత మళ్లీ తనవూరు వచ్చి చర్చికి వెళ తాడు. నల్లటి తన దుస్తులు, బండబూట్లు, మొలకి చుట్టుకున్న బెల్టునిండా పిస్తోళ్లు, పొడుగాటి కత్తి— ఇదంతా చూసి అందరూ హడలిపోయి "వాడే టామ్ సాయర్, చాలా గొప్పసముద్రపు దొంగ." అను కుంటారు.

ఆ. ఇక తన ఉపాయం స్థిరపడినట్లే. ఇవ్వాల్టికి ఇంటికి వెళ్లి రేపు చీకటితోనే బయల్దేరిపోవాలి. ఈలోగా తనకు కావలసిన సరంజామా అంతా ఒక చోట దాచుకోవాలి.

టామ్ దగ్గిరలో వున్న ఒక కొయ్యదుంగవద్దకు వెళ్లాడు. దానికి లోపల అంతా డొల్ల, ఒకవేపునుంచి

టామ్ తన చాకుతో ఆ దుంగలో యిరుక్కున్న మట్టిని పెల్లగించాడు. కొంతసేపటికి డొల్ల కనిపించింది. అందులో చెయ్యి పెట్టి

"కొత్తవి రావాలి
పాతవి ఉండాలి."

అని మంత్రంలాగా కాసేపు జపం చేశాడు. చివరికి డొల్లలో చెయ్యిపెట్టి చాలాసేపు కెలికి ఒక గోలీకాయ తీశాడు.

"అరె, ఆశ్చర్యంగా వుందే." అనుకున్నాడు. ఆ గోలీని విసిరేసి, ఆవేపే చూస్తూ నుంచున్నాడు.

అసలు సంగతేమిటంటే—ఒక గోలీకాయని ఎవరూ చూడకుండా ఒకచోట పాతిపెట్టాలి. ఊరికే పాతిపెడితే లాభంలేదు. కొన్ని మంత్రాలు చదవాలి. పదిహేను రోజులైన తరవాత మళ్లీ దాన్ని, ఇందాక టామ్ చదివిన మంత్రం చదివి తవ్విచూస్తే అక్కడ బోలెడు గోలీలుంటాయి. ఇదివరకు ఆటల్లో పారేసిన గోలీలన్నిటినీ ఈ పాతిపెట్టిన గోలీకాయ వెళ్లి లాక్కొస్తుంది. అని పిల్లలందరికీ పెద్ద నమ్మకం. దేనికైనా తిరుగు వుంటుందిగాని ఈ నమ్మకానికి తిరుగు లేదు. చచ్చినట్టు ఆ గోలీలన్నీ అక్కడికి రావలసిందే. కాని తీరా యిప్పుడు చూస్తే అక్కడ టామ్ పాతిపెట్టిన గోలీ తప్ప మరేమీ లేవు. దీనితో టాం నమ్మకమంతా కూలిపోయింది. అసలు తన మంత్రం రైటుకాకుండా

ఎవడో వెధవ విరుగుడుమంత్రం వేసివుంటాడు. వాడెవడో కనుక్కోవాలి.

పక్కనే యిసుకలో ఒక బుల్లి గొయ్యిలాంటిది వున్నది. దాని పక్కన చేతితో తట్టుతూ

"అల్లీ బిల్లీ తలుపు తియ్యి,
అల్లీ బిల్లీ నిజం చెప్పు."

అని రెండుసార్లు పాడాడు. కాని పిల్లెమ్మ బయటికి రాలేదు. ఉహూ పిల్లెమ్మా చెప్పటానికి భయపడుతోంది. లాభంలేదు దాన్ని పిలిచి. పోనీ పారేసిన గోలీనైనా తెచ్చుకుందా మనుకున్నాడు. దానికోసం తెగ వెతికాడు. ఎక్కడా కనిపించలేదు. మళ్ళీ యిందాకటి కొయ్యదుంగవద్దకు వచ్చి తను ఎటువేపునుంచి పారేశాడో జ్ఞాపకం తెచ్చుకున్నాడు. ఆ వేపుకే సూటిగా నడిచివెళ్ళి వెదికాడు. ఎంత వెదికినా గోలీ దొరకలేదు. మళ్ళీ వెనక్కి వచ్చాడు. జేబులోనుంచి ఇంకో గోలీ తీసి,

"గోలీ! నువ్వువెళ్ళి నీ తమ్ముణ్ణి పిలుచుకురా." అని దాన్ని విసిరేశాడు. అది ఎక్కడ పడిందో చూసి, అక్కడికి వెళ్ళాడు. తప్పు గొయ్యి, అదికూడా కనిపించలేదు. మళ్ళీ వెనక్కి వచ్చి ఇంకో గోలీ విసిరేశాడు. ఈ గోలీమాత్రం కనిపించింది. ఇందాకటి గోలీలు కనిపించలేదు. మళ్ళీ ఆ గోలీని విసిరాడు. ఈసారి ఈ గోలీ రెండో గోలీదగ్గిరే వెళ్ళిపడింది. అమ్మయ్య అనుకుని

ఆ గోలీలు రెండూ జేబులో వేసుకున్నాడు. కాని మొదటిసారి విసిరేసిన అసలు గోలీ మాత్రం కనిపించలేదు.

ఇంతలోకే దూరంనుంచి ఒక కొమ్ము బూరా మోత వినిపించింది. టామ్ గబుక్కున ఎగిరి గంతేసి, కోటు విప్పేసి, బెల్టు బిగించి, చొక్కా చేతులు ముడిచాడు. పక్కనే ఒక పొద వున్నది. ఆ పొద కెలికి ఒక చిన్నవిల్లు, బాణం, తీశాడు. ఒకకర్రకత్తి ఒక కొమ్ము బూరాకూడా తీశాడు. ఉషారుగా గంతులేస్తూ ఒక పెద్ద మర్రిచెట్టుకిందకి వెళ్లి నుంచున్నాడు. ఇందాక వినిపించిన శబ్దానికి సమాధానంగా తనుకూడా బూరా ఊదాడు. బొటనవేళ్ల మీద నుంచుని అన్ని దిక్కులూ జాగ్రత్తగా చూస్తూ దొంగల నాయకుడులాగా పోజు పెట్టాడు. తనచుట్టూ ఎవరో వున్నట్టుగా ఊహించుకుని, "ఒరేయ్, అబ్బాయిలూ, మీరంతా దాక్కోండి, నేను మళ్ళీ బూరా వూదేదాకా రావద్దు" అన్నాడు.

ఇంతలోకే అక్కడ టామ్ స్నేహితుడు జోహార్పర్ ప్రత్యక్షమయ్యాడు. వాడు టామ్‌లాగానే, నడుముకు బెల్టు బిగించి, మహాయోధుడులాగా ఆయుధాలు ధరించి గంతులేస్తూ వచ్చాడు.

"ఏయ్, ఆగుము. ఎవరు నీవు? నా ఆజ్ఞలేకుండా ఈ షెర్‌వుడ్ అరణ్యంలోని కేలవచ్చితివి ?" అన్నాడు టాం.

"నాపేరు గిస్బర్న్. నాకు ఒకరి యాజ్ఞ అక్కరలేదు. అసలు...అసలు"...హార్పర్ గాడు తరవాత మాటలు మరచిపోయాడు.

"'అసలు నన్నడుగుటకు నీవెవరు' అనాలి." అని టాం మాటలు అందించాడు హార్పర్ కి. ఇప్పుడు వాళ్లు ఆడుతున్న నాటకమంతా పుస్తకంలోదేగా.

"అసలు నన్నడుగుటకు నీవెవరు?" అన్నాడు హార్పర్.

"నేనా! నేను రాబిన్ హుడ్ ను. తెలిసినదా. తెలియకపోయినా ఇదుగో కాచుకొనుము." అన్నాడు టాం.

"ఓహో, నీవు గజదొంగ రాబిన్ హుడ్ వా? అయిన సరే, నిన్ను జయించి ఈ అరణ్యరాజ్యమును సంపాదించెదను, దెబ్బ కాచుకొనుము." అన్నాడు హార్పర్.

ఇద్దరూ కర్రకత్తులు ఒరల్లోంచి లాగారు. విల్లు, బాణాలు, ఇతర వస్తువులు కింద పడేశారు. కత్తియుద్ధం చేస్తున్నవాళ్ళమాదిరిగా అడుగు తరవాత అడుగు వేస్తూ ఒకళ్ళ కళ్లల్లోకి ఒకళ్ళు మహా కోపంగా చూస్తూ కత్తులు కలిపారు. రెండుసార్లు కత్తులు పైకెత్తి ఢీ కొట్టడం, రెండుసార్లు కిందకు వంచి ఢీ కొట్టడం— అదీ వాళ్ళ యుద్ధం. ఈ మాదిరిగా కొంతసేపు పోరాటం జరిగింది.

"ఒరేయ్, హార్పర్, ఇక పడిపోరా నువ్వు."
అన్నాడు టాం.

"నే నెందుకు పడిపోవాలి నువ్వే పడు."

అది కాదురా. నేను పడగూడదు. పుస్తకంలో ఏముందంటే 'ఒక్క వేటుతో గిస్బరన్‌ను రాబిన్ హుడ్ చంపెను.' అని వుంది. నువ్వు వెనక్కి తిరిగి నీ వీపుమీద నన్ను పొడవనివ్వాలి."

పుస్తకంలో మాటలకి ఎదురు చెప్పటానికి వీలు లేదుగా. అందుకని హార్పర్ వెనక్కి తిరిగాడు అయిష్టంగా. కత్తి తగలగానే పడిపోయాడు.

వెంటనే మళ్లీ లేచి "ఒరే, టాం ఈసారి నిన్ను చంపనియ్యి. అది న్యాయం." అన్నాడు హార్పర్.

"అదేమిట్రా. పుస్తకంలో అలాగ లేందే." అన్నాడు టామ్.

"ఫరవాలేదు. ఈ ఒక్క సారి కేగా."

"సరే, అయితే, నువ్వు కాస్సేపు రాబిన్ హుడ్ అయిపో, నేను నీశత్రువు నవుతాను."

దీనికి వప్పుకున్నాడు జో. టాం ఒకసారి చచ్చిపోయాడు. మళ్ళీ తను రాబిన్‌హుడ్ అయ్యాడు. ఈ విధముగా మొత్తానికి రాబిన్‌హుడ్ కథనంతనీ వాళ్లు ఆడారు. చివ్వరికి రాబిన్‌హుడ్ చచ్చిపోతాడు కథలో. అందుకని టాం దెబ్బతిన్నవాడివలె తూలు

తూ, తూలుతూ కిందపడ్డాడు. ఆ పడటంలో ఒక పళ్లేరుకాయమీద పడటంవల్ల గుచ్చుకుని, తను చచ్చిపోయిన రాబిన్ హుడ్ అని కూడా మరిచిపోయి టాం తపీమని లేచాడు.

ఇద్దరూ మళ్ళీ కోట్లు తొడుక్కుని, తమ ఆయుధాలు దాచేసి బయల్దేరారు. ఈ కాలంలో రాబిన్ హుడ్‌లాంటి గొప్పగొప్ప వీరులు లేరు గదా! మళ్ళీ ఆ పూర్వపు రోజులు ఇక ఎప్పటికీ రావుగదా, అని ఇద్దరు విచారించారు. అమెరికాదేశానికి జీవితాంతమూ అధ్యక్షుడుగా ఉండటం కంటే షెర్‌వుడ్ అడవిలో ఒక ఏడాదిపాటైనా రాబిన్ హుడ్‌లాగా వుండటమే మంచిదని నిశ్చయించుకొన్నారు.

# 6

ఆరోజు రాత్రి టామ్, సిడ్ తో మెల్లిగా తమ పక్కలమీదికి చేరారు. సిడ్ ఇట్టే నిద్రపోయాడు. టామ్ నిద్రపోలేదు. దేనికోసమో కాసుకు కూచున్నాడు. చాలా విసుగ్గావుంది అల్లా మేలుకుని వుండటం. ఇక తెల్లవారిపోతోం దనుకున్నాడు టాం. కాని ఇంతా ఏడిస్తే గడియారం పదిగంటలు కొట్టడం మొదలెట్టింది. భలే కోపం వచ్చింది టామ్‌కి గడియారం మీద.

నెమ్మదిగా వూరంతా నిశ్శబ్దమైంది. గడియారం టిక్కు టిక్కు శబ్దం బిగ్గరగా వినిపిస్తోంది. మేడ

మెట్లమీద ఏదో చప్పుడయింది. పోలీ పెద్దమ్మ గది లోంచి గుర్రుచప్పుడు భయపెడుతోంది. దూరంగా కీచురాళ్లు 'గీ' మంటున్నాయి. టామ్‌కు వళ్లు జలదరించింది. దెయ్యాలు లేచి తిరుగుతున్నా యనుకున్నాడు.

ఎంతసేపటికీ టైము గడవటం లేదు. చివరికి టామ్‌కి తెలియకుండానే నిద్ర వచ్చేసింది. మోడవాల్చి నిద్రపోయాడు. గడియారం పదకొండు కొట్టడం టామ్ విననే లేదు.

ఇంతలోకే టామ్ పడుకున్నగది బయటి కిటికీని ఎవరో తెరిచారు. "ఒరే! టాం! లే! నిద్రపోతున్నావా?" అని ఎవరో పిలిచారు. టామ్‌కి మెలుకువ వచ్చి గబుక్కున లేచి లాగూ, కోటూ తొడుక్కున్నాడు. కిటికీగుండా దూరి బయటికి వచ్చాడు. అక్కడ హాకల్ బెరీ ఫిన్, నుంచున్నాడు. చచ్చిన పిల్లి వుంది వాడి చంకలో. ఇద్దరూ చప్పుడు చేయకుండా పాకుకుంటూ ఇల్లు దాటి రోడ్డుమీద పడ్డారు.

మరో అరగంటకల్లా శ్మశానానికి చేరుకున్నారు అది వూరికి మైలున్నరదూరం వుంది. శ్మశానమంతా రాళ్లు, రప్పలు పొదలతోనిండి జీబురుమంటోంది. చాలా సేపు వెదికి వెదికి చివరికి తమకి కావలసిన గోరీని కనిపెట్టారు. అది ఈ మధ్యనే చచ్చిపోయిన హాస్ విలియమ్స్‌గోరీ. ఆ గోరీకి ఒక పక్కన మూడు పెద్దపెద్ద

రావిచెట్లు ఉన్నాయి. వాటి చాటున దాక్కున్నారు టామ్, హాక్.

ఆకులు గలగల మన్నాయి. దెయ్యాల గుస గుస లనుకుని టామ్ తుళ్లిపడ్డాడు.

"ఒరే, హాక్! దెయ్యాలు మన్ని చూస్తే ఊరు కుంటాయట్రా?" అని చెవిలో నెమ్మదిగా అడిగాడు టామ్.

"ఏమోరా, నాకు భయంగా వుంది."

"హాస్ విలియమ్సుకి మన మాటలు వి న బ డ తాయా?"

"వాడికి వినబడకపోయినా వాడి దెయ్యానికి వినబడవచ్చు." అన్నాడు హాక్, వణుకుతూ.

కాసేపు టామ్ మాట్లాడ లేదు.

"ఒరేయ్ హాక్. మనం హాస్నివాడు, వీడు అన గూడ దనుకుంటా. 'హాస్‌గారు' 'ఆయన' అని అనక పోతే వాడికి కోపం రావచ్చు."

"ఆ, వాడు చచ్చిపోయాడుగా. చచ్చిపోయిం తరవాత 'గారు' అనకపోయినా ఫరవాలేదు." అన్నాడు హాక్.

మళ్లీ కాసేపు నిశ్శబ్దం. చటుక్కుని టామ్ స్నేహితుడి చెయ్యిపట్టుకున్నాడు.

"ష్, ష్"

ఒకళ్ల నొకళ్లు గట్టిగా పట్టకున్నారు.

"ష్. ఏమిట్రా అ చప్పుడు."

"బాబోయ్. దెయ్యాలొస్తున్నాయిరా, టామ్! ఏం చేద్దాం యిప్పుడు?"

"మన్ని చూస్తాయంటావా హక్?"

"ఓ. చీకట్లో కూడా బాగా చూడగలవు దెయ్యాలు. నేను రాకుండావుంటే బావుండేది."

"భయపడకురా. కదలకుండా కూర్చుందాం. మనం వాటికేమీ అపకారం చెయ్యటంలేదుగా. మనకి అవిమాత్రం ఎందుకు అపకారం చేస్తాయి?"

ఇద్దరూ ఊపిరి బిగపట్టి వింటున్నారు. మూడు ఆకారాలు నెమ్మదిగా గోరీవద్దకు వచ్చాయి. ఏదో వెలుతురు కనిపించింది. దెయ్యాల దగ్గర అల్లాంటి వెల్తురు వుంటుందని హక్ టామ్ చెవిలో చెప్పాడు.

"టాం! నీకు ప్రార్థనపద్యాలు వచ్చా?"

"మరిచిపోయాను. జ్ఞాపకం చేసుకోనా?"

హక్ తలెత్తి చూశాడు.

"ఒరేయ్, వాళ్లు మనుషులేరా" అన్నాడు. టామ్ ఇంకా కళ్లు గట్టిగా మూసుకునే, "నీ కెల్లా తెలుసు?" అన్నాడు.

"అందులో ఒకడు మఫ్‌పాటర్ లాగావున్నాడు అ గొంతుకకూడా వాడిదే. తాగుబోతు వెధవ తూలుతూ వస్తున్నాడు".

"మరేరా. అవును పాటర్‌గాడే వాడు. ఆ పక్కన వున్నది ఇంజన్‌జో. వాడు బోలెడు హత్యలు చేశాట్ట."

ఆ ముగ్గురు కొత్తవాళ్లు ఈపాటికి గోరీదగ్గరికి వచ్చేశారు. అందులో ఒకడు డాక్టర్ రాబిన్సన్. ఆయన లాంతరు పట్టుకున్నాడు. పాటర్ చేతులో గడ్డ పలుగు, పార వున్నాయి. పాటరు, ఇంజన్‌జో కలిసి శవాలు మోసుకుపోయేందుకు ఉపయోగించే 'పాడె' మోసుకొచ్చారు. దాన్ని గోరీపక్కన పడేశారు. ఇద్దరూ గోరీని తవ్వటం మొదలెట్టారు. డాక్టర్ రాబిన్సన్ దీపాన్ని ఆపక్కన పెట్టి టామ్, హక్‌లు దాక్కున్న రావిచెట్టు మొదట్లో చదికిలపడ్డాడు. కాని కుర్రాళ్లిద్దరూ అవతలవేపున ముడుచుకుని కూచోటం మూలాన ఎవరికీ కనిపించలేదు.

"ఏయ్, దబ్బున కానివ్వండి. వెన్నెల రాక ముందే పని జరిగిపోవాలి." అన్నాడు డాక్టర్.

వాళ్లిద్దరూ గొణుక్కుంటూ గోరీని తవ్వేశారు. అందులోంచి శవాన్ని తీసి పాడెమీద పడేసి తాళ్లతో బిగించి కట్టారు. అంతా అయింతరవాత పాటరు,

"ఏమయ్యోయ్ డాక్టరూ! ఇదిగో నీపని పూర్తి చేశాం. ఇంకో అయిదురూపాయలు లిట్టా పారేయ్." అన్నాడు.

"ఇంకో అయిదా? ఎందుకూ? మీ కివ్వవలసింది ముందే ఇచ్చేశాగా"? అ అన్నాడు డాక్టర్.

"పడిశావులే. నోరు మూసుకుని అయిదు రూపాయ లిట్టా పారేయ్." అంటూ ఇంజన్ జో డాక్టర్ మీదికి వచ్చాడు. డాక్టర్‌కు పాతికేళ్లకంటే ఎక్కువ వుండవ్. పిడికిలి బిగించి ఇంజన్ జో మొహంమీద గుద్దాడు జో గిర్రున తిరిగి వెనక్కి పడ్డాడు. పాటర్ తన చేతులో వున్న పెద్ద బాకును కిందపడేసి డాక్టర్‌తో కలబడ్డాడు. ఈలోగా ఇంజన్ జో లేచాడు. పాటర్ పడేసిన బాకు తీసుకుని, దెబ్బలాడుకుంటున్న ఆయిద్దరి చుట్టూ వంగి తిరుగుతూ, డాక్టరుని పొడవడానికి చూస్తున్నాడు. డాక్టర్ పాటర్ పట్టునుంచి విడిపించుకుని ఆ పక్కనేవున్న ఒక బండరాయి నెత్తి పాటర్ నెత్తి మీద వేశాడు. వాడు "అమ్మోయ్" అని దొర్లుకుంటూ పడిమూర్ఛపోయాడు. ఇదే సమయ మనుకుని ఇంజన్ జో ఒక్క దూకుదూకి బాకుతో డాక్టర్ గుండెల్లో పొడిచాడు. డాక్టర్ వెర్రికేక వేసి పాటర్ మీద పడిపోయాడు. కాసేపు అటూ ఇటూ దొర్లి మూలిగాడు. రెండు నిమిషాలకల్లా చచ్చిపోయాడు.

ఇదంతా చూస్తున్న టామ్, హక్ గజగజ వణికిపోయారు. ఇంజన్ జో డాక్టర్ని చంపగానే వాళ్లిద్దరూ పరుగు లంకించుకున్నారు. శ్మశానం దాటి రోడ్డుమీద పడ్డారు. ఊళ్లోకి చేరుకునేదాకా వెనక్కి తిరిగి చూడకుండా పరుగుతీశారు.

ఈలోగా ఇంజన్ జో బాకుని పాటర్ చేతులో పెట్టాడు. తను కొంచెం దూరంలో చదికిలపడ్డాడు. అయిదారు నిమిషాలకి పాటర్ కొంచెం కదిలి మూలి గాడు. అరచెయ్యి ముడిచి బాకుని పట్టుకున్నాడు. కళ్లు తెరచి బాకుని చూసి భయపడి దాన్ని వదిలేశాడు. నెమ్మదిగా మోచేతులమీద లేచి మీద పడివున్న డాక్టర్ శరీరాన్ని తోసేశాడు. లేచి కూచ్చుని చుట్టూ చూశాడు. జో కనిపించాడు.

"ఇదేమిటి జో! డాక్టర్ చచ్చిపోయాడా?" అన్నాడు పాటర్.

"ఆ చచ్చిపోయాడు. ఎందుకు చంపేశావు పాపం అతన్ని?" అన్నాడు ఇంజన్ జో.

"నేనా? నేను చంపలేదే?"

ఊరికే అబద్ధాలాడితే లాభం లేదు. నువ్వే చంపావు బాకుతో.

"ఛా! నేనే చంపానా? నాకు జ్ఞాపకం లేదు. ఇవ్వాళ బాగా తాగటం పొరపాటైంది. ఒరే జో, నిజంచెప్పరా. నేనే చంపానా? నాకు గుర్తులేదే చంపి నట్టు. పాపం డాక్టరు కుర్రాడు రా; పైకి రావలసిన వాడు. నే నెల్లా చంపానురా అతన్ని"

"నువ్వే చంపావు. నీమీద ముందు గాయి వేశాడు డాక్టర్. నువ్వు దిమ్మదిరిగిపడ్డావు. మళ్లీ లేచి బాకు పుచ్చుకుని డాక్టర్‌ని పొడిచావు. మళ్లీ

డాక్టర్ నిన్ను రాయితో కొట్టి, తను పడిపోయాడు. నువ్వు మూర్ఛపోయావు. డాక్టర్ చచ్చిపోయాడు.

"అరెరే. ఎంత పని జరిగింది. నే నసలు చంపుదామనుకోలేదు. నా జన్మలో నే నెప్పుడూ ఎవర్నీ చంపలేదు. ఒరే జో! ఎవరితోనూ చెప్పవుగదూ, నేను చంపినట్టు. నువ్వు చాలా మంచివాడివి. ఎవరితోనూ చెప్పవుగదూ. నీ కాళ్ళమీద పడుతున్నా. నన్ను కాపాడు." అంటూ పాటర్ జో కాళ్ళమీద పడ్డాడు.

"అల్లాగేరా? ఎవరితోనూ చెప్పనులే. నీ మీద నాకేమీ కోపంలేదు లే."

పాటర్ లేచి ఏడవటం మొదలెట్టాడు.

"ఊఁ. ఇహ ఏడవకు. అయిందేదో అయిపోయింది. ఇక్కడినించి పారిపోవాలి. నువ్వటు పో నేనిటుపోతాను." అన్నాడు హంతకుడు జో.

పాటర్ ఏడుపు ఆపేసి ఊరివైపుకి నడిచాడు కొంతదూరం తూలుతూ నడిచి పరిగెత్తడం మొదలెట్టాడు. ఇంజన్ జో ఇంకో వైపుకి పరిగెత్తాడు.

టామ్, హకల్ బెరీఫిన్-ఇద్దరూ ఉరుకులు, పరుగులమీద ఊళ్లోకి చేరుకున్నారు. దోవలో ఏది కనిపించినా మనిషో, దెయ్యమో ననే వాళ్ళ భయం. ఎల్లాగైతేనేం ముందుగా కనిపించిన చెప్పుల దుకాణంలో వచ్చిపడ్డారు. రాత్రిళ్లు ఆ దుకాణంలో ఎవ్వరూ వుండరు. ముందువసారా దాటి చీకట్లో ఒక మూల

కూలబడ్డారు. ఆయాసంతో గుండెలు కొట్టుకుంటు న్నాయి. ఇద్దరికీ ముచ్చెమటలు పోశాయి.

నెమ్మదిగా ఆయాసం తగ్గి మాట్లాడటానికి వీలైంది.

"ఒరే హాక్. ఇప్పుడేం జరుగుతుందంటావు?" అన్నాడు మెల్లిగా టామ్.

"డాక్టర్‌ని చంపినవాడికి ఉరిశిక్ష పడుతుంది." అన్నాడు హాక్ అంతకంటే మెల్లిగా.

"చంపినవాడెవడో ఎల్లా తెలుస్తుంది? మనమే చెబుదామా?"

"మనమా? బలేవాడివే. ఒక వేళ కోర్టువాళ్లు ఇంజన్ జో చంపలేదని తీర్పు చెబుతారనుకో. వాడు జైలునించి వచ్చి మన్ని చంపెయ్యడూ."

"అవును, నిజమే. మనం చెప్పకూడదు."

"అంతగా చెబితే మఫ్ పాటర్ చెబుతాడేమో."

టామ్ మాట్లాడకుండా ఆలోచిస్తున్నాడు. మళ్ళీ ఇలాగన్నాడు. "మఫ్ పాటర్‌కి తెలియదు, ఎవరు చంపారో. వాడెల్లా చెబుతాడు?"

"పాటర్‌కి ఎందుకు తెలియదూ?" అన్నాడు హాక్.

"ఎందుకంటే, ఇంజన్ జో డాక్టర్ని చంపినప్పుడు, పాటర్ మూర్ఛలో వున్నాడు. వాడికి ఈ సంగతి తెలియనే తెలియదు."

"అవున్రా టామ్. నిజమే. నే నా విషయం మర్చిపోయాను."

"అంతే కాదు. డాక్టరు రాతితో కొట్టిన దెబ్బకి పాటర్ కూడా చచ్చిపోయాడేమో?"

"అహా, చావడులే. వాడు బాగా తాగి వున్నాడు. తాగివున్నప్పుడు ఎంత దెబ్బ కొట్టినాసరే మనిషి చావడుట. మా నాన్న చెప్పాడు నాతో." అన్నాడు హాక్.

"హాక్, ఈరాత్రి మనం చూసిన విషయాలు ఎవ్వరితోనూ చెప్పవుగదూ."

"ఛస్తే చెప్పను. ఇంజన్ జో ఎంతమందిని చంపాడో? మనం చెప్పామని వాడికి తెలిస్తే ఈగల్ని నలిపినట్టు నలిపేస్తాడు మన్ని. ఎవ్వరితో చెప్పకూడదని ఒట్టు పెట్టుకుందామా?"

టామ్ అందుకు ఒప్పుకుని ఒట్టుకోసం చెయ్యి జాపాడు.

"అబ్బే, చేతిలో ఒట్టు పనికిరాదు. ఆడపిల్లలతో స్నేహం చేసేటప్పుడైతే చెయ్యి గిల్లి, చెయ్యి ముద్దు పెట్టుకోవచ్చు. కాని ఇల్లాంటి పెద్ద విషయంలో అది పనికిరాదు." అన్నాడు హాక్.

టామ్‌కు యీ మాట రైటే ననిపించింది. ఇది కాస్తా, కూస్తా విషయమా? అర్ధరాత్రిపూట-శ్మశానంలో,-దెయ్యాలు తిరిగే చోట - హత్య జరగటం

కళ్లారా చూశాడు. టామ్‌కు ఇది తలుచుకునేటప్పటికి మళ్ళీ చెమటలుపోశాయి.

దుకాణంలో వసారాలో వెదకగా ఒక తెల్లటి తోలుముక్క కనిపించింది. టామ్ జేబులో పొద్దున్న స్కూల్లో మాష్టారికి తెలియకుండా కొట్టేసిన ఎర్రటి సీమసున్నం పిక్క వుంది. పెదిమల మధ్య నాలిక నొక్కి పట్టి తల కాయ అటూ యిటూ తిప్పుతూ టామ్ తోలు ముక్కమీద ఇల్లా రాశాడు.

హాక్ ఫిన్, టామ్‌సాయర్ ఈ రహస్య మునుఎవరితోనైన చెప్పినయెడల వారి శిర స్సులు వెయ్యిచెక్కలై పోవుగాక.

ఇట్లు,

ఇంతవరకూ టామ్ రాశాడు. టామ్ ఇంత చక్కని భాషలో, అంత తొందరగా వ్రాయటం చూసి హాక్ చాలా మెచ్చుకున్నాడు. (వాడికి అక్షరాలే రావు.) తరవాత తన చొక్కాకి వున్న ఇత్తడి పిన్నీసు తీసి బొటనవ్రేలిమీద గుచ్చబోయాడు. కాని టామ్ పిన్నీసు లాక్కుని,

"ఆగాగు. ఇది ఇత్తడి పిన్నీసు. దీనితో గుచ్చితే విషం." అన్నాడు టామ్. తన జేబులోవున్న బట్టలు కుట్టుకునే సూది తీశాడు. దానితో తన బొటనవేలి మీాద గుచ్చాడు. నెత్తురు వచ్చింది. ఇల్లా చాలాసార్లు

గుచ్చి బొటనవేలిమీదికి నెత్తురు తెచ్చాడు. 'ఇట్లు' అని రాసినదానికింద ఎలాగో తంటాలు పడి తన సంతకం చేశాడు. తరవాత హాక్ బొటనవేలిమీద సూదితో గుచ్చుకుని నెత్తురు చేసుకున్నాడు. టామ్ తన సంతకం కింద హాక్ చేత వేలిముద్ర వేయించాడు.

ఇప్పటికి ప్రమాణం చెయ్యటం పూర్తయింది. ఈ ప్రమాణంతో వాళ్ల నోళ్లకి తాళాలు వేసినట్లయిం దన్నమాట. తరవాత ఆ తోలుముక్కను గోడపక్కనే కొద్దిగా తవ్వి, ఏవో మంత్రాలు చదువుతూ పాతి పెట్టారు.

ఈ ఖ్లీపని చేస్తుండగా బయటవసారాలోకి ఎవరో నెమ్మదిగా వచ్చారు. కాని వాళ్లు చూడలేదు.

ఇంతలోకే రోడ్డుమీద ఒక కుక్క మోరెత్తి మొరగటం మొదలెట్టింది. ఇద్దరూ భయపడి ఒకళ్ల నొకళ్లు గట్టిగా పట్టుకున్నారు.

అర్ధరాత్రివేళ ఊరకుక్క అల్లా మొరగ కూడదు. అది ఎటువేపు చూసి మొరుగుతుందో ఆ వేపున వున్నవాళ్లు త్వరలో చచ్చిపోతారని పిల్లలంద రికీ నమ్మకం. అందుకని టామ్, హాక్ భయపడ్డారు. టామ్ నెమ్మదిగా అన్నాడు.

"ఎవరో చచ్చిపోతారు తప్పదు."

"బహుశా, మనిద్దరం చచ్చిపోతామేమో?"

"హాక్, ఆ గోడ కన్నంలోంచి చూడరా?"

"బాబో, నాకు భయం. నువ్వే చూడు"

టామ్ ధైర్యం చేసి కన్నంలోంచి చూశాడు. సంతోషంతో ఇల్లాగన్నాడు.

"హాక్. ఆ కుక్క మనవేపుకు తిరిగి లేదు."

"అమ్మయ్యా, అయితే మనకేమీ ఫరవాలేదు.

కుక్క మొరగటం మానేసింది. కాసేపు నిశ్శబ్దం. మళ్లీ ఏదో చప్పుడు. ఇద్దరూ చెవులు రిక్కించి విన్నారు.

"ఎవరో గుర్రు పెడుతున్నట్టుంది బయట వసారా లోకి వెళ్ళి చూద్దామా?" అన్నాడు టామ్.

"నువ్వు వెళ్లి చూడరా?"

"నేను ముందు నడుస్తాను. నువ్వు వెనకాలే రా."

ఇద్దరూ అడుగుల్లో అడుగు లేసుకుంటూ బయటికి వచ్చారు. ఎవరో మనిషి నిద్రపోతున్నాడు. కాళ్లు వెన్నెలలో వున్నాయి. తల నీడలో వుంది. దగ్గిరికి వెళ్లి చూశారు. మఫ్ పాటర్! ఇద్దరికీ గుండె లాగి పోయాయి. ఇక్కడి కెల్లా వచ్చాడు పాటర్? కుక్క ఈ సారి పాటర్ కేసి తిరిగి మొరగటం మొదలెట్టింది.

"చూశావా, కుక్క వాడికేసి తిరిగి మొరుగు తోంది." అన్నాడు రహస్యంగా టామ్.

"అయితే పాపం పాటర్ చచ్చిపోతా డన్న మాట."

ఇద్దరూ ఊపిరి బిగపట్టి దుకాణందాటి రోడ్డు మీద కొచ్చారు. హాక్ ఒకవేపుకు, టామ్ తన యింటికేసి వెళ్లిపోయారు.

టామ్ నెమ్మదిగా ఇంటికి చేరుకుని పక్కలో దూరి ముసుగుతన్ని పడుకునేటప్పటికి తెల్లవారి అయిదు గంటలు కావచ్చింది. తను ఇంట్లోంచి వెళ్లటం ఎవరూ చూడలేదుగదా, బతికాను, అనుకు న్నాడు. కాని దొంగనిద్రపోతూ గుర్రుకొడుతున్న సిడ్ గంటసేపటినుంచీ మేలుకునివున్నట్టు టామ్‌కి తెలియదు.

# 7

టామ్ నిద్రలేచేటప్పటికి బాగా పొద్దెక్కింది. పొద్దెక్కేదాకా పడుకుంటే సాధారణంగా, వాళ్ల పెద్దమ్మ గిల్లి, కొట్టి, చెవుల్లో నీళ్లుపోసి లేచేదాకా వూరుకునేది కాదు. ఇవ్వాళ ఎవరూ తనజోలికి రాక పోవటం చూసి - తప్పుచేసినవాడిలాగా భయపడటం మొదలెట్టాడు టామ్.

అయిదు నిమిషాల్లో మొహం కడుక్కుని, మంచి బట్టలు తొడుక్కుని టామ్ మేడదిగి కిందికి వెళ్లాడు. అందరూ టామ్‌కేసి ఒక్కసారి చూశారు. ఎవ్వరూ మాట్లాడలేదు. ఒక్కమాట అనలేదు. టామ్ అనేవాడు ఉన్నాడన్న సంగతే మర్చిపోయినట్టు అతనికేసి చూడకుండా వాళ్ల పని వాళ్లు చేసుకుంటు

న్నారు. దాంతో టామ్ గుండెలు జారిపోయాయి. ఏదో పెద్ద తుపాను రాబోతున్నట్లు భయపడ్డాడు. కాని తనకేమీ తెలియదని వాళ్లనుకోటానికి ఉషారుగా వున్నట్టు అటూ ఇటూ హడావిడిగా తిరిగాడు కాని, లాభం లేకపోయింది. ఎవరూ వాడికేసి చూడలేదు. చివరికి నిట్టూరుస్తూ ఒకచోట మాట్టాడకుండా చతికిలబడ్డాడు.

చద్దెన్నంతిన్న తరవాత పెద్దమ్మ టామ్‌ని ఒక గదిలోకి తీసుకెళ్లింది. దబదబ నాలుగు బాదేసుందేమో అని టామ్ సంతోషపడ్డాడు. కాని పెద్దమ్మ అలాంటిదేమీ చెయ్యలేదు. ఆవిడ ఏడ్చింది.

'నన్ను ఎంత తిప్పలుపెడుతున్నావురా' అంది. 'ఇక నువ్వు బాగుపడేది లేదులే, అంది. "నీ యిష్టం నువ్వేమన్నా చేసుకో. ఎంతకని నిన్ను కనిపెడుతూ కూచుంటాను. నేను కాస్తా గుటుక్కుమన్న తరవాత నిన్ను అడిగేవాళ్లే ఉండరులే" అంది.

టామ్‌కు వెయ్యి కొరడాదెబ్బలు కొట్టినంత బాధేసింది. తనూ ఏడ్చాడు. 'పెద్దమ్మా! ఇంకెప్పుడూ నీమాటకి ఎదురు తిరగను. నిన్ను కష్టపెట్టను.' అని ఒట్టేసుకున్నాడు. చివరి కావిడ ముక్కు, కళ్లుతుడుచుకుని వెళ్లిపోయింది. ఆవిడ పూర్తిగా క్షమించలేదని, తన మాటల్లో నమ్మకం ఎప్పుడో పోయిందని టామ్‌కు తెలుసు.

తను రాత్రి ఎక్కడికో వెళ్ళిన సంగతి సిద్ చెప్పివుంటాడు పెద్దమ్మకి. కాని వాడిని కొట్టాలనిపించ లేదు టామ్‌కి. విచారంగా స్కూలుకి వెళ్ళాడు. జోహా ర్పరుతో కలిసి నిన్న మధ్యాహ్నం స్కూలు ఎగగొట్టి నందుకు, వాడితో పాటు పేంబెత్తందెబ్బలు రుచి చూశాడు. అయితే టామ్ మనస్సు ఇంతకంటే పెద్ద కష్టాలలో వుండటంవలన ఈ దెబ్బల్ని లెక్క చెయ్య లేదు. తన సీటులో కూలబడి మేష్టరుకేసి గుడ్లప్పగించి చూస్తున్నాడు.

* * *

ఆరోజు మధ్యాహ్నానికల్లా శ్మశానంలో జరిగిన హత్యవార్త ఊరంతా పాకిపోయింది. అంచేత స్కూలుకి అవ్వాళ సెలవిచ్చారు.

శవందగ్గిరగా ఒక బాకు కనిపించింది. అది మఫ్ పాటర్‌దని ఎవరో గుర్తుపట్టారు. అంతేకాదు. రాత్రి 2 గంటలవేళ మఫ్‌పాటర్ ఊరిబయట కాలవలో కాళ్లు చేతులు కడుక్కోవటం ఎవరో చూశారట. (పాటర్ తన జన్మలో ఎప్పుడూ కాళ్లు, చేతులు కడు క్కోవటం ఎరగడు.) అంచేత వాడే హత్యచేసివుండా లని అందరికీ అనుమానం కలిగింది. పైగా ఎంత వెది కినా ఊళ్లో పాటర్ కనిపించలేదు. దీనితో అనుమానం స్థిరపడింది. పోలీసుస్టేషనునుంచి పోలీసులు వచ్చి అన్ని వేపులకీ పరుగెత్తారు, హంతకుణ్ణి పట్టుకోటానికి.

ఊరు ఊరంతా శ్మశానందగ్గిర పోగయ్యారు. టామ్‌కూడా వాళ్ళతో వెళ్ళాడు. ఇంతలో ఎవరో టామ్‌చొక్కా లాగారు. వెనక హాకల్‌బెరీ నుంచు న్నాడు. ఇద్దరి చూపులు కలిశాయి. వాళ్ళిద్దరూ ఒక చోట నుంచున్నందుకు ఎవరన్నా అనుమానపడ్డా రేమోనని అందరికేసీ చూశారు. కాని ఎవ్వరూ వీళ్ళని గమనించినట్టు లేదు.

ఇంతలో మఫ్‌పాటర్ వస్తున్నాడని కేకలు విన బడ్డాయి. అందరూ ఆవేపు చూశారు. తూలుతూ, పడుతూ, లేస్తూ పాటర్ వస్తున్నాడు. పోలీసు ఇన్‌స్పెక్టరు 'ఆ, దొంగ దొరికాడు' అంటూ వెళ్ళి వాడి చెయ్యి పట్టుకున్నాడు. వాడు పారిపోవటానికి ప్రయ త్నించలేదు. శవందగ్గరికి సరాసరి వచ్చి, దాన్ని చూసి కళ్లు కప్పుకొని ఏడవటం మొదలెట్టాడు.

"నేను చంపలేదు బాబయ్యా!" అన్నాడు పాటర్ ఏడుస్తూ.

"నువ్వు చంపావని ఎవ రన్నారు?"అన్నాడొక పెద్దమనిషి.

పాటర్ తలఎత్తి చుట్టూ చూశాడు. ఇంజన్‌జో కనిపించాడు.

"ఇంజన్‌జో! నువ్వు ఎవళ్ళతోనూ చెప్ప నన్నావుగదరా!" అన్నాడు పాటర్.

"ఈ బాకు నీదేనా?" అని ఇన్స్పెక్టరు బాకు చూపించాడు.

ఆ బాకు చూసి పాటర్ గజగజ వణికిపోయాడు. తరవాత ఇంజన్‌జో ఇన్స్పెక్టరుకి రాత్రి జరిగిన కథని చిలవలుపలవలుగా అబద్ధాలు కలిపించి చెప్పాడు. అంతా ఇన్‌స్పెక్టరు రాసుకున్నాడు. ఇదంతా టామ్, హక్ వింటూ నేవున్నారు. ఏ క్షణానికి ఆ క్షణం ఆకాశం లోంచి పిడుగు ఇంజన్‌జో మీద పడి వాణ్ణి హతమారుస్తుందని, లేకపోతే ఏ ఆకాశవాణో నిజం చెప్పేస్తుందని వాళ్ళనమ్మకం. కాని అలాంటిదేమీ జరగలేదు. తామే చెప్పేద్దామనుకున్నారుజరిగినదంతా. కాని భయపడ్డారు.

"నువ్వు ఎందుకు పారిపోలేదు? హత్య చేసి కూడా ఏ మొహంపెట్టుకుని వచ్చావు?" అని ఎవరో పాటర్‌ని అడిగారు.

"పారిపోదామనే అనుకున్నానండి. కాని నాకు తెలియకుండానే నాకాళ్లు ఇటు ఈడ్చుకొచ్చాయండి". అని ఏడుపు మొదలెట్టాడు పాటర్.

ఇంజన్‌జో చెప్పాడు, డాక్టర్ని చంపింది మఫ్ పాటరేనని. ఇన్స్పెక్టరు అంతా రాసుకున్న తరవాత శవాన్ని ఎత్తి లారీలో పడెయ్యటానికి ఇంజన్‌జో సహాయం చేశాడు. పాటర్‌నికూడా పోలీసులు లాక్కుపోయారు.

ఆ తరవాత టామ్ ఒక్క రాత్రి కూడా సరిగా నిద్రపోలేదు. ఇంజన్ జో హంతకుడన్న సంగతి టామ్కీ, హక్ కీ తప్ప ఇంకెవరికీ తెలియదు. అది చెప్పటానికి వాళ్ళకి ధైర్యం లేకపోయింది. దీనితో టామ్ మనస్సంతా అల్లకల్లోలమైపోయింది. రాత్రిళ్లు ఒకటే పీడకలలు. తెల్లారితే లేచాక కళ్లు ఎర్రగా వాచివుండేవి. పోలీ పెద్దమ్మకి సంగతేమీ అర్థంకాలేదు.

ఒకరోజున సిడ్ అన్నాడు. "టామ్! ఏమిట్రా రాత్రిళ్లు ఒకటే గొడవ చేస్తావు. నా నిద్రకూడా చెడగొడుతున్నావు."

టామ్ నాకేమీ తెలియదన్నాడు.

"తెలియకపోవటమేమిటి? నిన్న రాత్రి బాబోయ్ నెత్తురు, నెత్తురు, అన్నావు బోలెడుసార్లు. మొన్న రాత్రి "నన్ను కొట్టద్దు. నిజం చెప్పేస్తాను.' అని అరిచావు. ఏమిటది?" అన్నాడు సిడ్.

పెద్దమ్మకి అంతా అర్థమైంది. "అదా! ఆ శవాన్ని చూసినప్పటినుంచీ కుర్రాడు జడుసుకున్నాడు కాబోలు. నాకూ రోజూ పీడకలలు వస్తూనే వున్నాయి." అన్నది.

కాని సిడ్ కి నమ్మకం కలగలేదు. ఆరోజునించీ టామ్ ఒక కొత్త ఎత్తు ఎత్తాడు. పన్నుపోటు బాగా ఎక్కువగా వుందన్నాడు. అందుకని పడుకోబోయే టప్పుడు రుమాలతో నోరు బిగించి కట్టుకునేవాడు.

ఎందుకంటే నోరు కట్టేసుకుంటే కొంచరింతలు రావు గదా అని. కాని సిడ్ టామ్ నిద్రపోయిన తర వాత నెమ్మదిగా రుమాలు లాగేసి టామ్ అరిచే అరుపులన్నీ వినేవాడు. ఈసంగతి టామ్‌కి తెలియదు.

పగటిపూట వీలు దొరికినప్పుడల్లా టామ్ ఊళ్ళో వున్న జైలుకి వెళ్లేవాడు. అక్కడ కాపలాగా ఎవరూ వుండేవాళ్లు కాదు. టామ్ ఏవన్నా పళ్లో, లేకపోతే తినేవస్తువు ఇంకేదైనా సంపాదించి కటకటాలగుండా మఫ్‌పాటర్‌కి అందించేవాడు. పాటర్‌ని అన్యాయంగా జైల్లోపెట్టారనీ, అతన్ని తను రక్షించలేకపోయాననీ టామ్‌కి విచారంగా వుండేది. ఆ విచారం ఇల్లాంటి చిన్న చిన్న సహాయాలవల్ల కొంత తగ్గేది.

ఈ విచారం తగ్గిందికాని, టామ్‌కి ఇంకో విచారం పట్టుకుంది. బెకీథాచర్ (కొత్తమ్మాయి) స్కూలుకి రావటంలేదు. ఆ అమ్మాయికి జబ్బుగా వుందిట. చచ్చిపోతుందేమో నని టామ్‌కి బెంగ. రోజూ ఆమె ఇంటిచుట్టూ తిరిగేవాడు.

టామ్ ఇదివరకులాగా ఉత్సాహంగా వుండటం లేదు. నలతగా వుంటున్నాడు. పెద్దమ్మకి మందుల మీద, అందులో కొత్తకొత్తమందులమీద బాగా నమ్మకం. ఆవిడ మందుల పత్రికలు కొంటెచ్చు తెప్పించేది. వాటిల్లో ప్రకటించబడే మందుల్ని కొని ఇంట్లో

వాళ్ల మీద, ఇరుగుపొరుగువాళ్లమీద ప్రయోగిస్తూ వుండేది.

ఈమధ్య పత్రికల్లో కొత్తరకం వైద్యం ఒకటి బాగా పేరుకి వచ్చింది. ఏ జబ్బునైనా నీళ్లతో కుదర్చవచ్చునని ఆమె పత్రికల్లో చదివింది. దాన్ని వాడిచూడటానికి ఆవిడకి ఇంతవరకూ వీలుచిక్కలేదు. ఇప్పుడు టామ్ దొరికాడు. నీళ్లగదిలో టామ్‌ని నుంచో బెట్టి వాడిమీద బింద్లెకి బిందెలు మంచు నీళ్లకంటే చల్లటి నీళ్లని గుమ్మరించేది. తువ్వాలు పెట్టి నెత్తు రొస్తుందేమో అనేంతదాకా వళ్లు రుద్దేది. తరవాత వంటినిండా శాలువ కప్పి బాగా చెమటలు పట్టనిచ్చేది. కాని ఎంత చేసినా టామ్‌పరిస్థితి బాగుపడలేదు.

తరవాత వేడినీళ్ల వైద్యం. వళ్లు పట్టనంత వేడి నీళ్లు గుమ్మరించేది. దాని తరవాత నీళ్ల తొట్టెలో బుడుగూ, బుడుగూ ముంచటం ప్రారంభించింది. పెట్టే అన్నం తగ్గించేసింది. ఎంత చేసినా టామ్ అల్లాగే వున్నాడు. ఎక్కువ మాట్లాడడు, నవ్వడు; ఎటో దిగులుగా చూస్తాడు.

మళ్ళీ పత్రికల్లో ఒక కొత్తమందునుగూర్చి ప్రకటన పడింది. దానిపేరు పెయిన్-కిల్లర్. అంటే అన్ని రకాల నెప్పుల్ని చంపేనేది అని అర్థం. ఆ, ఇది బావుందనుకున్నది పోలీ పెద్దమ్మ. ఆ మందు అయిదారుసీసాలు తెప్పించింది. ఒక బొట్టు తను రుచి

చూసింది. ఓ, బలేగా వుంది. ఒక్క బొట్టు నాలిక మీద పడితే చాలు, ఇహ రెండు రోజులదాకా నాలిక భగభగ నిప్పులాగా మండవలసిందే. దీనితో టామ్ రోగం తప్పకుండా కుదురుతుంది.

టామ్‌తో ముందే చెప్పింది, ఇది చాలా అద్భుతమైన మందు అని. జాగ్రత్తగా తేనె తాగించినట్టు రెండు చెమ్చాల మందు గ్లాసులో పోసి ఒక్కసారిగా గుటకవేయించింది. వెంటనే మందుగుణం కనిపించింది. అంతవరకూ స్తబ్ధంగా కూర్చున్న టామ్ ఎగిరి గదిలో గంతులేస్తూ, నాట్యం చెయ్యటం మొదలెట్టాడు. వాడి గావుకేకలికి ఇల్లెగిరిపోతుందా, అనిపించింది.

టామ్ ఇక వూరుకుంటే లాభం లేదనుకున్నాడు. ఈ పెయిన్-కిల్లర్ మందుని పెద్దమ్మ రోజూ తాగించేటట్టువుంది. కొత్తఎత్తు ఎత్తాడు. మర్నాడు పొద్దున్న పెద్దమ్మ దగ్గిరికి వెళ్ళి 'నిన్నటిమందు బలేగా వుందే పెద్దమ్మా! నాకు బాధలన్నీ తగ్గిపోయాయి. ఎంత మంచిమందు పెద్దమ్మా!' అని పొగడటం మొదలెట్టాడు. పెద్దమ్మ సంతోషించింది. 'నేనే తీసుకు తాగుతాను పెద్దమ్మా!' అని సీసా తీసుకున్నాడు.

ఆ రెండోరోజున పెద్దమ్మ మందుసీసా చూసేటప్పటికి అప్పుడే సగం అయిపోయింది. 'టామ్ మందు జాగ్రత్తగా పుచ్చుకుంటున్నాడల్లే వుంది' అనుకున్నది.

మూడోరోజున సీసా ఖాళీ! మళ్ళీ కొత్తసీసా తీసుకున్నాడు టామ్. వాడిగదిలో గచ్చునేలమీద ఒక పగులు వున్నది. పాపం గచ్చునేల యెంత బాధపడుతోందో అని టామ్ ఆబాధ తగ్గించటానికి మందుని ఆపగులులో పోస్తున్న సంగతి పెద్దమ్మకి తెలియదు.

ఒకరోజున టామ్ ఆ పగులుచేత మందు తాగిస్తున్నాడు. పెద్దమ్మ పెంచే పిల్లికూన అక్కడికి వచ్చింది. అది సీసాకేసి, చెమిచాకేసి ఆత్రంగా చూస్తోంది.

"ఏం, సీకూ కూడా మందు కావాలా?"

పిల్లి కావాలన్నట్టు చూసింది.

"నిజంగానే?"

నిజంగానే అన్నట్టు చూసింది.

"మళ్ళీ మాట పుడితే నన్నడగొద్దు, ముందే చెబుతున్నాను"

పిల్లి పరవాలేదు ఇమ్మన్నట్టుగా కనబడింది.

"ఇదిగో, తరవాత ఏడ్చావంటే లాభంలేదు." అన్నాడు టామ్. పిల్లి దగ్గిర కొచ్చింది. దాని నోరు తెరిచి ఒక చెమిచాడు మందు పోశాడు. ఇహ చూసుకోండి. రెండుగజాల ఎత్తున గాలిలో కెగిరింది పిల్లి. దభేలున పడి లేచింది. మ్యావ్, మ్యావ్ అంటూ గదిలోకి గిర్రున పరిగెత్తింది. ముక్కాలిపీట, దానిమీద వున్న గాజుగ్లాసులు పడేసింది. దోవలో కనిపించిన

ప్రతిదాన్నీ తన్నేసింది. గదిని చిందరవందర చేసింది. 'ఎంత సంతోషమో దానికి, మందు తాగేటప్పటికల్లా.' అనుకున్నాడు టామ్.

ఈ చప్పుడంతా విని పెద్దమ్మ గబగబ గదిలోకి వచ్చింది. పిల్లి ఒక్క పిల్లిమంత్రం వేసి కిటికీలోవున్న కూజా పడగొట్టి బయటికి పారిపోయింది. టామ్ నేల మీద విరగబడి నవ్వుతున్నాడు.

"టామ్! ఏమిట్రా ఆ పిల్లిగోల" అన్నది పెద్దమ్మ.

"నాకు తెలియదమ్మా!" అన్నాడు టామ్ ఇంకా నవ్వుతూ.

"రోజూ లేంది ఇవ్వాళ ఏం వచ్చింది ఆ పిల్లి ముండకి."

"అది కాదమ్మా! దాని కెందుకో సంతోషం పట్ట పగ్గాలులేకుండా వుంది."

ఆవిడ దగ్గిరికొచ్చింది. పరుపుకిందనుంచి తొంగి చూస్తున్న మందు సీసాని, చెమిచాని బయటికి తీసింది. టామ్ నవ్వఆపేసి దొంగచూపులు చూశాడు. పెద్దమ్మ అలవాటు ప్రకారం టామ్ చెవిపైకి చెయ్యి పోనిచ్చి ఒక్క గుంజు గుంజి నుంచోపెట్టింది.

"ఓరి వెధవా! ఈ మందు ఆ పిల్లికి పోశావా?"

"అదికాదమ్మా. ఆ పిల్లికి పెద్దమ్మ లేదుకదూ, అందుకని దానిమీద జాలివేసింది."

"భడవకానా! ఆపిల్లికి పెద్దమ్మ లేకపోతే నేం?"

"ఎందుకేమిటి? పెద్దమ్మ వుంటే ఆ పిల్లిని మంచు నీళ్లలో ముంచేది. వేడినీళ్లు గుమ్మరించేది. దానికి మందు లిచ్చి నాలిక, గొంతిక మండించేది. పాపం దాని కెవరూ లేరుకదా అని నేనే మందిచ్చాను."

ఈ మాటలు కొరడాదెబ్బల్లాగా తగిలాయి పెద్దమ్మకి. అక్కడినించి ఆవిడ వెళ్లిపోయింది.

టామ్ స్కూలుకి టైము కాకుండానే వెళ్లాడు. రోజూమల్లేనే దిగులుగా వున్నాడు. గేటులోనించి వచ్చేవాళ్లందర్నీ చూస్తాడు. బెకీథాచర్ మాత్రం ఎన్నాళ్ళకీ కనిపించదు.

హఠాత్తుగా టామ్‌గుండె ఝల్లుమంది. బెకీ థాచర్! గేటులోనించి వస్తోంది! ఇంకో నిమిషానికల్లా టామ్ నేలమీాద పిల్లి మొగ్గలు వేస్తున్నాడు. 'హేయ్' అని కేకలువేశాడు. బిగ్గరిగా నవ్వాడు. ఒక కుర్రాణ్ణి జుట్టు పీకాడు. ఒకణ్ణి వీపుమీాద పోటు పొడిచాడు. ఈలలువేశాడు. గోడకి కాళ్లానించి తలకిందులుగా నుంచున్నాడు.

ఈ గోలంతా బెకీథాచర్ తనకేసి చూడటానికి చేసిందే. కాని ఆమెమాత్రం టామ్‌వైపుకి చూడనే లేదు. అసలు టామ్ అనేవాడు ఉన్నసంగతి తెలియనే తెలియనట్టుగా ఇంకోవైపు చూస్తోంది.

టామ్ బెకీదగ్గిరిగా వెళ్లి పల్లి మొగ్గలు మొదలెట్టాడు. ఇంకొంచెం వుంటే ఆమెమీదపడి పడేసేవాడే. చివరి కామె టామ్‌కి వినబడేటట్టుగా, "కొందరు తాము చాలా గొప్పవాళ్ళ మనుకుంటారు. వెధవ చేష్టలు చేస్తూను." అన్నది.

టామ్‌బుగ్గలు ఎర్రబడ్డాయి. శాంతించాడు. ముక్కు నలుపుకున్నాడు. గొప్ప అవమానం జరిగినట్టు, తల వంచుకుని వెళ్ళిపోయాడు.

టామ్ ఒక నిశ్చయానికి వచ్చేశాడు. ఈ ప్రపంచంలో తనకి 'నా' అనేవారు లేరు. ఎవ్వరికీ తనంటే లక్ష్యంలేదు; ప్రేమ లేదు. ఏదో తనదోవన తాను పోతూ అందరిచేతా మంచివాడనిపించుకోవాలని ఎంతో ప్రయత్నించాడు. కాని వాళ్లు తన్ని మంచిగా ఉండనిస్తేనా? సర్లెండి. వాళ్లకే తెలిసివస్తుంది ఎప్పటికో. తమ మూలాన ఎంత మంచికుర్రాడు ఎల్లా చెడిపోయాడో వాళ్లకే తెలుస్తుంది. వాళ్లకి తను అక్కర్లేదు. అంచేత తను వాళ్లకి దూరంగా పోతాడు. సముద్రపు దొంగ అవుతాడు. బోలెడన్ని ఘోరమైన నేరాలు చేస్తాడు. అంతకంటే మరోమార్గం లేదు.

టామ్ స్కూలునించి బయల్దేరాడు. ఎక్కడికి పోతున్నాడో అతనికే తెలియదు. దూరంనించి మధ్యాన్నం స్కూలుగంట వినిపిస్తోంది. ఆ గంటని మళ్లీ తను వినడు గదా! అందరూ కలిసి కుట్రచేసి తనని తరిమే

స్తున్నారు. అయినా వాళ్లని తను క్షమించాడు. ఈ క్షమించడం దగ్గిరికొచ్చేటప్పటికి టామ్‌కి ఏడు పాగిండి కాదు.

ఎదురుగా ప్రాణస్నేహితుడు జోహార్పర్ కనిపించాడు. జోకూడా టామ్‌లాగానే విచారంగా వున్నాడు. టామ్ చొక్కాతో కళ్లు తుడుచుకుని వెక్కి వెక్కి ఏడుస్తూ జోతో చెప్పాడు, తను యింటి దగ్గిర్నుంచి పారిపోతున్నానని, వెనక్కి తిరిగి రానని. తనని జ్ఞాపకముంచుకోమని జోని కోరాడుకూడా.

కాని ఆశ్చర్య మేమంటే- జోకూడా టామ్‌తో అదేవిషయం చెప్పటానికి వెదుక్కుంటూ వచ్చాడు. మీగడ తిన్నందుకు జోని వాళ్లమ్మ కొట్టింది. ఈ పీడా విరగడైతే బావుండు ననుకుంది. తను తన అమ్మకే పీడగా వుంటే అక్కడ వుండట మెందుకు? తను వెళ్లిపోతే ఆవిడ సుఖపడుతుంది. అందుకని జోకూడా పారిపోవటానికే నిశ్చయించాడు.

ఇద్దరు మళ్లీ కళ్లూ, ముక్కులూ తుడుచుకున్నారు. ఇద్దరూ ఒకళ్ల నొకళ్లు విడిచిపెట్టమనీ, చచ్చిపోయేదాకా కలిసివుంటామనీ ప్రమాణం చేసుకున్నారు. జో తనకి మునీశ్వరుడిలాగా అడవిలో తపస్సు చేసుకోవాలని ఉందన్నాడు. కాని టామ్ సముద్రపు దొంగల గొప్పతనాలని వర్ణించేటప్పటికి జో తను కూడా సముద్రపు దొంగ కావటానికి అంగీకరించాడు.

టామ్ స్వగ్రామమైన సెంట్ పీటర్సుబర్గ్‌కి మూడుమైళ్లు దిగువగా మిసిసిపీనది రెండుపాయలుగా చీలుతుంది. ఆ మధ్యలో పొడుగాటి ద్వీపం ఒక టుంది. ఆ ద్వీపంనిండా దట్టమైన అరణ్యాలున్నాయి. అక్కడ తమ నివాసం ఏర్పరుచుకోటానికి ఇద్దరూ నిశ్చయిం చారు. అక్కడకి జనం ఎప్పుడూ రారు. దానిపేరు జాక్సన్ ద్వీపం.

తరవాత ఇద్దరూ కలిసి హకల్‌బెరీఫిన్‌ని వెతికి పట్టుకున్నారు. వాడికి ఏ వృత్తి అయినా ఒకటే. అందుచేత వీళ్ల ప్లాను వినివినగానే 'రైటో' అన్నాడు. ఊరికి ఎగువగా రెండుమైళ్లదూ రాన ఒకచోట అర్ధరాత్రివేళ ముగ్గురూ సమావేశమవ టానికి ఏర్పాటు చేసుకున్నారు. చేపలు పట్టే గాలాలు, ఇంకా అవసరమైన ఇతర చిల్లరవస్తువులు దొంగతనం చేసైనాసరే తేవటానికికూడా ఏర్పాటు చేసుకున్నారు. ఇకముందు ఎల్లాగూ దొంగతనాలు చెయ్యాందే గడవదుగా. అది ఇప్పుడే మొదలుపెడితే సరి.

సాయంత్రమయ్యేసరికల్లా టామ్, జో, హాక్ ముగ్గురూ కనిపించిన అడ్డమైనవాడికీ చెప్పేశారు. "రేపు తెల్లారేటప్పటికి ఒక గొప్పవిషయం జరుగుతుం" దని ప్రతివాడికీ రహస్యంగా చెవులో ఈ ముక్కలు చెబుతూ "ఎవ్వరితోనూ చెప్పము" అని ఒట్టువేయించు కున్నారు.

అర్ధరాత్రికల్లా టామ్ తినుబండారాలు మూట కట్టుకుని అనుకున్నచోటికి వచ్చాడు. ఒక పొదలో దాక్కున్నాడు. అంతా నిశ్శబ్దంగా వుంది. నక్షత్రాల గుడ్డివెలుతురుతప్ప మరే వెల్తురూ లేదు. నదిలో కెరటాలుకూడా నిద్ర పోతున్నట్టున్నాయి. టామ్ నెమ్మదిగా ఈలవేశాడు. ఆ యీలకి సమాధానంగా మరొక ఈల వినిపించింది. టామ్ మళ్ళీ రెండుసార్లు ఈల వేశాడు. రెండుసార్లూ జవాబులు వచ్చాయి.

"ఎవరక్కడ?" అని ఒక గొంతుక కేక వేసింది.

"టామ్ సాయర్-మహాసముద్ర రాజ్యాధిపతి. మీా రెవరు?"

"చోరాగ్రేసర చక్రవర్తి హాక్ ఫిన్. అరివీర భయంకర సముద్రపిశాచి జోహార్పర్." అని రెండు గొంతుకలు సమాధాన మిచ్చాయి.

ఈ బిరుదులు టామ్ తగిలించినవే. ఏపుస్తకాల్లో నుంచో ఈమాటలు పికాడు.

"సరే. మీా ఆనవాలు ఏమిటి?"

హాక్, జో ఇద్దరూ ఒక్కసారిగా "రక్తం" అన్నారు.

ఇంత జరిగినతర్వాతగాని టామ్ పొదలో నుంచి బయటికి రాలేదు. సముద్రపుదొంగ జాగ్రత్తగా వుండొద్దూ మరి. పొదలోనుంచి బయటకి రావటానికి శుభ్రమైన దారి వున్నది. కాని టామ్ ఆదారిని రాలేదు. అందులో గొప్ప ఏముంది? ఎంత కష్టమైన దారిలోంచి

వస్తే అంత గొప్ప. అందుకని ముళ్లు, రాళ్లుతొక్కుతుం టూ వళ్లంతా చీరుకుపోతుండగా ఇవతలకొచ్చాడు.

మిగతా యిద్దరువీరులు కూడా తినుబండారాలు, మిగతాసామాను తెచ్చారు. 'చోరాగ్రేసర చక్రవర్తి' పొగాకు, కొన్ని చుట్టలుకూడా తెచ్చుకున్నాడు.

నదిఒడ్డున ఒక పడవ వున్నది. ఆ పడవ తాలూకు మనుషులు ఊళ్లో నిద్రపోతున్నారు. ముగ్గురూ పడవ దగ్గరకి వెళ్లారు. ఆ వెళ్లటంలో మామూలుగా వెడతారా? అడుగులో అడుగు వేసుకుంటూ "ష్ ష్" అనుకుంటూ, నడుము బెల్టులో కత్తులు వున్నట్టు అక్కడ చేతులు "రెడీ"గా పెట్టుకుని వెళ్లారు. అక్కడ ఎవరూ వుండరని వాళ్ళకి తెలుసు. అయినా జాగ్రత్తగా వుండాలిగా దొంగలు.

పడవ నెక్కారు ముగురూ. హాక్, జో తెడ్లు వేస్తున్నారు. టామ్ నాయకుడుమల్లే పడవమధ్యగా చేతులు ముడిచి నుంచున్నాడు. తతిమ్మా ఇద్దరికీ ఆజ్ఞలిస్తున్నాడు.

"ఏ న్, ఆవేపు వెయ్ తెడ్డు."

"వేస్తున్నామండి, సార్."

"అటు గాలివేపు తిప్పు. ఆ, అల్లా."

"తిప్పామండి, సార్."

"గట్టిగా అహా. నెమ్మదిగా, ముందుకి ఆ, ఎత్తు, వెయ్." ఈవిధంగా టామ్ ఆజ్ఞలిస్తున్నాడు. ఈ ఆజ్ఞలు వూరికే తమాషాగా యిచ్చినవే. వాటికి అర్థంపర్థం

లేదు. తరవాత ఎవ్వరూ మాట్లాడలేదు. తెడ్లు వేసేవాళ్లు తమ పని తాము చేసుకుపోతున్నారు. టామ్ నుంచుని ఏదో ఆలోచిస్తున్నాడు. పడవ నది సగానికి వచ్చింది. టామ్ ఆఖరిసారి తన ఊరికేసి చూశాడు. ఆ వూరితో తనకి ఋణం తీరిపోయింది. మహాపదలతో నిండివున్న జీవితాన్ని అనుభవించటానికి వెళ్లిపోతున్నాడు. మిగతా ఇద్దరూకూడా తమ గ్రామాన్ని ఆఖరిసారి చూసి నిట్టూర్పు విడిచారు.

రాత్రి 2 గంట లయ్యేటప్పటికి పడవ జాక్సన్ ద్వీపాన్ని చేరుకుంది. సామానులన్నీ ఒడ్డుకు చారేశారు. పడవలోవున్న తెరచాపను తీసి రెండు మూడు పొదలమీదుగా పరిచి గుడారంలాగా తయారుచేశారు. దాంట్లో తమ సామాను భద్రంచేశారు. తాము మాత్రం ఆరుబయటనే పడుకుందామనుకున్నారు.

తరవాత ఎండిన చితుకులూ అవ్వీ పోగుచేసి చెట్ల గుబురులమధ్య మంటచేశారు. అందులో పెనం వేసి తమతో తెచ్చుకున్న మాంసంముక్కలని కాల్చారు. రొట్టెతో నంచుకుంటూ రాత్రి భోజనం కానిచ్చారు. కాకులు దూరని కారడవిలో, చీమలు దూరని చిట్టడవిలో ఏమనిషీ కాలుపెట్టలేని ఆ మహా ద్వీపంలో, అంత రాత్రివేళ, చలిమంటదగ్గిర కూర్చుని భోజనం చేస్తుంటే వాళ్లకి తమకంటే అదృష్ట వంతులు ప్రపంచంలో వున్నారా అనిపించింది. ఇక ఎప్పటికీ ఇళ్లకి పోగూడదని నిశ్చయించుకున్నారు.

తరవాత మంటపక్కనే పచ్చికమీద హాయిగా నడుం వాల్చారు.

"క్చ్. ఎంత బావుంది యిక్కడ," అన్నాడు జో.

"హాయ్, హాయ్. మనస్కూల్లో స్నేహితులకి మన మిక్కడ వున్నట్టు తెలిస్తేనా--" అన్నాడు టామ్.

"ఏడవరూ మన అదృష్టం చూసి? ఏమంటావు హాక్?"

"ఏమో, నా కిక్కడ బలే జోరుగా వుంది. ఇంత కంటే నాకేమీ అక్కర్లేదు. ఇక్కడ నన్ను కొట్టేవాళ్లు తిట్టేవాళ్లూ ఎవరూ ఉండరు," అన్నాడు హాక్.

"నాకీ జీవితం బాగా సరిపోయింది. పొద్దున్నే లేవాలన్న బాధ లేదు. నా యిష్టం వచ్చినప్పుడు లేవచ్చు. నీళ్లు పోసుకోనక్కర్లేదు, బళ్లో కెళ్లక్కర్లేదు. చూశావా జో. సముద్రపు దొంగలు నేలమీద వున్నప్పుడు ఏం పనీ చేయ్యక్కర్లేదు. నువ్వు మునీశ్వరుడి వౌతానన్నావు. మునీశ్వరుడంటే ఎంత కష్టపడాలో తెలుసా?" అన్నాడు టామ్.

"అవున్రా. మొదట్లో నే నిదంతా ఆలోచించ లేదు. నువ్వు చెప్పావు గాబట్టిగాని, లేకపోతే నిష్కారణంగా కష్టపడుదును." అన్నాడు జో.

"పైగా ఈరోజుల్లో మునీశ్వరులంటే ఎవ్వరికీ భక్తీ, గౌరవం లేవు. సముద్రపుదొంగ అంటే చాలు జనం గజగజ వణికిపోతారు. మునులైతే చలికాలంలో మంచులోను, వేసవికాలంలో నిప్పుల్లోను, వానా

కాలంలో నదుల మధ్య ఒంటికాలి బొటనవేలిమీద నిలబడి తపస్సు చెయ్యాలి."

"అమ్మ బాబో. నా కిదంతా తెలియదుగా" అని ఆశ్చర్య పోయాడు జో.

ఈ లోగా హాక్ చుట్ట వెలిగించి హాయిగా దమ్ములు లాగుతున్నాడు. వాడి హాయిని, ఆనందాన్ని చూసి మిత్రులిద్దరూ ఈర్ష్యపడ్డారు. వాళ్లకి పొగాకు అలవాటు లేదు. త్వరలో పొగతాగటం నేర్చుకోవాలనుకున్నారు.

"సముద్రపు దొంగలు ఏమేమి చెయ్యాల్సి వుంటుంది?" అని మత్తుగా అడిగాడు హాక్.

"ఓ. వాళ్ళపని బలేగా వుంటుంది. సరుకులు మోసుకుపోయే ఓడలుంటాయే వాటిని అడ్డగించాలి. తగలబెట్టెయ్యాలి. డబ్బు, సరుకులు దోచుకుని ఎవ్వడికీ తెలియని గుహల్లో పాతిపెట్టాలి. వాటికి దెయ్యాల్ని కాపలా పెట్టాలి. ఓడల్లోని మనుషులందర్నీ చంపెయ్యాలి." అని మహా వుషారుగా వర్ణించాడు టామ్.

"సముద్రపు దొంగలు ఆడవాళ్లని చంపరు. వాళ్లని ద్వీపంమీదకు లాక్కుపోతారు" అన్నాడు జో.

"అవునవును. ఆడవాళ్లని చంపకూడదు. వాళ్లు అందంగా వుంటారు. మంచివాళ్లు కూడాను."

"మరి సముద్రపు దొంగలు మంచి రాజా

దుస్తులు ధరిస్తారు. రత్నాల హారాలు, ఉంగరాలు పెట్టుకుంటారు." అన్నాడు జో.

హాక్ విచారంతో అన్నాడు. "కాని మరి నా బట్టలు మాసి, చిరిగిపోయాయి. నేను పనికొస్తానా?"

మిగతా యిద్దరూ వాణ్ణి ఓదార్చారు. ఒకసారి దోచుకుంటే కావలసినన్ని మంచి బట్టలు వస్తాయనీ, ఇప్పటికీ దుస్తులు పరవాలేదనీ చెప్పారు.

నెమ్మదిగా వాళ్లకి నిద్రపట్టింది. హాక్ మాట్లాడుతూ మాట్లాడుతూనే నిద్రపోయాడు. చేతులోని చుట్ట జారి పక్కన పడింది. టామ్, జో కొంచెంసేపు నిద్ర రాక బాధపడ్డారు. తాము చేసిన పని తప్పేమో నని ఒక భావం బాధ కలిగించింది. చివరి కెప్పుడో తెలియకుండానే నిద్రలో మునిగిపోయారు.

తెల్లవారింది. టామ్ కళ్లు నులుముకుంటూ లేచాడు. మంచంమీద ఉన్నాననుకుని దిగబోయాడు. కాని తీరా చూస్తే కిందే పడుకున్నాడు. వెంటనే రాత్రి జరిగినదంతా జ్ఞాపకం వచ్చింది. ఇంకా సూర్యోదయం కాలేదు. పచ్చికమీద, ఆకులమీదా మంచు బొట్లు నిలిచాయి. రాత్రి వేసిన మంట చల్లారిపోయి తెల్లటి బూడిద మిగిలింది.

దూరంనించి ఒక కోకిల 'కూ' అని కూసింది. ఇంకోటి 'కూ' అని మళ్లీ జవాబిచ్చింది. క్రమంగా వెల్తురు వస్తోంది. పక్షులన్నీ మేలుకుని, రొద చేస్తూ, చల్లటి గాలిలో షికార్లు చేయటం మొదలెట్టాయి. ఒక పచ్చటి

పురుగు టామ్ పక్కనున్న ఒక చిన్న మొక్క మీదికి పాకుతోంది. చివరి ఆకుమీదవరకూ పాకి అక్కడినించి టామ్ కాలిమీదకి వచ్చింది. టామ్ దాన్ని విదల్చలేదు. అది నెమ్మదిగా మోకాలువరకూ పాకి పడిపోయింది. టామ్ సంతోషంపట్టలేక పోయాడు. పురుగు పాకిందంటే టామ్‌కి కొత్త బూట్లు, మేజోళ్లు బట్టలు వస్తాయని అర్థం.

ఒక తూనీగ మొక్కమీద వాలింది. టామ్ వంగి, "తూనీగా, తూనీగా, నీయిల్లు కాలిపోతోంది. నీ పిల్ల లేడుస్తున్నాయి, త్వరగా పో" అన్నాడు. వెంటనే తూనీగ ఆ మాటలు గ్రహించి ఎగిరిపోయింది యింటికి.

ఒక పాలపిట్ట టామ్‌దగ్గరగా ఒక చెట్టుమీద వాలి ఈ కొత్తవాళ్లెవరా, అని అనుమానంగా చూస్తోంది. ఒక ఉడత పరుగెత్తుతూ వచ్చి వీళ్లని చూసి టక్కున ఆగిపోయి "వీళ్ళెవరు?" అని అనుకుంటూ పక్కకి వెళ్లిపోయింది.

టామ్ తన స్నేహితుల్ని లేపాడు. ఇంకో రెండు నిమిషాల్లో ముగ్గురూ ఒకళ్ల నొకళ్లు తరుము కుంటూ అడవిలో గెంతుతున్నారు. నీటి ఒడ్డుకి వచ్చి చూశారు. వాళ్ళపడవ కెరటాలకి ఎక్కడికో కొట్టుకుపోయింది. అదీ మంచిదే ఒకందుకు. ఆ పడవయజమానులు దాన్ని వెదుక్కుంటూ యిక్కడకు వస్తారేమో నన్న భయంకూడా పోయింది.

తరువాత జో వంట చేశాడు. మిగతా ఇద్దరూ గాలాలు పట్టుకు వెళ్ళి, బోలెడు చేపల్ని బట్టి తెసుకొచ్చారు. ఆ చేపల్ని వేయించారు. అవి ఎంత మధురంగా వున్నాయో? అలాంటి మంచి చేపల్ని, ఇదివరకెప్పుడూ ఎవ్వరూ తినివుండరని ఖచ్చితంగా చెప్పవచ్చు.

భోజనమయిం తరవాత ముగ్గురూ ద్వీపమంతా చూడటానికి బయల్దేరారు. అన్నీ పెద్దపెద్ద చెట్లు, ఒత్తయిన పచ్చిక - అందంగా విచ్చుకున్న పువ్వులు. రకరకాల పాటలుపాడే పక్షులు.

ఆ ద్వీపం మూడుమైళ్ళ పొడుగు, పావుమైలు వెడల్పు ఉంది. ద్వీపానికి రెండో వైపున నది 200 గజాల కంటే ఎక్కువ వెడల్పు లేదు. ఆ తరువాత ఒడ్డునంతా దట్టమైన అరణ్యమే.

చాలాసేపు ముగ్గురూ నదిలో ఈదులాడారు. మధ్యాహ్నానికి మళ్లీ గుడారానికి వచ్చారు. చేపలు మళ్లీ పట్టేవరకూ ఆకలి ఆగేట్టు లేదు. అందుకని రాత్రి తెచ్చిన మాంసంలో ఇంకా మిగిలినదాన్ని వండుకుని తిన్నారు. నిశ్శబ్దంగా వున్న అడవి, ఒంటరితనం ముగ్గురినీ కలతపరిచింది. మౌనంగా కూర్చుని ఆలోచిస్తున్నారు. ఏదో తెలియరాని దిగులు పట్టుకుంది. చోరాగ్రేసరచక్రవర్తి అయిన హాక్ కూడా తన యిల్లు, అరుగులు, మెట్లు వాటినిగూర్చి తలుచుకుని బెంగపడ్డాడు. టామ్, జో కూడా ఇంటిమీద

బెంగపెట్టుకున్నారు. కాని బెంగవున్నట్టు బైటికి చెప్ప టానికి సిగ్గుపడ్డారు. మళ్ళీ గుండె రాయిచేసుకున్నారు.

దూరంగా ఎక్కడినించో ఏదో 'గుంయ్' మన్నట్టు శబ్దం వినవచ్చింది. మొదట్లో వాళ్లు దాన్ని వినికూడా పాటించలేదు. క్రమంగా ఆ శబ్దం ఎక్కువౌ తోంది.

జోకి గుండెలు కొట్టుకున్నాయి. "ఏమిటా టా చప్పుడు?" అన్నాడు.

"గమ్మత్తుగా వుందే?" అన్నాడు టామ్.

హాక్ అందుకుని "అది ఉరుము కాదు. ఎందు కంటే ఉరుము......" అంటుండంగా మిగతా యిద్దరూ "ష్ ష్. మాట్లాడొద్దు." అన్నారు. చాలాసేపు ఆ ధ్వని విన్నారు.

"ఒడ్డుకి వెళ్లి చూద్దాం, పదండి" ముగ్గురూ లేచి గబగబ తమ గ్రామంవేపు ఒడ్డుకి వెళ్లారు.

# 8

నదిఒడ్డున వున్న పొదలచాటున దాక్కుని మన ముగ్గురు వీరులూ చూశారు. సెంట్ పీటర్సుబర్గ గ్రామా నికి ఒక మైలుదిగువగా పెద్ద స్టీములాంచిమీద ఎక్కి చాలా మంది జనం ఏమిటో హడావిడి చేస్తున్నారు. ఆ లాంచిచుట్టూ చిన్నచిన్న తెప్పలు చాలా తేలు తున్నాయి. ఆ తెప్పల్లోకూడా మనుషులున్నారు. అంతా ఏదో వెతుకుతున్నట్టుగా వున్నారు. ఇంతలో లాంచికి

ఒకపక్కనుంచి పెద్ద పొగ బయల్దేరింది. ఇంకొంచెం సేటికి ఇందాక వినిపించిన 'గుంయ్' మన్న శబ్దం వినిపించింది.

"ఆ తెలిసింది. నదిలో ఎవరో మునిగిపోయారు." అన్నాడు టామ్.

"ఆ, అంతే. కిందటి వేసాకాలం బిల్ టర్నర్ మునిగిపోయినప్పుడు ఇల్లాగే వెతికారు. నీళ్ల మీద ఫిరంగి పేలుస్తారు. అప్పుడు శవం అడుగు నెక్కడన్నా వుంటే నీటిపైకి వచ్చి తేల్తుంది. లేకపోతే ఏం చేస్తారంటే రొట్టెముక్కల్లో పాదరసం పోసి నీళ్ల మీద వదిలిపెడతారు. ఆ రొట్టెముక్కల్లో ఒకటి పోయిపోయి శవం మునిగినచోట టక్కుమని ఆగిపోతుంది. అప్పుడు అక్కడికి వెళ్లి వెతుకుతారు." అని వర్ణించాడు హక్.

"అవును. ఇదంతా నా కిదివరకే తెలుసు. కాని ఆ రొట్టెముక్క ఎందు కల్లా చేస్తుందో ఆశ్చర్యం!" అన్నాడు జో.

"ఆ, అది రొట్టెముక్క మహిమేమీ కాదనుకుంటా. దాన్ని వదిలిపెట్టేటప్పుడు ఏవో మంత్రాలు చదువుతారు. అంచేత వాటి కా మహిమ వస్తుంది." అన్నాడు టామ్.

కాని హక్ దీనికి ఒప్పుకోలేదు. మంత్రాలు చదవటం తనెప్పుడూ చూడలేదన్నాడు.

"బలేవాడివి, చదవకపోవట మేమిటి? ఎవర్నాడి

గినా చెబుతాను నీకు అసంగతి. అయితే లోపల చదు
వుతా రనుకుంటా." అని టామ్ సర్ది చెప్పాడు.

టామ్ చెప్పినదానిలో నిజం వుందని మిగతా యిద్దరూ ఒప్పుకున్నారు. లేకపోతే ప్రాణం లేని రొట్టె ముక్క మంత్రాల సహాయం లేకుండా శవం వున్న చోటు ఎల్లా కనుక్కోగలుగుతుంది?

"అరెరే, ఇప్పు డక్కడ వుంటే ఎంత బావుం టుంది? అని చిటికె వేశాడు జో.

"అవును. నాకూ అల్లాగే వుంది. ఆ మునిగి పోయిం దెవరో చెప్పినవాడికి ఏమడిగినా ఇచ్చేస్తాను." అన్నాడు హక్.

ముగ్గురూ నిశ్శబ్దంగా ఆ దృశ్యాన్ని చూస్తూ వింటున్నారు. ఇంతలో టామ్‌కి ఒక ఆలోచన మెరుపులా మెరిసింది.

"అరేయ్. ఆ మునిగిపోయిం దెవరో నాకు తెలిసింది-మనమే."

ఒక్క క్షణంలో యీ ముగ్గురుపిల్లలూ గొప్ప వాళ్ళయిపోయారు. వీళ్లు గ్రామంలో కనిపించలేదు. మునిగిపోయివుంటారని నదిలో వెతుకుతున్నారు. గ్రామంలో వాళ్ల కోసం ఎంద రేడుస్తున్నారో? ఎందరి హృదయాలు బద్దలవుతున్నాయో? అన్నిటికంటే ముఖ్యమైన విషయ మేమిటంటే ఇంతవరకూ టామ్, జో, హక్ అనే ముగ్గురు కుర్రాళ్లు ఉన్నారనే విషయం తెలియనట్టే నటించిన గ్రామస్థులు యావన్మందీ

వీళ్ళనిగురించే మాట్లాడుకుంటున్నారు. వాళ్లు ఇదివరలో చేసిన పనులనే ముచ్చటించుకుంటున్నారు. అంచేత మిగతా పిల్లలంతా వీళ్లంటే ఈర్ష్యపడుతూవుండి వుండాలి. ఒలేగా వుంది. లేకపోతే సముద్రపు దొంగలు కావటమంటే మామూలు విషయమా? ఎంత కీర్తి? ఎంత ప్రతిష్ట?

సాయంత్రం కావచ్చింది. లాంచి, మిగతా తెప్పలు గ్రామంవేపుకి వెళ్లిపోయాయి. సముద్రపు దొంగలు తమ డేరాకి చేరుకున్నారు. వాళ్ళకి హఠాత్తుగా వచ్చిన కీర్తితో పూర్తిగా ఉబ్బిపోయారు. మళ్ళీ చేపలు పట్టారు; వండుకుని తిన్నారు.

హాయిగా పచ్చికలో కాళ్లుసాచి పడుకుని కొంత సేపు తమ కీర్తినిగురించి, ఇంటిదగ్గిర తమకోసం తమ వాళ్లు ఎంత ఏడుస్తూవుండేది మాట్లాడుకున్నారు. క్రమంగా మాటలు తగ్గిపోయాయి. టామ్‌కి, జోకీ మనస్సులో మళ్లీ ఒక దిగులు బయలుదేరింది. ఇంటిదగ్గర వాళ్లు నిజంగా దుఃఖిస్తూవుంటారు. తమకి వున్న సంతోషం వాళ్ల కుండదు.

చివరికి జో సందేహిస్తూ ఒకమాట అన్నాడు.

"మళ్ళీ ఊళ్లోకి వెడదామా? ఇప్పుడు కాదు... చాలారోజులైన తర్వాత"...

వెంటనే టామ్ "ఛా! మళ్ళీ వెళ్ళట మేమిటి? ఇహ ఎప్పటికీ పోకూడదనుకోలా? పసిపాపాయిలాగా బెంగపడతావేమిటి?" అని కోప్పడ్డాడు. ఈ విధంగా

సముద్రపు దొంగల్లో బయల్దేరిన మొదటి తిరుగుబాటు అణిచివేయబడింది.

రాత్రి చాలా పొద్దుపోయింది. కునికిపాట్లలో నుంచి హాక్ ఎప్పుడో తెలియకుండానే నిద్రలోకి జారాడు. వాడివెంట జో జారాడు. కాని టామ్‌కి నిద్ర రాలేదు. స్నేహితులకేసి దీక్షగా చూస్తూ ఆలోచిస్తున్నాడు. చివరికి నిశ్శబ్దంగా లేచాడు. రెండు తాటి మట్టల ముక్కలు సంపాదించాడు. రెండిటిమీదా బొగ్గుతో ఏదో రాశాడు. ఒకటి జేబులో పెట్టుకున్నాడు. రెండోదాన్ని జో టోపీలో పెట్టి, దాంట్లో కొన్ని సీమసున్నం ముక్కలు, రబ్బరు బంతి, కొన్ని గోలీలు, ఇంకా ఏవేవో ఉంచాడు. తరవాత నెమ్మదిగా పాకుతూ చెట్లగుంపునుంచి బయటపడ్డాడు. అక్కడినుంచి నదిఒడ్డుకి పరిగెత్తాడు.

అయిదారు నిమిషాలకల్లా టామ్ ద్వీపం రెండో వేపుకి వచ్చాడు. అక్కడ నది రెండువందల గజాల వెడల్పుమాత్రమే వుంది. ఆట్టే లోతులేనందున టామ్ వందగజాలదాకా నీటిలో నడిచిపోయాడు. తరవాత లోతెక్కువైంది. అడ్డంపడి మిగతా వందగజాలని ఈదడం ప్రారంభించాడు.

ఎల్లాగైతేనేం టామ్ శ్రమపడి అవతలిఒడ్డు చేరుకున్నాడు. అక్కడినించే ఇల్లినాయిస్ రాష్ట్రం ప్రారంభమౌతుంది. టామ్ కొంతదూరం ఒడ్డునే నడిచాడు. రాత్రి పదిగంటలయ్యేటప్పటికి రాధాఊిలాంచీలు నిలిచే

రేవును చేరుకున్నాడు. అందులో ఒకటి అప్పుడే బయ లేరటానికి సిద్ధంగావుంది. సెంట్ పీటర్సుబర్గుకు వెళ్లే పడ వల్లో అదే ఆఖరిది.

పిల్లిలాగా అడుగుల్లో అడుగు లేసుకుంటూ టామ్ చెట్లనీడల్లోంచి నెమ్మదిగా పడవ నెక్కాడు. ఎవ్వరికీ కనిపించని చీకట్లో ఒక మూల ముడుచుకు కూర్చున్నాడు.

10 నిముషాలయిందో లేదో పడవ అవతలి ఒడ్డున చేరుకుంది. టామ్ జాగ్రత్తగా పడవ దిగి తన యింటికేసి పరిగెత్తాడు.

సందుల గొందులబడి ఇంటి వెనక్కి చేరుకు న్నాడు. హాల్లో దీపాలు వెలుగుతున్నాయి. కిటికీ గుండా తొంగిచూశాడు. పోలీపెద్దమ్మ, సిడ్, మేరీ, జోవాళ్లమ్మ, అక్కడ కూర్చుని మాట్లాడుకుంటు న్నారు. వాళ్లు మంచం ఒకపక్కన కూర్చున్నారు. మంచాని కవతల దూరంగా తలుపున్నది.

టామ్ నెమ్మదిగా బయటినించి తలుపు గడియని మరమేకు తిప్పి తీశాడు. తలుపు కొంచెం తోశాడు. కిర్రుమంది. కాస్సేపాగి ఇంకొంచెం తోసి పిల్లిలా లోప లికి దూరాడు. పాకుకుంటూ మంచంకిందికి దూరి కూర్చున్నాడు. అత న్నెవరూ చూడలేదు. కాని పెద్దమ్మ తలెత్తి చూసి,

"అదేమిటి ఆ తలుపు తీసివుంది? ఏమిటమ్మా, ఈ వింతలకి అంతంలేకుండావుంది. ఇప్పుడేగదా ఆ

తలుపు వేసింది. ఇంతలో ఎల్లా తెరుచుకుంది? సిడ్! దాన్ని వేసిరా." అన్నది.

తరవాత పెద్దమ్మ అన్నది.

"కాని, వాడు చెడ్డవాడు కానేకాదమ్మా. కొంచెం తుంటరిపనులు చేసేవాడంతే." అని ఏడవటం మొదలెట్టింది.

"మా జోకూడా అంతేనమ్మా. ఎప్పుడూ ఏదో ఆకతాయిపని చేసేవాడు. చెడ్డపిల్లడు కానేకాదు. అయ్యో నా చేతులు పడా. నే నెల్లా కొట్టానమ్మా, నా ముద్దుల జోని. మీగడ తింటే తిన్నాడని ఊరుకో కుండా ఈ పాడు చేతుల్తో ఎల్లా కొట్టానో. అయ్యో నేను చచ్చిపోనూ!" అంటూ జో తల్లికూడా ఏడుపు లంకించుకుంది.

"టామ్ ఎక్కడున్నాడోగాని సుఖంగానే వుండి వుంటాడు. ఆ అల్లరిచేయకుండావుంటే వాడంతటి మంచివాడు లేడు." అన్నాడు సిడ్.

"సిడ్. నోరు ముయ్యి. నా టామ్‌నిగురించి పల్లెత్తుమాట అన్నావంటే చూడు. వాణ్ణి దేవుడే కాపాడతాడు. అయ్యో, వాణ్ణి ఎల్లా మర్చిపోయే దమ్మా. వాణ్ణి చూసుకునేగదా నేను బతుకుతున్నది?" అని యేడ్చింది పెద్దమ్మ.

ఈవిధంగా ఇద్దరు ఆడవాళ్లూ తమ పిల్లలు చేసిన చేష్టల్ని తలుచుకుంటూ చాలాసేపు ఏడ్చారు. మేరీ కూడా టామ్‌ని పొగడింది. ఇదంతా వింటుంటే మంచ

కింద దాక్కున్న టామ్‌కి కూడా ఏడుపు వచ్చింది. చప్పుడు చెయ్యకుండా చీమిడి తుడుచుకున్నాడు. తను నిజంగా మంచివాణ్ణనే అభిప్రాయం కలిగింది అతనికి. పెద్దమ్మమీద జాలివేసింది. ఎదటపడి వాళ్ళ దుఃఖం పోగొట్టా లనిపించింది. కాని కదల్లేకపోయాడు.

వాళ్లు మాట్లాడుకోవటంలో టామ్‌కి కొన్ని విషయాలు తెలిశాయి. నదిలో ఈతలు కొడుతూ పిల్లలు మునిగిపోయివుంటారని ముందు అంతా అనుకున్నారు. తరవాత ఊరి కెగువన పడవరేవులో పడవ ఒకటి కని పించలేదు. తరవాత కొందరు పిల్లలు "త్వరలో ఒక విషయం జరగబోతోం"దని తమతో టామ్ వాళ్లు చెప్పారని బయటపెట్టారు. అంచేత పిల్లలు పడవలో ఎక్కడికో పోయివుంటారని అనుకున్నారు. కాని మధ్యాహ్నానికల్లా ఆ పడవ ఊరికి అయిదుమైళ్లు దిగువగా మిస్సోరీ నదిఒడ్డున కనిపించింది. అప్పుడు పిల్లలు మునిగిపోయివుండాలనుకున్నారు. పైగా శవాలకోసం ఎక్కువ వెదకటంకూడా అనవసరమనుకున్నారు. ఎందుకంటే పిల్లలు బాగా ఈతవచ్చినవాళ్లు. ఒడ్డుకి దగ్గర్లో అయితే ఈదుకుని వచ్చేవాళ్లే. నదిమధ్యలో మునిగిపోయి ఒడ్డుకు రాలేకపోయివుంటారు. ఆ శవాలు సముద్రంకేసి కొట్టుకుపోయివుంటాయి. ఇదంతా బుధవారంరాత్రి జరిగింది. ఆదివారంనాటికికూడా శవాలు దొరక్కపోతే ఆశలు పూర్తిగా వదులుకోవచ్చు. ఆది

వారంనాడే చచ్చిపోయిన పిల్లలకి జరగవలసిన కర్మ కాండలు చేస్తారు.

తరవాత జోతల్లి సెలవుతీసుకుని వెళ్ళిపోయింది. సిడ్ వచ్చే ఏడుపు నాపుకుని పడుకోటానికి వెళ్లాడు. మేరీకూడా ఏడుస్తూ వెళ్ళింది.

పెద్దమ్మ నేలమీద మోకరించి టామ్ ఆత్మ శాంతికి భగవంతుణ్ణి ప్రార్థించింది. ఆ ప్రార్థనలో తనకి టామ్‌మీద వున్న ప్రేమఅంతా గుమ్మరించింది. టామ్ కళ్లు నీళ్ళతో నిండిపోయాయి.

పెద్దమ్మ మంచంమీద మేను వాల్చింది. చాలా సేపటిదాకా అటూయిటూ దొర్లుతూ టామ్‌ని తలంచు కుంటూ ఏవో మాటలంటూనే వుంది. చివరికి గుర్రు తీస్తూ నిద్రపోయింది. టామ్ మెల్లిగా ఇవతలికి వచ్చాడు. ఆమెముఖంకేసి చాలాసేపు చూశాడు. చాలా జాలి కలిగింది. జేబులో వున్న తాటిపట్టని తీసి దీపంపక్కన పెట్టాడు. కాని మళ్ళీ ఎందుకనో తీసి జేబు లోనే పెట్టాడు. తరవాత వంగి పెద్దమ్మ నుదుటిమీద ముద్దు పెట్టుకున్నాడు. తలుపు గడె తీసి బయట నుంచుని మళ్లీ మరమేకు తిప్పి గడియవేశాడు.

టామ్ ఊరుదాటి పడవల రేవుకి వెళ్లాడు. అక్కడెవ్వరూ లేరు. కాపలా వాడొక డున్నా వాడు నిద్రలో వున్నాడు. ఒక చిన్న పడవను లంగరెత్తి నీళ్ల లోకి తోసి ఎక్కాడు. ఒక్కడే తెడ్డు వేసుకుంటూ జాక్సన్‌ద్వీపాన్ని చేరుకున్నాడు. పడవని తమకోసం

అట్టే పెట్టుకుందామనుకున్నాడు. సముద్రపు దొంగలు ఇకముందు పెద్ద ఓడల్నే పట్టుకోవాలిగా. కాని పడవ పోయిందంటే దాని యజమానులు దానికోసం నది అంతా గాలిస్తారు. అప్పుడు తమని పట్టుకొంటారు. అంచేత ఆ పడనివ మళ్ళీ నీళ్ళలోకి తోసి వదిలేశాడు. అది ప్రవాహంలో ఎటో కొట్టుకుపోయింది.

ఒడ్డున పడుకుని టామ్ చాలసేపు విశ్రాంతి తీసుకున్నాడు. తెల్లవారవస్తోంది. నిద్ర ఆపుకోలేక నిద్రలోపడ్డాడు. లేచేటప్పటికి బాగా తెల్లవారి సూర్యుడు పైకొచ్చాడు. తరవాత టామ్ తమ డేరాకి బయల్దేరాడు.

అప్పటికి జో, హక్ లునిద్ర లేచి ఏదో మాట్లాడుకుంటున్నారు. డేరావెనక కూర్చుని టామ్ వారి మాటలు విన్నాడు.

"టామ్ అల్లాంటి పని చెయ్యడు. తప్పకుండా తిరిగొస్తాడు. సముద్రపు దొంగలు తమ స్నేహితుల్ని విడిచిపెట్టిపోవడం మర్యాదకాదని టామ్ కు తెలుసు. ఏదో గొప్ప పనికోసం వెళ్లి వుంటాడు." అంటున్నాడు జో.

"టామ్ రాకపోతే అతని వస్తువు లన్నీ మనవే కదూ?"

"మనవే అని రాసి వెళ్లాడు. కాని పొద్దుటి భోజనంవేళకి రాకపోతేనే వాటిని తీసుకోమన్నాడు." అన్నాడు జో.

"ఎందుకు రాదూ? మహాసముద్ర రాజ్యాధిపతి అయిన టామ్‌సాయర్ ఇదుగో." అంటూ టామ్ ఒక్క గంతువేసి వాళ్ళ ముందర పడ్డాడు.

చేపలు, మాంసం వండి భోజనం చేశారు. టామ్ తను ఎందుకు వెళ్ళిందీ, ఏమేమి సమాచారం తెలుసుకువచ్చిందీ చెప్పాడు. కథలాగా ఉన్నవీ లేనివీ బోలెడు చెప్పాడు. దీంతో ముగ్గురూ తమకంటే మహానాయకులు ఈ దేశంలో లేరనే అభిప్రాయానికి వచ్చారు.

భోజనమైన తర్వాత కాస్సేపాగి నదిలో దిగి యీతలుకొట్టారు. నదిలో ఒకళ్ల నొకళ్లు తరుము కున్నారు. ఒకళ్ళ మొహాలపై ఒకళ్లు నీళ్లు చల్లుకు న్నారు. పోట్లాడుకుని ఒకళ్ళనొకళ్లు నీళ్లలో ముంచు కున్నారు. ఈ జలక్రీడతో వాళ్ల ఉత్సాహం రెచ్చి పోయింది.

అలిసిపోయిం తరవాత ఒడ్డుకు వచ్చి వేడెక్కిన ఇసకలో పడి దొర్లారు. మళ్ళీ నదిలో దిగి ఈదారు. బయటికి వచ్చి యిసకలో 'సర్కస్' ఆట ఆడారు. కాసేపు గోలీలు, గూటీబిళ్ల ఆడారు.

చివరికి డేరాకి వచ్చి నడుం వాల్చారు. దూరాన తెల్లగా కనిపించే తమ గ్రామంకేసి దీనంగా చూస్తూ పడుకున్నారు. టామ్ తనకి తెలియకుండానే కాలి బొటనవేలితో యిసకలో "బెకీ" అని రాశాడు. దాని కేసి చూసి 'ఛ ఛ' అనుకుని చెరిపేశాడు. కాని లాభం

లేదు; మళ్ళీ రెండునిమిషాల్లో "బెకీ" అని రాశాడు. మళ్ళీ చెరిపాడు.

ఈపాటికి జోకి ఇంటిమీద బెంగ బాగా ఎక్కువైంది. కళ్లలో నీళ్లు తెగఊరుతున్నాయి. హక్ కూడా దిగులుగా వున్నాడు. టామ్‌కుకూడా అల్లాగే వుందిగాని లేనట్టు నటిస్తున్నాడు.

"ఈ లంకమీద ఇదివరకు కొందరు సముద్రపు దొంగలు నివసించిఉంటారని నా నమ్మకం. వాళ్లు దోచుకున్న డబ్బు ఎక్కడో పాతిపెట్టివుంటారు. ఇప్పుడు మనకి బోలెడు వెండి, బంగారం దొరికితే ఎల్లా వుంటుంది?" అన్నాడు టామ్ లేని వుషారు తెచ్చుకుని.

దీంతో మిగతా యిద్దరూ కొంత ఉత్సాహం వచ్చినట్టు కనిపించారుగాని మళ్ళీ అది తగ్గిపోయింది. టామ్ ఇంకా ఏవో రెండుమూడు ఇల్లాంటి ఉపాయాలే వేసి చూశాడు; కాని లాభం లేకపోయింది.

చివరికి జో ఉండభట్టలేక, "అరేయ్. ఇక పోదాంరా యింటికి. ఇక్కడ చాలా ఒంటరిగా వుంది." అన్నాడు.

"జో. నీకు తెలియదు. క్రమంగా అదే అలవాటవుతుంది. ఇక్కడ చేపలు ఎంత తేలిగ్గా దొరుకుతాయో చూడు." అన్నాడు టామ్.

"చేప లెవడికి కావాలి. నా కింటికి పోవాలనుంది.

"ఈతకొట్టడానికి ఇంతకంటే మంచి చోటు ఇంకెక్కడా లేదు." అన్నాడు టామ్.

"నాకు ఈదాలని లేదు. 'వద్దురా, నీళ్లలోకి వెళ్లద్దు' అని కోప్పడేవాళ్లు లేకపోయింతరవాత ఈత కొట్టడంలో ఏమందం వుంది.?"

"పాపం, పాలు తాగే పాపాయి, ఇంటికి పోయి అమ్మని చూడాలనుంది." అని వెక్కిరించాడు టామ్.

"అవును, నాకు మాఅమ్మని చూడాలనివుంది. నీకూ అమ్మ వుంటే అల్లాగేవుండేది." అని కళ్ళనీళ్లు తుడుచుకున్నాడు జో.

"సరే. పాలపాపని వాళ్లమ్మ దగ్గిరికి పంపించేద్దాం; ఏంరా హాక్! మన మిక్కడే వుంటాంకదూ!"

హాక్ సందేహిస్తూ "మ—రే— అవును." అన్నాడు.

"ఇక నేను బతికున్నంతకాలమూ నీతో మాట్లాడను." అని జో లేచి తనసామాను తీసుకున్నాడు.

"ఎవడికీ భయం! నువ్వు లేకపోతే మాకేం నష్టమా? ఇంటికి వెళ్లు. అందరూ నిన్ను చూసి నవ్వుతారు. బలే సముద్రపుదొంగ దొరికాడు. హాక్, నేను పాపాయిలం కాదు. మే మిక్కడే వుంటాం, కదూ హాక్."

హాక్ మాట్లాడకుండా తలవంచుకున్నాడు. జో నిజంగానే బయల్దేరాడు ఇల్లినాయిస్ఒడ్డువేపు. జో కేసే చూస్తున్నాడు హాక్.

"టామ్, నాకూ కూడా పోవాలనే వుందిరా. పద పోదాం."

"నేను రాను. మీరంతా వెళ్ళిపొండి. కావలిస్తే."

"అయితే నేను పోతున్నాను."

"వెళ్లు. నిన్నెవరన్నా పట్టుకుని ఆపుతున్నారా."

హక్ తన వస్తువులు తీసుకుని జోని వెంబడించాడు. టామ్ వాళ్ళిద్దరికేసీ చూస్తున్నాడు. తన గర్వం దిగమింగి వాళ్ళతో కలిసిపోవాలనిపించింది. వాళ్లాగుతారనుకున్నాడు. కాని ఆగలేదు.

చుట్టూ చూశాడు. చాలా గుబులుగా, ఒంటరిగా వుంది ఆ అడవి. గబుక్కున లేచి వాళ్ళకేసి పరిగెత్తుతూ,

"ఆగండిరా. మీతో వొక మాట చెప్పాలి." అన్నాడు.

వాళ్లాగి వెనక్కి తిరిగారు. టామ్ వాళ్ళని కలుసుకుని తన మనసులో పొద్దుటినుంచి దాచిన ఒక "రహస్యం" చెప్పాడు. వాళ్లు విని వినటంతోటే "బలే బలే" అని గంతులువెయ్యడం ప్రారంభించారు. ఈ రహస్యం ఇందాకనే చెబితే బయల్దేరేవాళ్ళమే కాదే, అన్నారు.

ముగ్గురుపిల్లలు సంతోషంతో తిరిగి తమడేరాకి వచ్చారు. టామ్ ఇంత గొప్ప 'ప్లాను' ఆలోచించగలిగినందుకు హక్, జో అతన్ని పొగడారు. మళ్ళీ మంట

చేసి చేపలు వండి భోజనం చేశారు. టామ్ తనకి చుట్ట కాల్చాలని వుందన్నాడు. జో తను కూడా కాలుస్తా నన్నాడు.

హాక్ చుట్టలు చుట్టి వాళ్ళకి రెండిచ్చి తనొకటి వెలిగించాడు. టామ్, జోలు కందిపుల్లలలాంటివి వెలిగించి ఇదివరకు తాగేవారుగాని 'నిజమైన చుట్టలు' ఎప్పుడూ తాగలేదు.

కొత్తవాళ్ళిద్దరూ చుట్టలు వెలిగించారు. వాళ్ళకి చేతులు వొణుకుతున్నాయి; పొగ చాలా ఘాటుగా వుంది; మొదటి గుక్కతో ఉక్కిరిబిక్కిరయ్యారు.

కాని టామ్ అన్నాడు. "ఓస్ని ఇంతేనా చుట్ట అంటే? చాలా తేలిగ్గా వుంది. ఇంత బావుంటుందని తెలిస్తే ఇదివరకే నేర్చుకునేవాణ్ణి"

"నేనూ అంతే. చుట్టలో ఘాటే లేదు." అన్నాడు జో.

"ఇదివరకు చుట్ట తాగలేనేమోనని భయం వేసేది."

"నాకూ అంతే. కావలిస్తే హాక్‌నడుగు. చుట్ట తాగాలని వున్నట్టు, కాని చాతవదేమో అనుకున్నట్టు వాడితో వందసార్లు చెప్పివుంటాను."

"అవును, చాలాసార్లు చెప్పావు." అన్నాడు హాక్.

"నేనూ చెప్పాను నాలుగువందలసార్లు. కదురా హాక్. జ్ఞాపకం వుందా? మాంసం మార్కెట్టుదగ్గర

చెప్పలా? అప్పుడు బాబ్ టానర్, జానీమిల్లర్, జెఫ్ థాచర్ కూడా వున్నారు." అన్నాడు టామ్.

"అవును చెప్పావు. నా తెల్లగోలీకాయ పోయిన మర్రోజున. అహా కాదు, ముందురోజున."

"చూశావా, నేను చెప్పలా." అన్నాడు టామ్.

"రోజంతా నేను చుట్టలు కాల్చగలను. నాకు తలతిరగటం లేదు." అన్నాడు జో.

"నేను రెండురోజులపాటు వరసగా కాల్చగలను కాని పందెం-జెఫ్ థాచర్ కాల్చలేడు." అన్నాడు టామ్.

"అబ్బే. అతను రెండుదమ్ములు లాగేటప్పటికి గిలగిల తన్నుకుంటాడు."

"జానీమిల్లర్ కూడా అంతే. ఒక్క గుక్కతో డోక్కుంటాడు" అన్నాడు టామ్.

"ఇప్పుడు వాళ్లు మన్ని చూస్తేనా, కుళ్లికుళ్లి ఏడుస్తారు." అన్నాడు జో.

"ఇదిగో, మనం చుట్టనేర్చుకున్నట్టు ముందుగా వాళ్లకి చెప్పద్దు. వాళ్లు మనపక్కన వున్నప్పుడు నేను నీదగ్గిరికి వొచ్చి 'జో! ఏమన్నా సరుకు వుందా? తాజాది.' అంటాను. నువ్వు "రెండు చుట్ట లున్నాయిగాని, తాజాచుట్టలు కావు" అంటావు. 'ఆ ఫరవాలేదు. ఘాటుగా వుంటే సరి.' అంటాను నేను. తరవాత యిద్దరం చుట్టలు వెలిగించి వెళ్ళిపోతాం. అప్పుడుంటాయి చూసుకో వాళ్ల మొహాలు."

"బతికే గా వుంటుంది రా టామ్. అది ఇప్పుడు జరిగితే—క్ఫ్—"

ఈవిధంగా గొప్పలు చెప్పుకున్నారు వాళ్లు. కాని ఇంతలో ఒక తమాషా జరిగింది. కొత్తవాళ్లిద్దరికీ ఉమ్ములు తెగ ఊరుతున్నాయి. నిమిష నిమిషానికీ బుగ్గలు నిండిపోతున్నాయి. ఇప్పుడు ఉమ్మేస్తే మళ్ళీ క్షణానికల్లా నోట్లో ఒకవరద తయారవుతోంది. ఎంత మింగినా ఆగటం లేదు. జో చేతిలోంచి చుట్ట జారిపడింది దాన్ని చూసి టామ్ చుట్టకూడా జారింది.

"నా చాకు ఎక్కడో పారేసుకున్నాను. వెతుక్కొస్తా నిప్పుడే." అని లేచి గబగబ బయల్దేరాడు జో.

"నువ్వు అటు వెళ్ళి వెదుకు. నే నిటు వెళ్ళి వెతుకుతాను. ఆ చాకు పోతే ఎల్లా?" అని టామ్ కూడా గబగబ లేచాడు.

# 9

చెరోవైపుకి వెళ్లిన టామ్, జోలు ఎంతసేపటికీ తిరిగిరాలేదు. హాక్ చాలసేపు ఎదురుచూసి వాళ్లని వెదుక్కురావటానికి బయల్దేరాడు. ఇద్దరూ గాఢంగా నిద్రపోతున్నారు. మొహాలు పాలిపోయి వున్నాయి.

ఆ రాత్రి భోజనాలు చేసే టప్పుడు మామూలుగా హుషారుగా ఉండే టామ్‌గాని, జోగాని కిక్కురు మన లేదు. నిశ్శబ్దంగా తిన్నారు. తరవాత హాక్ తనొక

చుట్ట చుట్టుకున్నాడు. వాళ్లకి కూడా చుట్టిపెడతా నన్నాడు; వాళ్లు వద్దంటే వద్దు పొమ్మన్నారు. వంట్లో బావుళ్లేదని, బహుశా మధ్యాహ్నం తిన్న తిండిలో ఏదో జబ్బు సరుకు కలిసి వుంటుందనీ అన్నారు.

అర్ధరాత్రప్పుడు జో లేచాడు. మిగతా వాళ్లని లేపాడు. చుట్టూ అడివంతా నిశ్శబ్దంగా, చీకటిగా వుంది. ఆకాశంలో ఒక్క నక్షత్రంకూడా కనిపించ కుండా మబ్బులు దట్టంగా కమ్ముకున్నాయి. ముగ్గురూ దగ్గిర దగ్గిరగా మంట పక్కన చేరి కూర్చున్నారు. ఏదో మహాపద రాబోతున్నట్టుగా అనిపించింది.

ఇంతలో ఒక మెరుపు మెరిసింది. అడివిలోని ప్రతిచెట్టూ, పొదా స్పష్టంగా కనిపించాయి. మళ్ళీ ఇంకొక పెద్దమెరుపు చెర్నాకోలు 'ఝుంయ్' మన్నట్టు మెరసింది. తరవాత వరసగా మూడు మెరుపులు గొప్ప తాచుపాముల్లాగా ఆకాశంమీద జరిగి పోయాయి. చలిగాలి సాగింది. 'ఢమ ఢమ' మని ఉరుములు వినిపించాయి. ఇంతలో ఢాం అని పెద్ద పిడుగు ఎక్కడో పడింది. పెద్ద పెద్ద వర్షం చుక్కలు కురవటం ప్రారంభించాయి.

"పదండి, డేరా దగ్గిరికి" అని అరిచాడు టామ్.

ముగ్గురూ ముందు కురికారు. పొదలు, కొయ్యదుంగలు దాటారు. చీకట్లో చెట్లకి ఢీ కొట్టారు. మెరుపులు, ఉరుములు గబగబ వస్తున్నాయి. పెద్ద వర్షం కురుస్తోంది. ఎలాగైతేనేం డేరాకి చేరుకుని, లోపల

దూరి ఒకళ్ల నొకళ్లు పట్టుకుని కూర్చున్నారు. ఇంతలో ఆగాలికి డేరాగా కట్టిన తెరచాప గుడ్డ కాస్తా ముడులు తెంపుకుని ఎగిరి పోయింది. క్షణంలో వాళ్లు తడిసి ముద్దయిపోయారు. వెంటనే లేచి చేతులు విడవకుండా నదిఒడ్డునవున్న పెద్ద మర్రిచెట్టు దగ్గిరికి పరుగెత్తారు. ఇంతలో ఇంకొక పిడుగు పడిం దెక్కడో. నది పొంగి పొర్లుతూ సముద్రంలా పెరిగి పోయింది.

ఈ విధంగా తుపానువాన చాలాసేపు రేగింది. మాటి మాటికీ ఎక్కడో పిడుగు పడటం, ఏ చెట్టో కూలిపోవటం వినిపించింది. జాక్సన్ ద్వీపానికీ, ఆకాశానికీ యుద్ధం జరుగుతోందా అనిపించింది. ద్వీపం ముక్కలైపోతుందా అనిపించింది.

చివరికి వాన వెలిసింది; గాలి తగ్గింది. ఉరుములు మెరుపులు కొంతసేపు తమ ప్రతాపం చూపించినా చివరికి అవీ వెళ్లి పోయాయి.

మళ్ళీ తమడేరా కట్టినచోటికి వెళ్లారు. అక్కడ తమ కిన్నాళ్లూ నీడనిచ్చిన చెట్టుకాస్తా వేళ్లతో సహా కూలిపోయింది. ఆ సమయంలో తా మక్కడ లేనందుకు ఎంతో సంతోషించారు.

ఆ రాత్రి ఇక వాళ్లు నిద్రపోలేదు. నిద్ర పోవటానికి స్థలమేది? నేలంతా తడిగానే వుంది. ఎల్లాగో తెల్లవారింది. అప్పుడు వెళ్ళి నదిఒడ్డున ఇసకమీద పడి నిద్రపోయారు. బాగా పొద్దెక్కేటప్పటికి వళ్లు చుర్రున కాలసాగింది. లేచి మళ్లీ వండుకున్నారు. రాత్రంతా

నీళ్లలో నానారేమో ఇప్పటికీ వళ్లు బిగ్రబిగిసి వుంది. ఏపనీ చెయ్యటానికి ఉత్సాహం లేదు. జో, హాక్‌లు మళ్ళీ ఇంటిమీద బెంగపడ్డారు. కాని టామ్ మళ్ళీ తన 'రహస్యం' జ్ఞాపకం చేసేటప్పటికి ఉషారు వచ్చింది.

అంతే కాదు; వాళ్లు భోజనం చేసింతరవాత చుట్టలుకాల్చారు. ఈనారి నిన్నటంత వికారంగా లేదు. నోట్లో ఉమ్మి కొద్దిగా ఊరింది కాని, డోకులుమాత్రం రాలేదు. దాంతో చుట్టలంటే మళ్ళీ ఉషారు పుట్టింది. నిన్నటిలాగే టామ్, జోలు డాబులు కొట్టడం మొదలు పెట్టారు. క్రమంగా వాళ్లకి చుట్టలమీద భయం తగ్గి భక్తి పెరిగి పోయింది.

* * *

కాని ఏ శనివారంనాడు టామ్, జో, హాక్‌లు ప్రపంచాన్నంతా మరిచి పోయేంత ఉషారులో వున్నారో, ఆ శనివారంనాడే సెంటు పీటర్సుబర్గు గ్రామంలో అందరూ అంత విచారంలో వున్నారు. ఆ మర్నాడే చచ్చిపోయిన ముగ్గురికీ చర్చిలో కర్మకాండ జరుగుతుంది. ముఖ్యంగా జో హార్పర్ ఇంట్లోనూ, టామ్ సాయర్ ఇంట్లోనూ ఇంటిల్లిపాదీ ఏడుస్తున్నారు. స్కూలుకి ఆరోజున సెలవైనా పిల్లలు చాలా మంది అక్కడ చేరారు. తమ స్నేహితులు చచ్చిపోయినందున ఎవల్లూ ఉత్సాహంగా లేరు.

బెకీథాచర్ ఒకమూల కూర్చుని ఏడుస్తోంది.

"అయ్యో, అతన్ని జ్ఞాపకం ఉంచుకొనడానికి

ఇప్పుడేమీ లేదు గదా! ఇక్కడే గదా! మేమిద్దరం కోపాలొచ్చి విడిపోయింది! అదంతా మళ్ళీ జరిగితే అతనికి ఈ సారి కోపం తెప్పిస్తానా! కాని ఏమనుకుంటే ఏం లాభం! పోయిన వాడు పోనే పోయాడు." అనుకుంది వెక్కి వెక్కి ఏడుస్తూ.

మిగతా పిల్లలుకూడా 'టామ్ ఇల్లా చేశాడల్లా చేశాడు. జో ఈమాటన్నాడు, ఆమాటన్నాడు.' అని స్నేహితుల్ని తలుచుకుంటున్నారు. ప్రతివాడూ తను ఆఖరిసారి వాళ్ళనెక్కడ చూశాడో వర్ణిస్తున్నాడు.

ఒకడన్నాడు. "సరిగ్గా నేనిప్పుడు నుంచున్నచోటే నుంచున్నాను. నా పక్కనే టామ్ నుంచున్నాడు. టామ్ ఎందుకో నవ్వాడు. నాకు వళ్లంతా జలదరించింది. ఎందుకు నవ్వాడో అప్పుడు తెలియలేదు. ఇప్పుడైతే తెలిసే దనుకో."

తరవాత వాళ్లలో వాళ్లకి పోటీలు వచ్చాయి. ఆఖరిసారి టామ్, జో లని ఎవరు చూశారని ప్రశ్న. 'నేను' ఆఖరిసారి చూశానంటే, నేను చూశానని పోటీలు పడ్డారు. ఆఖరిసారి వాళ్లని చూసిన గౌరవం సంపాదించటానికి చాలా మంది ప్రయత్నించారు. కాని చివరికి ఆ గౌరవం ఒకడికి దక్కింది. అందరికంటే ఆఖరిసారి అతనే చూశాడని తేలింది. అతను గర్వంగా నుంచున్నాడు. మిగతా వాళ్ళకి అతని గౌరవంమీద ఈర్ష్య పుట్టింది.

ఒకడుఅంతకంటే గొప్పగౌరవంసంపాదించాలని,

టామ్ సాయర్ నన్నొకసారి కొట్టాడుగా."
అన్నాడు.

కాని ఈ గౌరవం లాభంలేక పోయింది. ఎదురు కంటే అక్కడున్న వాళ్లలో చాలా మంది టామ్ చేతులో తన్నులు తిన్న గౌరవం పొందినవాళ్లే.

ఆ మరాండు ఆదివారం. ఊళ్లో జనమంతా చర్చిలో చేరారు చర్చి కిక్కిరిసి పోయింది. పోలీపెద్దమ్మ సిడ్‌ని, మేరీని వెంటపెట్టుకుని చర్చిలో ప్రవేశించింది. వాళ్ల వెనుక హార్పర్ కుటుంబం వాళ్లు వచ్చారు. వాళ్ళంతా విచారాన్ని సూచించే నల్లటి దుస్తుల్లో వున్నారు.

అందరూ నిశ్శబ్దంగా కూర్చున్న తరవాత ఫాదర్ లేచి నుంచుని చేతులుచాచి దేవుణ్ణి ప్రార్థించాడు. అందరూ నుంచుని ప్రార్థనపాట పాడారు. బైబిల్ పుస్తకాలు తెరిచి బిగ్గరగా కొంతభాగం చదివారు.

ఆ పిమ్మట ఫాదర్ చనిపోయిన ముగ్గురు పిల్లలనీ గురించి ఉపన్యాసం యిచ్చాడు. వాళ్లు ఎంతో మంచి వాళ్లు, వృద్ధిలోకి రావలసినవాళ్లు అని, భగవంతుడి మీద భక్తికలవాళ్లని వర్ణించాడు. అందరూ అలాగే అనుకోవటం ప్రారంభించారు. వాళ్లు బతికున్నప్పుడు చెడ్డపిల్లలని తిట్టినందుకు, వాళ్లలోని మంచిని గ్రహించలేకపోయినందుకు తమ్ము తాము తిట్టుకున్నారు. ఫాదర్ ఉపన్యాసం ఆఖరయ్యేవేళకి ఎవ్వరికీ దుఃఖం ఆగలేదు.

చనిపోయినవాళ్ల బంధువులతోపాటు అందరూ ఏడ వటం మొదలెట్టారు. ఫాదర్ తన ఉపన్యాసం విని తను కూడా ఏడ్చాడు.

ఇంతలో చర్చిబయట వరండాలో ఏదో చప్పుడైంది. కాని ఎవరూ గమనించలేదు. కాస్సేపటికి ఒక తలుపు తెరుచుకుంది. ఫాదర్ జేబురుమాలతో కళ్లు తుడుచుకుంటున్నవాడల్లా నిశ్చేష్టుడైపోయాడు. ముందు ఒకళ్లు, తరవాత యిద్దరు, తరవాత యావన్మందీ ఫాదర్ చూస్తున్నవేపుకే చూస్తూ ఒక్కపెట్టున నిర్ఘాంతపోయారు.

టామ్, జో, హాక్ ముగ్గురూ తలుపు దగ్గర నుంచున్నారు. టామ్ ముందు నడుస్తుండగా మిగతా యిద్దరూ సిపాయిల్లాగ 'మార్చి' చేసుకుంటూ ఫాదర్ వున్నచోటుకి వచ్చారు.

దాంతో చర్చిఅంతా గోలతో నిండిపోయింది. పోలీపెద్దమ్మ టామ్‌మీద, జోతల్లి జోమీద పడి ముద్దులు కురిపించేశారు. అంతా చుట్టూ మూగి ఊపిరాడనివ్వడం లేదు. పాపం హాక్ తనవాళ్లెవ్వరూ లేకపోవడంమూలాన ఒకమూల నుంచున్నాడు దిగాలుగా.

"పెద్దమ్మా, హాక్‌ని చూసి ఎవరన్నా సంతోషపడాలి. లేకపోతే బాగుండదు." అన్నాడు టామ్.

"అవును, పాపం. హాక్ బతికున్నందుకు నాకెంతో సంతోషంగా వుంది." అని వాణ్ణి బుజ్జగించింది పెద్దమ్మ.

ఫాదర్ గొంతెత్తి "భగవంతుడు ఇవ్వాళ మనపై ఇంత దయ చూపించినందుకు ఆయన్ని ప్రార్థించండి" అన్నాడు. అందరూ అలాగే ప్రార్థన చేశారు.

ప్రార్థనతో చర్చి మోతెత్తిపోతుండగా టామ్ దర్జాగా లాగుజేబుల్లో చేతులు పెట్టుకుని తనకంటే గొప్పవా డెవడన్నట్టుగా చుట్టూ చూశాడు. స్కూలు పిల్లలు కూడా టామ్‌ని మహానాయకుణ్ణి చూసినట్టుగా దూరంనుంచి ఈర్ష్యగా చూశారు.

టామ్ తన స్నేహితుల్తో చెప్పిన 'రహస్యం' యిదే; తమకోసం కర్మకాండ జరుగుతున్నప్పుడు వెళ్లి ఎదటపడాలని, ఊళ్లో కెళ్లటానికి అదే మంచి సమయమని. ఆ పొద్దున్నే వాళ్లు జాక్సన్ ద్వీపంనుంచి బయల్దేరి వచ్చారు.

టామ్ తను ఎల్లా పారిపోయిందీ, ఏమేమి సాహసాలు చేసిందీ సోమవారంనాడు యింటిదగ్గిర వర్ణించి చెప్పాడు.

పెద్దమ్మ అన్నది. "టామ్! నువ్వు పారిపోయినందుకు నాకేమీ కోపం రాలేదు. కాని చూశావా, నువ్వు చచ్చిపోయావని ఎంత దుఃఖపడ్డానో. 'చచ్చిపోలేదు, బతికేవున్నా'నని కాస్త నాకు తెలియపరిస్తే ఎంత బావుండేది? అవున్లే నీ సరదాలో నేను నీకు జ్ఞాపకం వుంటానూ. నువ్వంటే నాకెంత ప్రేమో నీకు తెలుసా? నువ్వు పెద్దయిన తరవాత అనుకుంటావు. 'పెద్దమ్మ

నన్నింతో యిదిగా చూసేదిగదా. ఆగిన్ని అప్పుడు నిర్లక్ష్యం చేశాను' అని విచారపడతావు."

"కాదు పెద్దమ్మా. నిన్ను గూర్చి నేను కలకన్నాను."

"ఏమి టా కల?"

"కిందటి బుధవారం రాత్రి నాకు కలవచ్చింది. నువ్వు యీ మంచంపక్కన కూర్చున్నావుట. సిడ్, మేరీ ఆ కొయ్యపెట్టె పక్కన కూర్చున్నారుట."

"అవును. ఆ రాత్రి కూర్చున్నాము. అందులో వింత ఏముంది?" అంది పెద్దమ్మ.

"జో హార్పర్ తల్లి కూడా ఇక్కడే కూర్చుందిట."

"అవున్రా, నిజమే తరవాత ఏంజరిగింది?"

"ఓ. ఇంకా చాలా జరిగింది. బయటినించి గాలి వచ్చి..."

"ఊఁ. గాలివచ్చి?"

"దీపాన్ని ఆర్పేసిందిట"

"ఓరి దేవుడా, నిజమే. ఊఁ."

"ఆ తరవాత నువ్వు, అదేమిటి, ఆ తలుపు తీసి వుంది? అన్నావుట."

"చెప్పు. తరవాత?"

"ఆగు, జ్ఞాపకం చేసుకోనీ. సిడ్‌ని వెళ్లి తలుపు వేసి రమ్మన్నావుట."

"అవును చెప్పాను. ఇదేమిటమ్మా ఆశ్చర్యంగా

వుందే. నిజంగా జరిగినదంతా కలల్లోకి రావటం వింతగా వుంది. తరవాత?"

"ఆ. ఇప్పుడు జ్ఞాపకం వస్తోంది అంతా." అని టామ్ ఆరోజు రాత్రి తను దొంగచాటుగా వచ్చి చూసినదంతా కలలో చూసినట్టు కల్పించి చెప్పాడు. పెద్దమ్మ నిర్ఘాంతపోయి విన్నది. ఈ సంగతి సాయంత్రంలోగా వెళ్ళి జోహార్పర్ తల్లితో చెప్పివెయ్యాలనుకున్నది. తలుపులన్నీ వేసివున్న గదిలో రాత్రివేళ జరిగినసంగతి అంతదూరాన వున్న టామ్‌కి కలరావటం ఆమెకి దేవుడి మాహాత్మ్యంగా తోచింది.

చివరికి టామ్ ఇంకో చిట్కా వేశాడు. పెద్దమ్మ నిద్రపోయిందట; అప్పుడు టామ్ వంగి ఆమె నుదుటి మీద ముద్దుపెట్టుకున్నాడుట.

ఇది వినగానే పెద్దమ్మ పొంగిపోయి 'తనంటే టామ్‌కి ఎంత ప్రేమో, కలలోకూడా ముద్దుపెట్టుకున్నాడు.' అనుకుంది. టామ్‌కి ఒక పెద్ద ఆపిల్ పండు ఏరి ఇచ్చి, బళ్ళోకి పంపించింది.

పెద్దమ్మ జోహార్పర్ ఇంటికి బయల్దేరింది టామ్ కలసంగతి చెప్పటానికి. కాని సిడ్‌కి నమ్మకం కలగ లేదు. "ఈ కలంతా అబద్ధం. నిజంగా జరిగిన సంగతి కలలో కెల్లా వస్తుంది. ఇందులో ఏదో కిటుకుం" దనుకున్నాడు.

ఉన్నట్టుండి ఎంత గొప్పవాడయిపోయ్యాడు టామ్! స్కూల్లో మామూలుగా చేసే కోతిచేష్ట లేమీ

చెయ్యలేదు. ఠీవిగా నడిచాడు. అందరూ తనకేసే చూస్తున్నారని తెలుసు. కాని తెలియనట్లు నటించాడు. అందరూ తన్నిగురించే మాట్లాడుకుంటున్నట్లు తెలుసు. కాని విననట్లు నటించాడు. మరీ చిన్నపిల్లలు అతను వెడుతుంటే నోరు తెరుచుకుని నిలబడి చూశారు. అతని యీడువాళ్లు లోపల అతని కీర్తికి ఈర్ష్యపడుతున్నా ఆ సంగతేమీ తెలియనట్లు నటించాడు.

అయినా చాలామంది టామ్, జోల చుట్టూ మూగారు, వాళ్లు వర్ణించే సాహసాలు వినడానికి. అందులో టామ్ కల్పనాశక్తి అద్భుతం. జరిగినవీ, జరగనివీ అన్నీ పెద్ద కథలాగా చెప్పాడు. కథ పూర్తయింతరవాత జేబుల్లోంచి చుట్టలు తీసి వెలిగించి వాళ్ళిద్దరూ వెళ్ళిపోతుంటే మిగతా పిల్లలు వాళ్లు సామాన్య మానవులు కారని, దేవతలేనని అనుకునేంతదాకా కథ నడిచింది.

టామ్ తనకి కీర్తి వచ్చేసింది కనక బెకీ థాచర్‌ని గూర్చి ఆట్టే పట్టించుకోగూడదనుకున్నాడు. బెకీ అప్పుడే వచ్చింది స్కూలుకి. ఆమెని చూడనట్లు నటించాడు టామ్. పక్కకి వెళ్లిపోయి కొందరు మగపిల్లల్నీ, ఆడపిల్లల్నీ చుట్టూ చేర్చుకుని ఏదో మాట్లాడుతున్నాడు. ఆమె అటూయిటూ తోటి పిల్లల్తో పరిగెడుతూ కేరింతలు కొడుతోంది. కాని ఆమె ఎంతసేపూ తనచుట్టు పక్కలే తిరుగుతూవుండటం, అప్పుడప్పుడు తనకేసి

దొంగచూపులు చూడటం గమనించాడు టామ్. దాంతో అతని బింకం మరీ ఎక్కువైపోయింది.

కొంతసేపటికి బెకీ పరిగెత్తటం మానేసి నిట్టూర్పులు విడుస్తూ టామ్ ఎదటినించే రెండుమూడుసార్లు తిరిగింది. టామ్ అందరికంటే ఎక్కువగా ఆమీ లారెన్సుతో మాట్లాడటం కూడా చూసింది. ఆమెకి ఉక్రోషం వచ్చింది. అక్కణ్ణించి వెళ్ళిపోదామనుకుంది గాని ఆమె కాళ్లు ఎంతసేపటికీ టామ్‌వైపే తిరుగుతున్నాయి.

టామ్ పక్కనే నుంచున్న ఒక పిల్ల దగ్గరికి వెళ్ళి,

"మేరీఆస్టిన్! నిన్న నువ్వు ఆదివారం బడికి రాలేదేం?" అని అడిగింది.

"వచ్చానే. నన్ను చూడలేదా?"

"ఊహూం. ఎక్కడ కూర్చున్నావు?"

"మిస్‌పీటర్స్ క్లాసులో."

"నిజంగానా? నీతో పిక్నిక్ విషయం చెబుదామనుకున్నాను నిన్న. (పిక్నిక్ అంటే కొందరు స్నేహితులు కలిసి ఊరికి దూరంగా ఎక్కడో ఒక చోటికి సరదాగా యాత్రకి వెడతారు కూడా తినుబండారాలు మొదలైనవి తీసుకువెళ్ళి కొంతసేపుగడిపి తిరిగి వస్తారు.)

"పిక్నిక్‌లో నన్ను కూడా చేర్చుకుంటావా?" అని అడిగింది మేరీ ఆస్టిన్.

"ఓ. నాకోసమే మా అమ్మ తలపెట్టింది పిక్నిక్. నా యిష్టమొచ్చిన వాళ్ళని తీసుకు వెళ్లచ్చునంది మా అమ్మ. నా స్నేహితుల్ని అందర్నీ తీసుకువెడతాను" అని బెకీ అంటూ టామ్ కేసి దొంగచూపు చూసింది. కాని టామ్ వినీ విననట్టుగా ఆమీ లారెన్సుతోనే మాట్లాడుతున్నాడు. తాను సముద్రపు దొంగగా వున్నప్పుడు వచ్చిన తుపాను గురించి చెబుతున్నాడు. ఒక పెద్దపిడుగు పడిందనీ, అది తనకి మూడడుగుల దూరంలో వున్న చెట్టుమీద పడినా అదృష్టం వుండి తను బతికానని కోతలు కోస్తున్నాడు.

"నేనూ రానా పిక్నిక్కి?" అని అడిగింది గ్రేసీ మిల్లర్.

"ఊఁ"

"నేను?" అంది శాలీ రోజర్స్.

"ఓ"

"నేనూ, జో కూడా రామా?" అంది సుసీ హార్పర్.

"తప్పకుండా."

టామ్, ఆమీ తప్ప మిగతావాళ్లంతా అడిగారు. బెకీ అందర్నీ తీసుకుపోతానంది. తరవాత టామ్ మాట్లాడుతూనే ఆమీతో కలిసి వెళ్ళిపోయాడు. బెకీ ఉక్రోషం పట్టలేకపోయింది. ఎవ్వరికీ కనిపించని ఒక మూలకి పోయి బాగా ఏడ్చింది.

ఆమధ్యాహ్నందాకా టామ్ ఆమీలారెన్సుతో

కలిసే ఉన్నాడు. బెకీ కనిపించలేదు. ఎక్కడుందో చూద్దామని స్కూల్లో అన్ని గదులూ వెదికాడు. ఆమె నింకా ఏడిపించాలనే అతని ఉద్దేశ్యం. హఠాత్తుగా బెకీ కనిపించింది. కాని ఒక్కత్తే లేదు. ఆల్ఫ్రెడ్ టెంపుల్‌తో కలిసి బొమ్మల పుస్తకం చూస్తోంది. వాళ్లు టామ్‌ని చూడలేదు. నవ్వుతూ తుళ్లుతూ బొమ్మలు చూస్తున్నారు. ఈ సారి టామ్‌కి ఉక్రోషం వచ్చింది.

కాని ఆమీ టామ్‌ని పట్టుకుని వదలటంలేదు. ఏదో సొద చెప్పుకు పోతోంది. ఆమె మాటలు అతని చెవి కెక్కటం లేదు. అతని మనస్సు ఎక్కడో వుంది. ఆమీని వదిలించుకునేటప్పటికి టామ్ తల ప్రాణం తోకకి వచ్చింది. అప్పటికీ ఆమీ వెళ్ళిపోతూ స్కూలు వదిలిపెట్టాక ఇంటికి కలిసిపోదామని చెప్పిపోయింది. టామ్ ఇంకా రెండు మూడుసార్లు బెకీ, ఆల్ఫ్రెడ్ కూర్చున్నచోటున తిరిగాడు. కాని బెకీ చూడనట్టు నటించింది.

టామ్ తన్ని తనే తిట్టుకున్నాడు. బెకీ ఇందాక స్నేహం చూపించినప్పుడు మాట్లాడకపోవటం తనదే తప్పనుకున్నాడు. "టామ్‌వట్టి వెధవ, జడ్డు, బడుద్ధాయి దగుల్బాజీ" ఇంకా ఎన్నో తిట్లు తిట్టుకున్నాడు.

మధ్యాహ్నం స్కూలు విడిచిపెట్టాక టామ్ ఇంటికి విచారంగా వెళ్లాడు. టామ్ మళ్ళీ రాకపోయేటప్పటికి బెకీకి అనుమానంవేసింది, అతనికి కోపం

వచ్చిందేమో నని. దాంతో దిగులుపుట్టింది. పుస్తకం టప్పున మూసేసి ఆల్ఫ్రెడ్‌తో మాట్లాడకుండా లేచి పోయింది.

ఆల్ఫ్రెడ్ వెంటపడ్డాడు. కాని ఆమె అతన్ని తోసేసింది. "ఛో, అవతలకి. నిన్ను చూస్తే నాకు అసహ్యం వేస్తోంది." అన్నది.

ఇంతవరకూ స్నేహంగా వుండి ఇప్పుడిల్లా అంటుందేమో అని ఆల్ఫ్రెడ్ విస్తుపోయాడు. కాని అతనికి అర్థమైంది. టామ్‌మీద కసితీర్చుకోటానికే తనతో కాసేపు స్నేహంగా వున్నదని. బాగా ఉడుక్కున్నాడు. టామ్‌మీద ఎల్లాగైనా కసి తీర్చుకోవాలనుకున్నాడు. టామ్ కూర్చునే బల్లమీద అతని పుస్తకాలు కనిపించాయి. అందులో కాంపోజిషన్ పుస్తకం తీసి దాంట్లో కొత్తగా టామ్ రాసిన పేజీమీద సిరా పోశాడు.

బెకీ ఇదంతా కిటికీలోంచి చూసింది, కాని చూడనట్టుగా వెళ్ళిపోయింది. టామ్‌మీద ఆమెకికూడా కసిగానే వుంది. మేష్టారు టామ్ కాంపోజిషన్ పుస్తకంలో సిరాచూసి బాదుతాడు. దాంతో టామ్ నోగం బాగా కుదురుతుంది. తన కసి తీరుతుంది; అనుకుంటూ ఆమె ఇంటికి వెళ్ళిపోయింది.

## 10

మధ్యాహ్నం బడినుంచి విచారంగా యింటికి వచ్చిన టామ్‌కు పోలీపెద్దమ్మ ఎదురుపడింది. ఆవిడ ధోరణి చూస్తే మీద విరుచుకు పడేలా వున్నది.

"టామ్! నిన్ను చర్మం ఒలిచినా పాపం వుందిరా?"

"నే...నే...నే నేం చేశాను పెద్దమ్మా?" అని బిత్తరపోయి అడిగాడు టామ్.

"నువ్వా? నన్ను తెలివితక్కువ దద్దమ్మని చేశావు. నువ్వు చెప్పిన కల నిజమని ఎల్లా నమ్మానో? తీరా జోహార్పర్ యింటికి వెళ్ళి వాళ్లమ్మతో చెబుదునుగదా, ఆవిడ దగ్గిర తల కొట్టేసినంత సిగ్గేసింది. నువ్విక్కడికి నిజంగా వచ్చి అదంతా చూశావని, జో ఆవిడతో చెప్పాట్ట. ఎంత ఛండాలుడివిరా నువ్వు?"

పెద్దమ్మతో కలనిగురించి కోతలు కోసినప్పుడు జో అనే వాడొకడున్నాడని, వాడి ద్వారా అసలు విషయం తెలియవచ్చునని టామ్‌కి జ్ఞాపకంరాలేదు. తను చేసిన పనికి కుంగిపోతూ తలవంచుకున్నాడు.

"పెద్దమ్మా! సిత్తో అల్లా అబద్ధమాడటం తప్పే. అబద్ధ మాడకూడదని అప్పుడు నాకు తెలవలేదు," అన్నాడు టామ్.

పెద్దమ్మ మళ్ళీ విసుచుకుపడింది.

"ని కేమీ తెలియదురా పాపం! బుల్లి పాపాయివి. మేమొక మూల లబోసుని ఏడుస్తుంటే మమ్మల్ని చూసి నవ్వటానికి జాక్సన్ లంకనించి రావటం తెలుసుగాని అబద్ధ మాడకూడదని తెలవదు, ఏం?"

"కాదు పెద్దమ్మా! నేను చేసిందంతా తప్పే కాని, మిమ్మల్ని చూసి నవ్వటానికి రాలేదు అవ్వాళ."

"మరెందుకు వచ్చావు?"

"మేము మునిగిపోలేదనీ, మాకోసం ఏడవొద్దనీ చెప్పటానికి వచ్చాను."

"అదుగో మళ్ళీ అబద్ధాలు. అయితే మరి ఆ ముక్క చెప్పలేదేం."

"ఎందుకనంటే, మీరు మా కర్మకాండని గూర్చి మాట్లాడుతుంటే, సరిగ్గా ఆదివారంనాటికి వచ్చి హఠాత్తుగా ఎదటపడి గమ్మత్తు చెయ్యాలని ఆలోచన తట్టింది. అంచేత ఆ తాటిమట్టని మళ్ళా జేబులోనే పెట్టేసుకున్నాను" అన్నాడు టామ్.

"తాటి మట్టేమిటి?"

"అదేలే పెద్దమ్మా! మేము సముద్రపు దొంగతనాలు చెయ్యటానికి వెళ్ళినట్టు తాటిమట్టమీద రాసి నీ బల్లమీద వుంచడానికి తెచ్చా. నేను నిన్ను ముద్దు పెట్టుకున్నప్పుడే నువ్వు లేస్తే ఎంతో బావుండు ననిపిస్తోం దిప్పుడు.

పెద్దమ్మ కోపం హఠాత్తుగా తగ్గింది.

"టామ్! నిజంగా నువ్వు నన్ను ముద్దుపెట్టుకున్నావురా?

"నిజం పెద్దమ్మా!"

"ఒట్టేనా?"

"ఒట్టు. నీతోడు."

"నన్నెందుకు ముద్దుపెట్టుకున్నావో చెప్పు."

"నువ్వంటే నాకెంత ప్రేమ పెద్దమ్మా! నువ్వు ఏడుస్తూ పడుకునుంటే నేను చూడలేకపోయాను "

ఈ మాటలు నిజమేనేమో అనిపించింది పెద్దమ్మకి. "సర్లే. ఇక బళ్లోకి పో," అని టామ్‌ని బడికి పంపింది.

టామ్ వెళ్లగానే ఆమె టామ్ జాక్సన్‌ద్వీపానికి తొడుక్కు-వెళ్లిన చొక్కా వెదికి తీసింది. దాని జేబులో చెయ్యి పెడదామా వద్దా అని ఆలోచించింది.

"టామ్ అబద్ధాలకోరు అయినా వాడిందాక చెప్పిన అబద్ధం నాకు కాస్త మనశ్శాంతి నిచ్చింది," అనుకుంది. టామ్ మాటలు అబద్ధమని తేల్చుకోవటానికి ఆమెకి ధైర్యం చాలలేదు. అయినా చివరికి తెగించి జేబులో వెదికింది. అందులో టామ్ చెప్పిన తాటిముట్ట కనిపించింది. దానిమీద అక్షరాలు చదువుకుని, "వాడికి నేనంటే నిజంగా ప్రేమే!" అని కన్నీళ్లు రాల్చింది సంతోషంతో.

టామ్ బడికి వెళ్లేటప్పటికి మనస్సు తేలికపడి సంతోషంగా వున్నాడు. అందుచేత బెకీ థాచర్ కనిపించగానే,

"బెకీ! పొద్దున నిన్ను అవమానం చేసినందుకు ఏమీ అనుకోకు. ఇంకెప్పుడూ అల్లా చెయ్యను. మనిద్దరం స్నేహంగా వుండొద్దూ," అన్నాడు.

బెకీ ఆగి అతనికేసి చూసి, అసహ్యంతో ఇలా అంది. "నీ స్నేహంకోసం ఇక్క-డెవళ్లూ మొహం వాచి

పోలా. నీకూ నాకూ ఇకనించీ మాటలు లేవు."

టామ్‌కి యీ మాటలు మొట్టికాయల్లా తగిలాయి. ఏమంటానికీ తోచలేదు. "మాట్లాడకపోతే నాకు దిగులా?" అందా మనుకున్నాడు గాని అప్పటికి బెకీ వెళ్ళిపోయింది. బెకీగనక మొగపిల్లాడయితే తను ఎల్లా ఉతికేసివుండేవాడో ఆలోచించుకున్నాడు. బళ్ళోకి వెళ్ళేటప్పటికి బెకీ మళ్ళీ కనిపించింది. ఆమెని దాటిపోతూ పోతూ ఒకమాట అన్నాడు. దానికామె ఫెడీమని జవాబు చెప్పింది. టామ్‌కి మేష్టారు బెత్తంపెళ్లి ఎప్పుడు చేస్తారా అని ఎదురు చూస్తోం దామె. కాని ఇంతలో ఒక ప్రమాదం జరిగింది.

మేష్టారి పేరు డాబిన్స్. పాపమాయన చిన్నతనంలో గొప్ప డాక్టరు కావాలని ఆశ పెట్టుకున్నాడు. కాని చివ్వరికి బడిపంతులుగతి పట్టింది. ప్రతిరోజూ బళ్లోవున్నప్పుడు తన డ్రాయరులోనుంచి పెద్ద బైండుపుస్తకం తీసి చాటుగా పెట్టి చదివేవాడు. క్లాసులో పాఠాలు చెప్పటం అయిపోయిం తరవాత రోజూ ఆయన కిదేపని. చివరికి పుస్తకాన్ని నిట్టూర్పులతో మూసేసి, డ్రాయర్లో పెట్టి, తాళం గట్టిగా బిగించేవాడు.

బళ్ళో పిల్లలు ఆపుస్తకం ఏమిటో తెలుసుకోటానికి ఊరికే ఇదయ్యేవారు. కాని ఎప్పుడూ వీలు చిక్కేదికాదు. ఒకడు ఆ పుస్తకం మ్యాజిక్ పుస్తకమనేవాడు. మరొకడు లెక్కలపుస్తక మనేవాడు. అంతే

గాని అది ఫలానా పుస్తకమని ఏ ఇద్దరూ ఎప్పుడూ ఒప్పుకోలేదు.

అప్పటికింకా మేష్టారుగాని, పిల్లలుగాని ఎవళ్లూ రాలేదు. బెకీ అటు పోతూపోతూ ఆ గదిలోకి తొంగిచూసింది. మేష్టారి డ్రాయరుకు తాళంచెవి పెట్టి వుంది. ఆయన అది తీసుకువెళ్ళటం మర్చిపోయాడు. ఆపుస్తకం చూట్టాని కిదే మంచి సమయం. మళ్ళీ అల్లాంటి సమయం రాదు.

మరొక క్షణంలో బెకీ చేతుల్లో ఆ రహస్యమైన పుస్తకం వుంది. అది వైద్యశాస్త్రంమీద రాయబడిన పుస్తకం. అందులో బొమ్మలు తిరగేస్తూవుంది బెకీ. ఇంతలో పుస్తకంమీద నీడపడింది. బెకీ ఉలిక్కిపడి వెనక్కి చూసింది. టామ్‌సాయర్ నవ్వుతూ నుంచున్నాడు. గబుక్కున పుస్తకం మూసెయ్యటంలో బొమ్మవున్న ఒక పేజీ సగానికి చిరిగింది. డ్రాయర్లో పెట్టి తాళం వేసేసి చేతుల్లో మొహం కప్పుకుని ఏడవసాగింది బెకీ. ఆమె మొహం సిగ్గుతోనూ, అవమానంతోనూ కందగడ్డలా అయిపోయింది.

"టామ్‌సాయర్! నీకు సిగ్గులేదూ ఇంకోళ్ల విషయాలు చూడటానికి?" అన్నది.

"నాకేం తెలుసు నువ్వా పుస్తకం చూస్తున్నావని?" అన్నాడు టామ్.

"ఛీ, నాతో మాట్లాడబోకు. నాకు తెలుసు మేష్టారితో ఈ సంగతి పితూరీ చెబుతావని. అమ్మో,

నన్ను మేష్టారు కొట్టేస్తాడు. ఇంతవరకెప్పుడూ నేను బళ్ళో దెబ్బలు తినలేదు." అని ఏడుస్తున్నది బెకీ.

"సర్లే చెప్పకో అనుభవిస్తాను. నీకూ తగు ల్తాయిలే ఇవ్వాళ దెబ్బలు. ఆగు నీ తిక్క కుదురు తుంది." అని ఏడుస్తూ అవతలకు వెళ్ళిపోయింది.

టామ్ అక్కడే నిలబడి పోయాడు.

"ఎప్పుడూ దెబ్బలు తినలేదుట. పాపం భయపడి పోతోందిపిల్ల. ఏంచెబ్బలుతింటే ఒకసారి? ఈఆడపిల్లలు వట్టి పిరికి ముద్దలు. నేను బెకీ మీద పితీలు చెప్తాను. మేష్టారు ఆ పుస్తకం ఎవరు తీశారని అందర్నీ వరసగా అడుగుతాడు. బెకీని అడిగేటప్పటికి ఆమె మొహమే చెబుతుంది చేసినపనిని. అప్పుడు మేష్టారు కొడతాడు," అనుకుంటూ టామ్ వరండాలోకి వెళ్ళిపోయాడు.

కాస్సేపటికి మేష్టారు వచ్చారు. పిల్లలంతా ఎవళ్ల చోటులో వాళ్లు కూర్చున్నారు. బెకీని గురించే ఆలోచిస్తున్న టామ్‌కి మేష్టారి గద్దింపు వినబడింది. కాంపోజిషన్ పుస్తకంమీద సిరా మరక చూసి ఆయన టామ్‌ని పిలిచాడు.

బెకీ తన సంగతి కాస్సేపు మర్చిపోయింది. పాపం టామ్ దెబ్బలు తినబోతున్నాడు. అతను సిరా పొయ్యలేదనీ, ఆల్ఫ్రెడ్ టెంపుల్ పోశాడనీ, లేచి చెబుదా మనుకుంది. కాని, ఎల్లాగూ తన మీద టామ్ పితీ చెబుతాడు కదా, అతనిమీద కసితీర్చుకోవద్దా, అనుకుని లేవ లేదు.

టామ్ శీఘ్రంగా లేచాడు. కుయ్ కయ్ మనకుండా దెబ్బ లన్నీ తిన్నాడు. తనే ఎప్పుడో అటూ యిటూ గెంతుతూ సిరా ఒలకపోసి వుంటానని అనుకున్నాడు. అయితే బళ్లో ఆచార ప్రకారం తను ఒలకపొయ్య లేదనిమాత్రం అన్నాడు. ఎల్లాగూ దెబ్బలు తప్పవుగా.

ఒక గంటసేపు పాఠాలు చెప్పారు మేష్టారు. తరువాత ఆవులించాడు, వళ్లు విరుచుకుని, కళ్లు నులుపు కుని, డ్రాయరు తాళం తీశాడు పుస్తకంచేత్తో పుచ్చు కుని తెరుద్దామా వద్దాఅని తటపటాయించాడు. చివరికి తెరిచి చదవటానికి ప్రారంభించాడు.

టామ్ బెకీకేసి చూశాడు. వేటకాడి చేతిలో చిక్కిన లేడిలా గజగజ వణుకుతోంది ఆమె. టామ్ ఆమె మీద కోపమంతా మర్చిపోయాడు. ఏదో ఒకటి చేసెయ్యాలి త్వరగా...

మేష్టారు కుర్చీని వెనక్కి బ్రగునత్రోసి ధన్ మని నుంచున్నాడు. చింతనిప్పులవలె మండే ఆకళ్లు చూసి అమాయికులుకూడా వణుకుతున్నారు. ఇంతలో ఒక గర్జన వినబడ్డది.

"ఈ పుస్తకం ఎవరు చింపారు?"

నిశ్శబ్దం. క్లాసంతా చీమ చిటుకుమంటే వినబడే నిశ్శబ్దం.

"బెన్ రోజర్స్ నువ్వేనా?"

"కాదు సార్."

"జోసెఫ్ హార్పర్-నువ్వా?"

"కాదు సార్."

మేష్టారు మొగపిల్లలందరినీ ఒకసారి పరకాయించి చూసి ఆడపిల్లలవేపు తిరిగాడు.

"అమీ లారెన్సు?" అడ్డంగా తలవూపింది.

"గ్రేసీ మిల్లర్?" ఊహూ.

"సూసాన్ హార్పర్?"

కాదు. పక్కనున్నది బెకీథాచర్.

"రెబెక్కా థాచర్! ఈ పుస్తకం నువ్వేనా తీసింది. తలెత్తు. నాకేసి చూడు. ఈపుస్తకం తీశావా?"

టామ్ బెకీకేసి చూశాడు. ఆమె మొహంలో నెత్తురు చుక్క లేదు...

టామ్ హఠాత్తుగా లేచి అరిచాడు. "నేనే సార్ తీసింది," అన్నాడు.

పిల్లలంతా టామ్ ఇంత తెలివి తక్కువపని ఎల్లా చేశాడా, అని తెల్లబోయి చూశారు. మేష్టారి బల్ల దగ్గిరికి వెడుతూ టామ్ బెకీకేసి చూశాడు. తనని టామ్ రక్షించినందుకు ఆమె కళ్లల్లో కృతజ్ఞత కనిపించింది. బెకీకోసం తను త్యాగం చేస్తున్నందువల్ల టామ్ కిక్కురుమనకుండా దెబ్బలు తిన్నాడు. మేష్టారు బెత్తం విరిగేదాకా కొట్టి అలసిపోయాడు.

స్కూలు వదిలిపెట్టింతరవాత కూడా రెండు గంటలసేపు బెంచీమీద నుంచోవాలని శిక్ష వేశాడు.

ఆ రెండు గంటలసేపు బడి అవతల తనకోసం ఒక అందమైన ఆడపిల్ల కనిపెట్టుకు నుంచుంటుం దని

టామ్‌కి తెలుసు. అంచేత ఏమీ కష్టమనిపించ లేదు. ఆ శిక్ష.

ఆల్ఫ్రెడ్ టెంపుల్ మీద ఏవిధంగా కసితీర్చుకో వాలో ఆలోచిస్తూ టామ్ ఆ రాత్రి పక్కమీద పడు కున్నాడు. కాంపోజిషన్ పుస్తకంమీద సిరా పోసింది ఆల్ఫ్రెడ్ అని బెకీ ఆ సాయంత్రమే చెప్పింది.

"టామ్, నువ్వెంత మంచివాడివి! నీ మేలు మరిచి పోనులే," అని బెకీ వెళ్ళిపోతూ అన్నమాటలు చెవిలో రింగు మంటుండగా నిద్రపోయాడు టామ్.

# 11

పరీక్షలరోజు దగ్గిర పడ్తోంది. ఆ తరవాత స్కూలుకి సెలవు లిస్తారు. మామూలుగా ఎప్పుడూ కఠినంగావుండే డాబిన్స్ మేష్టారు పరీక్షల రోజు దగ్గిర పడుతున్నకొద్దీ మరింత నిర్దాక్షిణ్యంగా పిల్లల్ని చావ చితకబాదటం మొదలెట్టాడు. ఆయన కొంచెం వయస్సుమళ్లినవాడే. ఆయన తలమీద ఒక్క వెంట్రుక ముక్కయినా లేదు. బట్టతల కప్పటానికి విగ్గుపెట్టుకునే వాడు. అయినా చేతుల్లో సత్తువ తగ్గలేదు. బెత్తాలు విరగాల్సిందే గాని ఆయన చేతులు నెప్పెట్టవు. ఆయన దెబ్బలు తినంది ఎదిగిన ఆడపిల్లలు, మగపిల్లలు మాత్రమే.

చిన్నపిల్లలందరూ ఆయనంటే హడలిపోతు న్నారు. ఆయనమీద ఏవిధంగా కసితీర్చుకోవటమా

అని వాళ్లు సభలు చేసి పన్నాగాలు పన్నేవాళ్లు. చివరికి అద్భుతమైన ఒక ఉపాయం తోచింది. స్కూల్లో ఒక కుర్రాడున్నాడు. అతని తండ్రి 'సైనుబోర్డు'లు రంగులతో తయారుచేస్తూ వుంటాడు. ఆ కుర్రాణ్ణి పట్టుకున్నారు మిగతా వాళ్లు. అతను తప్పకుండా మేష్టారికి పరాభవం చేయగలనని ఒట్టు పెట్టుకున్నాడు. మేష్టారు అద్దెకు వుండేది ఆ కుర్రాడి యింట్లోనే. పరీక్షలరోజు మధ్యాహ్నం మేష్టారు పడకకుర్చీలో కూర్చుని నిద్ర పోయేటప్పుడు "ఆపని" చేస్తానని చెప్పాడు.

పరీక్షలరోజుకి మేష్టారు, పిల్లలు సిద్ధమయ్యారు. అవ్వాళ బడిఅంతా దేదీప్యమానంగా లైట్లు వెలిగించారు. తోరణాలు, పువ్వులు మొదలైనవి అలంకరించారు. మేష్టారు తన 'సింహాసనం' మీద ఠీవిగా కూర్చున్నాడు. ఆయనకి రెండు పక్కలా మూడేసి వరసల్లో బెంచీలున్నాయి. ఎదురుగా ఆరు వరసల్లో బెంచీలున్నాయి. వీటన్నిటిమీదా ఊళ్లోని పెద్ద మనుషులు, చదువుకునే పిల్లల తల్లిదండ్రులు కూర్చున్నారు. ఆయన ఎడమచేతి పక్కన పెద్ద మనుషులు కూర్చున్న బెంచీల వెనక విశాలమైన ఒక బల్ల వుంది. దాని నిండా పిల్లలు కిక్కిరిసి కూర్చున్నారు. మరి చిన్న పిల్లల్ని వాళ్ళ తల్లులు తెగ అలంకరించి తీసుకువచ్చారు. అంత శుభ్రంగా స్నానం చేయించటం, బట్టలు తొడగడం ఆ పిల్లలకి ఉక్కిరి బిక్కిరిగా వుంది.

ఈ చిన్నపిల్లల వెనక పెద్దపిల్లలు చాలీ చాలని లాగూలు, చొక్కాలు వేసుకుని ఇబ్బందిగా కూర్చున్నారు. ఒక పక్కగా తెల్లటి సిల్కు బట్టలు, రంగు రంగుల రిబ్బన్లు, జేబురుమాళ్లు ధరించిన పెద్ద ఆడ పిల్లలు కూర్చున్నారు.

పరీక్షలు ప్రారంభమయ్యాయి. ముందుగా ఒక చిన్న అబ్బాయి బిడుకు బిడుకు మంటూ లేచి నుంచుని మేష్టారు తనచే బట్టీ పట్టించిన ఒక ఉపన్యాసం అప్పజెప్పాడు. "నాయంతటి బాల్యదశలో నున్న బాలుడు సభలో నుపన్యసించుట పాడిగాదని మీ రెరుంగుదురు," అంటూ మొదలెట్టాడు. ఉపన్యాసం పూర్తయ్యాక చప్పట్లు మోగాయి. దాంతో మరీ బేజా రెత్తి కూలపడ్డాడు ఆ అబ్బాయి.

తరవాత ఒక చిన్న అమ్మాయి లేచింది. సిగ్గు తోను, భయంతోను ఆ అమ్మాయి ముక్కు, బుగ్గలు ఎర్రపడ్డాయి. "మేరీ కున్న దొక చక్కని మేకపిల్ల", అనే పద్యం చదివి కూర్చుంది.

టామ్‌సాయర్ లేచాడు. ఒక ఉపన్యాసం (బట్టీ పట్టిందే) మొదలెట్టాడు. లాగూ జేబుల్లో చేతులు పెట్టుకుని దర్జాగా అందరికేసీ చూస్తూ, "నాకు స్వాతంత్ర్యమైన నిమ్ము, లేకున్న మృత్యువునే గోరుదును," అనే ఉపన్యాసం దంచాడు. కాని సగంలోకి వచ్చేటప్పటికి మర్చిపోయి దూలాలకేసి చూస్తూ నిలబడ్డాడు. మేష్టారు

గుడ్లురిమి చూశాడు. దాంతో మరీ కంగారు పుట్టి "మె మ్మె మ్మే" అంటూ నూస్తున్నాడు.

ఈ విధంగా ఒకళ్ల తరవాత ఒకళ్లు తమ చదువుని ప్రదర్శించారు. పెద్ద ఆడపిల్లలు ఇళ్లవద్ద తండ్రుల చేత రాయించుకు వచ్చిన కాంపోజిషన్లు చదివారు. అందుచేత వాళ్ళలో ప్రతివాళ్లకీ చప్పట్లు విపరీతంగా పడ్డాయి.

ఇక మేష్టారు తన పాండిత్యం ప్రదర్శించాలి. తనకంటె చదువు వున్నవాళ్లని భర్తలు అంతే యింకా మెచ్చుకోవటం చూసి ఆయన ఉషారుగా లేచాడు. "సింహాసనం" లోంచి లేచాడు. గోడకేసి తిరిగి బ్లాకు బోర్డుమీద అమెరికా బొమ్మ వేస్తున్నాడు. కాని చెయ్యి వణుకుతున్నది. సభలో కొద్దిగా నవ్వులు ప్రారంభమయ్యాయి. మూలపు చెరిపి మళ్ళీ వెయ్యబోయాడు. మళ్లీ చెయ్యి వణికింది. నవ్వులెక్కు–వయ్యాయి. 'హా' అప్రతిష్ఠపడకూడదని, పట్టుదల–పట్టి, చెయ్యి బిగించి బోర్డుమీద బొమ్మ వేస్తున్నాడు.

మేష్టారికి సరిగా నెత్తిపైగా స్కూలు గంటకొట్టే గోపురం వున్నది. ఆ గోపురానికి ఒక చిన్న కిటికీ కూడావుంది. ఆకిటికీగుండా ఒకపిల్లి తలక్రిందులుగా దిగుతోంది. దాని కాలికి ఒక గట్టితాడు కట్టబడివుంది. 'మ్యావు' మని గోలచెయ్యకుండా దాని నోరు గట్టిగా బిగించబడి వుంది. ఆ విధంగా అది కొంచెం కొంచెమే

కిందికి దిగుతోంది. సభలో నవ్వులు ఇంకా ఎక్కువవుతున్నాయి. పిల్లి క్రిందుగా మేష్టారి నెత్తి నందుకునేంత దగ్గరిదాకా దిగింది. ముందరి కాళ్లతో ఆయన తల మీద వున్న విగ్గును లంకించుకుంది. వెంటనే పిల్లి, పిల్లితోబాటు విగ్గు జరుమని మళ్ళీ పైకి వెళ్లిపోయాయి. మరో నిమిషంలో కిటికీగుండా అవి మాయమై పోయాయి.

అవ్వాళ సభలో ప్రసన్న యావన్మందీ నవ్విన నవ్వక మేష్టారు ఏడుపు మినహాగా తక్కిన దంతా చేశారు. పిల్లి పైనుంచి దిగుతున్నంతసేపూ ఆయన మెత్తగా, పళ్లు నొక్కిపెట్టి అమెరికా మ్యాప్ గీస్తూనే వున్నాడు. విగ్గు ఎగిరి పోయిందాకా సభ్యు లెందుకు నవ్వుతున్నారో ఆయన కర్థం కాలేదు.

మేష్టారి బట్టతల మీద రంగు రంగుల బొమ్మలు చిత్రించ బడివున్నాయి. అవి దీపాల వెల్తురులో బలేగా మెరిశాయి.

దాంతో సభ ఆఖరయింది. పిల్లలు పగతీర్చుకున్నారు. సెలవు లిచ్చేశారు.

* * *

టామ్‌సాయర్ వూళ్లో కొత్తగా 'బుద్ధిమంతుల సంఘం' అనే పేరుతో ఒక సంఘం పెట్టారు. ఆ సంఘంలో చేరినపిల్లలు మంచి నడవడిని నేర్చుకోవాలి. టామ్‌కు ఈసంఘంమీద మోజుపుట్టి వెంటనే చేరాడు.

ఆ సంఘంలో వున్నంతకాలం చుట్టలు తాగననీ, పోక చెక్కలు నమలననీ, ఏ విధమైన చెడ్డపని చేయనని ప్రమాణం చేశాడు.

సంఘంలో చేరగానే టామ్‌కు ఒక కొత్త విషయం తెలిసింది. ఏ పనులైతే చెయ్యకూడదని తను ప్రమాణం చేశాడో సరిగ్గా ఆ పనులే చెయ్యాలని బుద్ధి పుడుతోంది. బూతులు మాట్లాడనని ప్రమాణం చేసిన మరుక్షణం నుంచీ బూతులమీదికే దృష్టి పోతోంది. ఇక చుట్ట సంగతి చెప్పక్కర్లేదు. రాత్రింబగళ్ళు మంచి మంచి ఘాటైన చుట్టలు కళ్ళల్లో మెదుల్తూ నోరూరిస్తున్నాయి. టామ్ విపరీతంగా బాధపడిపోయాడు కొన్ని రోజులు.

సంఘానికి రాజీనామా ఇచ్చేద్దా మనుకున్నాడు. కాని ఒక మంచి ఆకర్షణ కనిపిస్తోంది. ఆ సంఘంలో చేరిన పిల్లలు పండగరోజుల్లో గాని, లేక పెద్దల్లో ఎవ రైనా చచ్చిపోయినప్పుడు కర్మకాండ వ్యవహారాలు జరిగేటప్పుడు గాని, ప్రత్యేకమైన దుస్తులు ధరించి వూరేగుతారు. ఆ భాగ్యాన్ని పోగొట్టుకోవటం టామ్‌కిష్టం లేదు. ఎందుకంటే ఆ పెద్దల్లో జడ్జిగా పనిచేస్తున్న ఫ్రేజర్ గారు పెద్ద జబ్బులో వున్నాడు. ఆయన మీదే టామ్ ఆశ పెట్టుకున్నాడు. రోజుకి నాలుగు సార్లయినా వాళ్ళకి వెళ్ళి అడిగేవాడు జడ్జీగారి కెల్లా వుందని. ఒక్కొక్కసారి జడ్జీగారి పరిస్థితి చాలా ప్రమాదంగా వుండేది. అటువంటి సమయాల్లో టామ్ పెట్టెలోనుంచి 'దుస్తులు

తీసి అద్దంముందు నుంచుని చాలా జాగ్రత్తగా అలంకరించుకునేవాడు. ఇంతలో జడ్జిగారికి నిమ్మళంగానే వుందని తెలిసేది. ఈవిధంగా చాలా సార్లు జరిగింది. టామ్‌కు బలే విసుగుపుట్టింది.

చివరికి జడ్జీగారికి బాగా నెమ్మదించిందనీ, ఇక ఫరవాలేదనేవార్త వచ్చింది. టామ్ వెంటనే సంఘానికి వెళ్ళి రాజీనామా యిచ్చాడు. ఆ రాత్రే జడ్జీగారు జబ్బు తిరగబెట్టి పాపం చచ్చిపోయారు. టామ్‌కు వెర్రి కోపం వచ్చింది ఆయన మీద. ఇంకెప్పుడూ జడ్జీలను నమ్మకూడదనుకున్నాడు.

జడ్జిగారికి బ్రహ్మాండంగా అంత్యక్రియలు జరిగాయి. సంఘంలోని పిల్లలు దర్జాగా దుస్తులు వేసుకుని వీధుల్లో ఊరేగారు. వాళ్ళ అదృష్టం చూచి మండిపడ్డాడు టామ్. అయినా రాజీనామా యివ్వటం ఒకందుకు మంచిదే అయింది. అతనిప్పుడు స్వతంత్రంగా తన యిష్టం వచ్చిన పని చెయ్యవచ్చు. చుట్టలు త్రాగవచ్చు. బూతులు మాట్లాడవచ్చు. కాని, అవన్నీ తన ఇష్టప్రకారం చెయ్యవచ్చని ఎప్పుడు తెలుసుకున్నాడో అప్పుడే వాటిమీద మోజుపోయిందతనికి.

ఈ సెలవుల్లో ఏమి చెయ్యటమా అన్నది పెద్ద సమస్య అయిపోయింది. రోజూ బడికి వెళ్ళటం విసుగుపుట్టి ఎప్పుడు సెలవులొస్తాయా అని ఎదురుచూసిన టామ్ సెలవు లెప్పుడైపోతాయా, బడి ఎప్పుడు తెరుస్తారా అని బెంగపెట్టుకున్నాడు. రోజూ డైరీ రాస్తూంటే

కొంత తోస్తుందిగదా అనుకున్నాడు. మూడురోజులు చూసినా డైరీలో రాయవలసినంత మంచి విషయం ఏమీ జరగలేదు. అందుచేత డైరీబుక్కు చించేశాడు.

నీగ్రో పాటగాళ్లు వచ్చి రెండు రోజులు వూళ్ళో పాటకచ్చేరీలు చేశారు. ఆ రెండు రోజులూ జోహార్పర్‌తో కలిసి టామ్ కొంచెం వుషారుగానే తిరిగాడు. తరవాత మళ్లీ ఏమీ తోచలేదు.

అమెరికా పార్లమెంటులో సభ్యుడయిన బెంటన్ ఆ వూరు వచ్చాడు. ఆయన్ని చూడక ముందు టామ్ ఆయన ప్రపంచంలోకల్లా గొప్పవాడనుకున్నాడు. కాని తీరా చూశాక 'తుస్సు' మనిపించాడు. ఎందుకంటే ఆయన 25 అడుగుల పొడుగు లేడు. కనీసం పదెనిమిది అడుగులైనా లేడు.

సర్కస్ ఒకటి వచ్చింది. అది వెళ్లిపోయిన తర్వాత పిల్లల్ని చేరదీసి టామ్ సర్కస్ ఆట ఆడాడు. కాని మూడురోజుల్లో ఆ ఉత్సాహం మొత్తింది.

గారడీ చేసేవాడొకడు వచ్చాడు. వాడు వెళ్లిపోయింతరవాత మళ్ళీ యథాప్రకారం.

బెకీ థాచర్ వాళ్ల అమ్మా, నాన్నలతో కలిసి అమెరికాకు కొన్నివేల మైళ్లదూరంలో వున్న కాన్‌స్టాంటినోపుల్ పట్నానికి వెళ్ళిపోయింది. కనక ఎటు చూసినా టామ్‌కి సంతోషించదగింది కనబడలేదు.

మఫ్ పాటర్ కూనీ కేసు ఎటూ తేలకుండా వీడుస్తోంది. ఈ విషయంలో నిజం తెలిసిన టామ్ కిది ఎంతో బాధగా వుంది.

ఆతరవాత కొన్నాళ్లు కళ్లు కలక, జ్వరం వచ్చి టామ్ మంచంమీంచి లేవలేకపోయాడు. మళ్ళీ లేచి తిరిగే సమయానికి ఊరు ఊరంతా మారిపోయింది. అందరూ ఫాదరీల బోధనలు విని “పుణ్యాత్ము”లై పోయారు. “పాపాత్ము” డొకడైనా కనిపిస్తాడేమోనని టామ్ ఊరంతా వెదికాడు. ఆఖరికి జో హార్పర్ కూడా బైబిలుపుస్తకం చదివేస్తున్నాడు. బెన్ రోజర్సు బిచ్చగాళ్ళకి సేవచేస్తున్నాడు. జిమ్ హాలిన్సుని మాట్లాడించబోగా, “టామ్! నకు జ్వరం దారికే రాలేదు. క్రీస్తు దేవుణ్ణి నమ్మితే నీకే బాధలూ రావు,” అని ఉపదేశించబోయాడు.

వీళ్ళెవరూ లాభంలేదనుకుని హకల్ బెరీఫిన్ ఒక్కడే నమ్మదగిన “పాపాత్ము” డని, వాణ్ణి వెదికి పట్టుకున్నాడు. టామ్ నోరు తెరవకముందే హాక్ బైబిలులో ప్రార్థన చదివాడు. టామ్ దిగజారిపోయి నీరసంగా ఇంటికి తిరిగివచ్చాడు. తనొక్కడూ తప్ప మిగతా వాళ్ళంతా బాగుపడిపోతున్నారనుకున్నాడు.

ఆ రాత్రి పెద్ద పెట్టున గాలిదుమారం, వర్షం వచ్చాయి. ఏక్షణాన్నయినా ఇల్లు కూలిపోతుందని పించేటట్లు ఉరుములు, మెరుపులు వచ్చాయి. టామ్

మంచంమీద పడుకుని చావుకోసం ఎదురు చూస్తు న్నాడు. ఎందుకంటే తను పాపాత్ముడు కనుక దేముడికి కోపంవచ్చి ఈ తుపాను పంపించాడని అతని నమ్మకం. కాని కొంతసేపటికి తుపాను తగ్గింది. ఇక నించి "పుణ్యాత్ముడు" కావాలని టామ్ నిశ్చయం చేసుకున్నాడు.

మర్నాడు టామ్ మంచం చుట్టూ డాక్టర్లు తయారు. జబ్బు తిరగబెట్టింది. ఆ మూడు వారాలు మూడు వందల ఏళ్ళనిపించింది. జబ్బు తగ్గి టామ్ వూళ్ళో తిరగబోయేసరికి మళ్ళీ మార్పు వచ్చింది. జిమ్ హాలిస్ ముఖ్యులైనవాళ్ళు 'కూనీకేసు ఆట" ఆడుతున్నారు. ఒక పిల్లి ఒక పక్షిని హత్యచేసిందని కేసు పెట్టా డొక కుర్రాడు. పిల్లిని కట్టేసి పెట్టుకున్నారొకచోట. పక్షి చావనూలేదు, ఏమీ లేదు; గుడ్లు తెరిచి చూస్తోంది.

ఇంకొకచోట జోహార్పర్, హక్ కలిసి ఎక్కడో ఎత్తుకువచ్చిన పళ్ళు తింటున్నారు. పాపం వాళ్ళూ టామ్ లాగానే "పాపాత్ము" లైపోయారు మళ్ళీ. అమ్మయ్య పరవాలేదనుకున్నాడు టామ్.

* * *

ఎల్లాగైతేనేం చివరికి కూనీకేసు కోర్టులో విచారణకు వచ్చింది. ఏమీ తోచక కొట్టుకుంటున్న ఊళ్ళో వాళ్ళకి కబుర్లకి మంచిమేత దొరికింది.

ఎవళ్ళు ఎక్కడ కూనీకేసుగురించి మాట్లాడుతున్నా టామ్‌కి భయంగానే వుండేది. తనకి వినబడే

టట్లుగా మాట్లాడాలని, తన రహస్యం తనచేత బైట పెట్టించాలని, ప్రతివాళ్ళూ అనుకుంటున్నట్టే అతని భయం. తను డాక్టరుహత్యనిగూర్చి ఎరిగివున్నట్టు మరొకళ్ళకి ఎల్లా తెలుస్తుందా అన్నైనా అతనాలోచించ లేదు. అంచేత ఎక్కువ ఈ మాటలు చెవిని పడ్డా నిలువునా వణికిపోయేవాడు. ఈ విషయాన్ని గూర్చి కొంత మాట్లాడాలని టామ్ ఒకరోజున హాక్‌ని ఎవ్వరూలేని ఒకచోటికి తీసుకువెళ్లాడు. తన గుండెల్లోవున్న బరువుని హాక్‌తో పంచుకోవాలని అతని ఊహ. పైగా హాక్ ఈసంగతి గట్టిగా వుంచాడో లేదో తెలుసుకోవాలి.

"హాక్! దాన్నిగూర్చి ఎవళ్ళకైనా చెప్పావా?"

"దేన్నిగూర్చి?"

"నీకు తెలుసు అదేదో!"

"ఓ! అదా? ఊహు, చెప్పలా"

"ఒక్కమాటకూడా?"

"ఉహు! నీ కనుమానంగా వుందా?"

"అబ్బే. కొంపతీసి చెప్పేశావేమో అని భయపడ్డాను."

"టామ్‌సాయర్! అలా చెప్పేస్తే రెండు రోజులు కూడా మనం బతికివుండము. మనం ప్రమాణం చేశాంగా!"

టామ్ మనస్సు కుదటపడింది.

"కాని ఎవళ్లన్నా నిన్ను చెప్పమని బలవంతం చేస్తే?" అని అడిగాడు టామ్.

"నన్నా? ఇంజన్ జో అనే రాక్షసుడి చేతిలో చావాలని కోరిక వుంటే తప్ప నేను ఈ విషయం చెప్పను," అన్నాడు హాక్.

"మనకీ సంగతి తెలుసునని ఎవ్వరికీ తెలియనంత కాలం మన కేం భయంలేదు. అయినా మళ్లీ ప్రమాణం చేద్దామా? అదైనా మంచిది."

"స."

ఇద్దరూ మళ్లీ భయంకరమైన కొన్ని మంత్రాలు చదువుతూ ప్రమాణం చేశారు.

"హాక్! జనం ఏమనుకుంటున్నారు?"

"అబ్బ ఒకటేమాటరా ఎక్కడ చూసినా మఫ్ పాటర్, మఫ్ పాటర్, మఫ్ పాటర్. ఆ మాటలు వింటుంటే నాకు తెగ చెమట పట్టుకొస్తోంది. అందుకే ఎక్కువగా ఊరిబయటే తిరుగుతున్నాను," అన్నాడు హాక్.

"నాకూ అల్లాగేవుంది. మఫ్ పాటర్ని ఉరితీస్తారనుకుంటాను. నీకు వాడిమీద జాలి కలగటంలా?"

"జాలి కలుగుతోం దనుకో, ఏంచేస్తాం? పాపం చాలా మంచివాడు. ఎప్పుడూ చేపలు పడుతూ ఉంటాడు, అవి అమ్మి తాగటానికి. ఒకసారి నాకు ఒక

చేపని సగంకోసి యిచ్చాడు. చాలాసార్లు నేను కష్టాల్లో వున్నప్పుడు సహాయం చేశాడు."

"నాకూ అంతే హాక్. నా గాలిపడగలు, చేపల గాలం బాగుచేసిపెట్టేవాడు. వాణ్ణి జైలులోనించి తప్పించవచ్చనుకుంటా మనం."

"మనకేం చాతవుతుంది? ఒకవేళ తప్పించినా మళ్ళీ పట్టుకుంటారు," అన్నాడు హాక్.

"నిజమే. కాని పాపం అంత మంచివాణ్ణి తిడుతుంటే వినలేకుండా వున్నా." అన్నాడు టామ్.

ఈ విధంగా ఇద్దరూ చాలాసేపు మాట్లాడారు. కాని దానివల్ల వాళ్ళ మనస్సులు ఊరటపడలేదు. సాయంత్రమైన తరవాత చాలాసేపు జైలు చుట్టూ ఊరికే కాళ్ళుకాలిన పిల్లుల్లాగా తెగ తిరిగారు. పిట్టకథల్లో మాదిరిగా చివ్వరికి ఏ దేవతలన్నా వచ్చి మఫ్ పాటర్ని రక్షిస్తారని ఎదురుచూశారు. కాని అలాంటిదేమీ జరగలేదు. ఆ దురదృష్టవంతుడిమీద దేవతలకెవ్వరికి జాలికలిగినట్టు లేదు.

అప్పుడక్కడ జైలుకాపలావాళ్ళెవరూ లేరు. టామ్, హాక్ కటకటాలగుండా మఫ్ పాటర్‌కి కాస్త పొగాకు అందించారు. ఈ పిల్లలు తన కిల్లాంటి దయ చూపించినప్పుడల్లా పాటర్ దణ్ణంపెట్టి కృతజ్ఞత తెలియజేస్తూ వుంటాడు. ఆ సమయాల్లో వాళ్ళు విచారంతో కుంగిపోయేవాళ్ళు. ఈసారి అల్లాగే పాటర్ దణ్ణం పెట్టాడు. మునపటికంటే ఎక్కువగా వాళ్ళకి బాధ

కలిగింది. మఫ్‌పాటర్‌కి తాము అన్యాయం చేస్తున్న
ట్టనిపించింది.

మఫ్‌పాటర్ ఇల్లా అన్నాడు:

"నామీద ఇంతదయ చూపించేది మీరొక్కళ్ళే. నేను దాన్ని మర్చిపోలేను. అప్పుడప్పుడు నే నేమనుకుంటూనంటే, 'నేను ఊళ్ళో పిల్లల గాలిపటాలు, గాలాలు బాగుచేసి యిచ్చేవాణ్ణి. చేపలు బాగాదొరికే చోట్లు చూపించేవాణ్ణి. నేను కష్టాల్లో పడేటప్పటికి వాళ్ళంతా నన్ను మర్చిపోయారు. కాని టామ్ మర్చిపోలేదు. హక్ మర్చిపోలేదు. నేనూ వాళ్ళని మర్చిపోలేదు' అని. సరే టామ్! జరిగిందేదో జరిగింది. బాగా తాగివున్నానేమో అప్పుడు వొళ్ళు తెలియక డాక్టర్ని చంపేశాను......అహాహా...ఆ విషయం మాట్లాడను లెండి, మీకు కష్టం కలిగిస్తున్నట్టున్నాను. ఇంతకీ నే చెప్పేదేమంటే మీరెప్పుడూ తాగద్దు. తాగకపోతే జైల్లోపడేగతి రాదు మీకు. కష్టాల్లో వున్నప్పుడు మీలాంటి చిట్టిచిట్టి స్నేహితుల్ని చూడటం కాస్త తృప్తిగా వుంటుంది. ఏదీ, ఒకళ్ళ వీపుమీద వొకళ్ళు ఎక్కండి. మీతో 'షేక్‌హాండ్' చేస్తాను. ఆ, అల్లా...మీ చేతులు చిన్నవి, ఈ చువ్వల్లోంచి తేలిగ్గా దూరతాయి. నావి పెద్దవికదూ, చువ్వల్లో పట్టవు. కాని మీవి చిన్నచేతులైనా అవి మఫ్‌పాటర్‌కి ఎంతో సహాయం చేశాయి. అవసరమైతే ఇంకా చేస్తాయి కూడాను."

ఈమాదిరిగా వాదం మఫ్‌పాటర్ ఒక చిన్న ఉపన్యాసం యిచ్చాడు. టామ్ దాదాపు ఏడుస్తూనే యింటికి వెళ్లాడు. ఆ రాత్రి అన్నీ పీడకలలే. మర్నాడు, ఆ మర్నాడు కోర్టు చుట్టూ తిరిగాడు. లోపలికి వెళ్ళి ఏదన్నా ఘనకార్యం చేద్దామనిపించేది కాని బలవంతాన ఆ కోరిక ఆపుకున్నాడు. హక్ పనీ అలాగేవుంది. ఇద్దరూ ఒకళ్ళకొకళ్లు కనిపించకుండా తప్పించుకు తిరిగారు; కాని ఏదో ఆదుర్దావల్ల కలుసుకోకుండా వుండలేకపోయారు.

రెండోరోజు సాయంత్రానికి ఎవర్నడిగినా ఒకటే మాట; ఇంజన్‌జో సాక్ష్యం బలంగా వుందనీ, మఫ్‌పాటర్‌కి ఉరిశిక్ష తప్పదనీ.

ఆ రాత్రి టామ్ ఇంటికొచ్చేటప్పటికి జాము రాత్రి అయింది. కిటికీగుండా దూరివచ్చి పడుకున్నాడు.

మర్నాడు పొద్దుటికల్లా కోర్టు కిటకిటలాడిపోయింది. మగ, ఆడ జనం ఇసకవేస్తే రాలనట్టు కిక్కిరిసి కూర్చున్నారు. జడ్జీలు, ప్లీడర్లు అంతా ఎవళ్ళ స్థానాల్లో వాళ్లు కూచున్నారు. మఫ్‌పాటర్ని పోలీసులు తీసుకొచ్చి బోనులో నుంచో పెట్టారు. అతని ముఖాన నెత్తురుచుక్క లేదు. నీరసంగా, ఇనపసంకెళ్ల బరువుకూడా మొయ్యలేనట్టున్నాడు. జనమంతా మఫ్‌పాటర్ కేసీ, ముఖ్యసాక్షి అయిన ఇంజన్‌జో కేసీ అదే పనిగా చూస్తున్నారు.

తరవాత కొంత సేపటిదాకా ప్లీడర్లు గుసగుస లాడుకోవటం, కాయితాలు తిరగెయ్యటం తప్ప మరేమీ జరగలేదు.

ఒకసాక్షిని పిలిచారు; హత్యజరిగిన తెల్లవారు జామున మఫ్ పాటర్ ఊరిబైట కాలవలో కాళ్ళూ, చేతులు కడుక్కుంటూండగా తను చూశాననీ, తన్ని చూడగానే మఫ్ పాటర్ బెదురుతూ దొంగచూపులు చూస్తూ వెళ్ళిపోయాడనీ, ఆ సాక్షి చెప్పాడు.

గవర్నమెంటు ప్లీడరు సాక్షిని కొన్ని ప్రశ్న లడిగిన తరవాత, మఫ్ పాటర్ తరఫుప్లీడరు "నేనేమీ ప్రశ్నలు వెయ్యను," అన్నాడు. పాటర్ తలెత్తిచూసి మళ్ళీ దించుకున్నాడు.

తరవాత సాక్షిని తను శవంపక్కన పాటర్ బాకును చూసినట్టు సాక్ష్యం చెప్పాడు. పాటర్ తరఫు ప్లీడరు ఇతన్నికూడా అడ్డుప్రశ్నలు వెయ్యలేదు.

మూడోసాక్షి ఆ బాకును పాటర్ వద్ద చాలా సార్లు చూసినట్టు సాక్ష్యమిచ్చాడు. పాటర్ ప్లీడరు ఇతన్ని ప్రశ్నించలేదు. ఇదే విధంగా అనేకమంది సాక్షులువచ్చి మఫ్ పాటర్ హంతకుడని ఋజువుచెయ్యటానికి సాక్ష్యాలిచ్చారు. పాటర్ పక్షాన వాదించవలసి వున్న ప్లీడరు ఎవళ్ళనీ అడ్డుప్రశ్నలు వెయ్యకుండా వదిలిపెట్టేశాడు. జనం తలోరకంగా అనుకోటం ప్రారంభించారు. ఆ ప్లీడరుకు నోట్లో నాలికే లేనట్టుందనీ, వాదించటం చేతకాదనీ, లంచంపుచ్చుకుని పాటర్ని

ఉరిశిక్షకు వదిలిపెడుతున్నాడనీ గుసగుసలు బయలు దేరాయి.

చివరికి గవర్నమెంటు ప్లీడరు "నమ్మకస్థులైన సాక్షులచేత సాక్ష్యాలిప్పించాము. వాటివల్ల మఫ్ పాటరే హంతకుడని ఋజు వవుతున్నది. జడ్జీలు ఇక తమ అభిప్రాయం తెలపాలని కోరుతున్నాము," అని చెప్పి కూర్చున్నాడు.

పాటర్ పాపం నిరాశతో మూలిగాడు. మొహం చేతుల్లో కప్పుకుని అటూ యిటూ వూగుతున్నాడు. కోర్టంతా చీమ చిటుకంటే వినబడేలాగ నిశ్శబ్దంగా వుంది. చాలమంది మొగవాళ్లు పాటర్ మీద జాలి కనబర్చారు. ఆడవాళ్లు కన్నీళ్లుకూడా కార్చారు.

పాటర్ తరఫు ప్లీడరు గభీమని నుంచున్నాడు. జడ్జిగారికేసి తిరిగి,

"మఫ్ పాటర్ తాగిన నిషాలోఉండి తెలియక హత్య చేశాడని, కనక అతడు బుద్ధిపూర్వకంగా చేసిన నేరంకాదనీ పొద్దున నేను వాదనలో చెప్పాను. ఈ వాదనని రద్దు చేసుకుంటున్నాను... (గుమాస్తా కేసి తిరిగి) థామస్ సాయర్ని పిలవండి ఒక్కసారి," అన్నాడు.

ఈ మాటలు వినేసరికి అందరూ "ఏమిటిది?" అన్నట్టు ఒకళ్ల మొహాలు ఒకళ్లు చూసుకున్నారు. పాటర్ కూడ ఆశ్చర్యపోయాడు. టామ్ భయపడుతూ,

బెదురుచూపులు చూస్తూ సాక్షుల బోనుఎక్కి నుంచున్నాడు. అందరి చూపులూ టామ్ కేసే చూస్తున్నాయి.

"దేవుని ఎదట నిలిచి సత్యమేతప్ప మరేదీ చెప్పనని ప్రమాణం చేస్తున్నాను." అని టామ్ చేత ప్రమాణం చేయించారు కోర్టు వాళ్లు.

పాటర్ ప్లీడరు అడిగాడు,

"థామస్‌సాయర్! జూన్ 17వ తేదీనాడు అర్ధ రాత్రప్పుడు ఎక్కడున్నావు?"

టామ్ గుటకలువేస్తూ ఇంజన్ జో కేసిచూశాడు ఇక అంతే. నోట్లోంచి మాట పెగల్లేదు. జనం చెవులు రిక్కించుకున్నారు టామ్ చెప్పేది వింటానికి. కాని మాటలు రావందే! కొంతసేపటికి టామ్ నిలవ దొక్కుకుని అన్నాడు.

"శ్మశానంలో..."

"కొంచెం గట్టిగా చెప్పాలి. భయపడకు."

"శ్మశానంలో..."

ఇంజన్‌జో ముఖంలో "ఏడి శావ్ లే" అన్నట్టు ఒక నవ్వు కనిపించింది.

"హార్స్ విలియమ్సును పాతిపెట్టిన చోటుకి దగ్గరగా వున్నావా?"

"అవునండి సార్."

"ఇంకా గట్టిగా చెప్పు...ఏమాత్రం దగ్గరగా వున్నావు?"

"మూాక్స్, నేను ఇప్పుడు నుంచున్నంత దగ్గిరగా నుంచున్నాను."

"ఎక్కడన్నా దాగి వున్నావా?"

"ఆ."

"ఎక్కడ?"

"గోరీ పక్కగా రావి చెట్లున్నాయి. వాటి చాటున."

ఇంజన్ జో ఉలిక్కిపడ్డాడు. కాని అది ఎవ్వరూ చూడలేదు.

"నీతో ఇంకా ఎవరన్నా వున్నారా?"

"ఉన్నారు సార్. నాతో కూడా......"

"ఆగు, కాస్సే పాగు. నీతో వున్న మనిషి పేరు ఇప్పుడు చెప్పద్దు. తరవాత అతని సంగతి చూద్దాం. నువ్వు ఏమేమి తీసుకు వెళ్లావ్ అక్కడికి?"

టామ్‌కి కంగారుపుట్టింది తటపటాయించాడు.

"చెప్పు అబ్బాయ్ భయపడద్దు. నిజాన్ని మేము గౌరవిస్తాం నీతో ఏం తీసుకెళ్ళావ్?"

"ఏమీ లేదండి. ఒక...ఒక...చచ్చిన పిల్లిని మాత్రం..."

కోర్టులో నవ్వు బయల్దేరింది. కాని జడ్జీగారు "ఉష్," అని ఆనవ్వుని అణిచేశారు.

"ఊఁ. అయితే ఇహ చెప్పు. వరసగా నువ్వేమి చేసిందీ, ఏమి చూసిందీ చెప్పు. ఏమీ వదలిపెట్టకు."

టామ్ చెప్పసాగాడు. మొదట్లో మాటలు తోచలేదు. కాని ధైర్యం తెచ్చుకున్నాడు. ఇప్పుడు మాటలు వాటంతటఅవే దొర్లుకొస్తున్నాయి. కాస్సేపటికి కోర్టంతా నిశ్శబ్దమైంది. టామ్ ఒక్కడిమాటలే స్పష్టంగా, గట్టిగా వినిపిస్తున్నాయి. నోరు తెరుచుకుని టామ్ చెప్పే భయంకరమైన కథని అంతా వింటున్నారు.

"—డాక్టరు బండరాయి నెత్తి పాటర్ పాజిర్ నెత్తిమీద కొట్టాడు. పాటర్ పడిపోయాడు.ఇంజన్ జో వెంటనే బాకు తీసి డాక్టర్ని..."

ఠాప్! ఠీప్! ఇంతసేపూ కాళ్లు గజగజ వణుకుతూంటూ ఈ సాక్ష్యమంతా వింటూ నుంచున్న ఇంజన్ జో దగ్గర్లోవున్న కిటికీగుండా దూకి, పట్టుకోవచ్చే వాళ్లందర్నీ దాటుకుని ఉడాయించాడు.

# 12

టామ్ మళ్ళీ ఘనత కెక్కాడు తన గ్రామంలో.

పెద్దవాళ్ల కతనిమీద ఇష్టం, చిన్నవాళ్లకి అసూయ ఏర్పడ్డాయి. ఆ ఊళ్లో వార్తా పత్రికకూడా టామ్ పేరు పెద్ద పెద్ద అక్షరాలతో ప్రకటించింది. కొందరు పిల్లలు టామ్ త్వరలో అమెరికా అధ్యక్షుడై పోతాడనికూడా అనుకున్నారు.

మఫ్ పాటర్ నిర్దోషిఅని తెలియగానే ప్రజలు అతన్ని ఇదివరకు ఎంత తిట్టిపోశారో, ఇప్పుడంత

గౌరవించటం ప్రారంభించారు. అందుకే లోకులు పలు గాకులంటారు.

టామ్ ఒకటిస్రూట ఉత్సాహంగా నేతిరిగేవాడు. ఎక్కడికి వెళ్లినా అతన్ని అందరూ గౌరవించేవాళ్లు. తను ఒక మహానాయకుడైపోయినట్టుగా ఊహించుకునేవాడు. కాని చీకటిపడేటప్పటికల్లా టామ్ అవస్థ ప్రారంభమయ్యేది. చీకట్లో ఒంటరిగా వెళ్లటానికి భయపడిపోయేవాడు. ఏమూలో ఇంజన్‌జో దాక్కొని వుండి మీదపడి చంపేస్తాడని ఒకటే భయం. ఇక కళ్లు మూసి నిద్రపోతేచాలు, ఇంజన్‌జో కలల్లో ప్రత్యక్షమయ్యేవాడు. వాడి కళ్లు భయంకరంగా ఉరిమేవి.

విచారణ రేపు జరుగుతుందనగా ఆ కిందటి రాత్రే టామ్ వెళ్లి లాయరుతో హత్యసంగతి యావత్తూ పూసగుచ్చినట్టు చెప్పేశాడు. హాక్ కూడా తనతోవున్నట్టు చెప్పాడు. కాని హాక్ సంగతి లాయరు కోర్టులో బయట పెట్టలేదు. తనని కోర్టులో లాక్కురావద్దని హాక్ లాయరువద్ద వాగ్దానం తీసుకున్నాడు. హాక్‌కి భయంతీరలేదు. అంత భయంకరమైన మంత్రాలతో ప్రమాణంచేసిన టామ్ తమ రహస్యం బయటపెట్టగాలేంది, లాయరుమాత్రంతనపేరు బయట పెట్టడని నమ్మకమేముంది! అందుచేత హాక్ కూడా ఇంజన్‌జో ఎప్పుడో తనపని పట్టేస్తాడని భయపడిపోతున్నాడు.

మఫ్‌పాటర్ టామ్ తన్ను రక్షించినందుకు ఎంతో కృతజ్ఞత చూపిస్తున్నాడు. అందుచేత పగలు నుత చేసినపని మంచిదేనని టామ్ నమ్మినా, రాత్రిళ్లు మాత్రం తను నోరుమూసుకుని ఉంటే బాగుండిపోనని అనుకునేవాడు.

ఇంజన్‌జో పోలీసుకి దొరకడని కొంతసేపు, దొరుకుతాడని కొంతసేపు టామ్ భయపడేవాడు. ఇంజన్ జో శవాన్ని కళ్లారా చూస్తేనేగాని సరిగ్గా నిద్ర పట్టేట్టు లేదు టామ్‌కి.

ఇంజన్ జోని పట్టుకున్నవాళ్లకి బహుమతి యిస్తామని అధికారులు ప్రకటించారు. చుట్టుపట్ల వెదికారు; కాని హంతకుడెక్కడా కనిపించలేదు.

సెంట్ లూయీనుండి డిటెక్టివ్ ఒకాయన వచ్చాడు. డిటెక్టివ్ అనేవాడు దేవుడితో సమానమనీ, అతనికి తెలియని విషయాలుండవనీ, టామ్ నమ్మకం. ఆ డిటెక్టివ్ కొన్ని ప్రదేశాలు పరిశీలించాడు; తలకాయ ఆడించాడు; ఏదో కనిపెట్టినట్టు చూశాడు; చివరికి "రహస్యం" కనిపెట్టానన్నాడు. కాని "రహస్యము అనేదాన్ని ఉరితియ్యటమెల్లా? కనక కొన్నాళ్లతరవాత డిటెక్టివ్ వచ్చినదారినే తిరిగి పోయాడు.

రోజులు గడుస్తున్నకొద్దీ టామ్ ఇంజన్ జో సంగతిని కొద్ది కొద్దిగా మర్చిపోతున్నాడు.

* * * *

ఒక పిల్లవాడు ఆరోగ్యంగా ఉన్నాడో లేదో కనుక్కోవాలంటే ఒకటే మార్గమున్నది. ఎప్పుడో ఒకప్పుడు ఆ పిల్లవాడు 'గుప్తధనం' కోసం ప్రయత్నించాలి. గుప్తధనమంటే ఎక్కడో నేల తవ్వుతుంటే హఠాత్తుగా, ఎవరు పాతిపెట్టారో తెలియకుండా బైట పడే డబ్బు.

టామ్‌కికూడా ఇలాంటి కోరికే పుట్టింది. జోహార్పర్ కోసం వెదికాడు; కనిపించలేదు. బెన్‌రోజర్సు కోసం వెదికాడు; అతడూ ఊళ్లో లేడు. చివరికి చోరాగ్రేసర చక్రవర్తి హాక్‌ఫిన్ కనిపించాడు. టామ్ అతన్ని చాటుకి తీసుకిపోయి యీ వ్యవహారం చర్చించాడు. హాక్ తక్షణం అంగీకరించాడు. పెట్టుబడి అక్కర్లేకుండా, సరదా పుట్టించే ఎటువంటిపనికైనా హాకల్‌బెరీఫిన్ సిద్ధమే.

"ఎక్కడ తవ్వుదాం?" అని అడిగాడు హాక్.

"ఎక్కడైనా సరే."

"ఎక్కడ తవ్వినా డబ్బువస్తుందా?" అని హాక్ ప్రశ్నించాడు.

"అహ ఎక్కడపడితే అక్కడ దొరకదు. ముఖ్యంగా ద్వీపాల్లో దొరకచ్చు; చచ్చిపోయిన చెట్లుంటాయే, వాటి నీడ అర్థరాత్రిపూట ఎక్కడ పడుతుందో అక్కడ తవ్వితే దొరకచ్చు. కాని దెయ్యాలు తిరిగే ఇళ్లల్లో నేల మాళిగ లుంటాయి.

పాటిల్లో ఎక్కువగా దొరుకుతుంది," అని టామ్ వివరించాడు.

"అక్కడ దాచేది ఎవరు?"

"ఎవ రేమిటి, దొంగలే. డాబిన్స్‌మేష్టారి లాంటివాళ్లనుకున్నావా?"

"ఏమో నాకు తెలియదు. నేనే కనక అయితే ఆ డబ్బంతా జల్సాగా ఖర్చుపెడతానుగాని దాచను."

"నేనూ అంతే చేస్తాను. కాని దొంగలు అల్లా చెయ్యరు."

"దాచిపెట్టిన దొంగలు మళ్ళీ రారా?"

"రారు. వద్దామనుకుంటారు కాని గుర్తులు మర్చిపోతారు. లేక ఎక్కడో అకస్మాత్తుగా చచ్చిపోతారు. ఆ దాచినడబ్బు అక్కడే చాలాకాలం వుండి తుప్పు పడుతుంది. చివరికి ఎవడికో ఒక పచ్చ కాగితం దొరుకుతుంది. అందులో డబ్బు ఎక్కడుందీ తెలిపే గుర్తులుంటాయి. ఆ గుర్తులు పిచ్చిగీతల్లాగా కనిపిస్తాయి. వాటిఅర్థం కనుక్కోటానికే వారంరోజులు పడుతుంది."

"నీ దగ్గిర అల్లాంటి కాగితమేమన్నా వుందా?

"లేదు."

"మరి మనకి గుర్తులెల్లా తెలుస్తాయి?"

"నాకు గుర్తు లక్కర్లేదు. సాధారణంగా దెయ్యాలున్న ఇళ్లలోనూ, లంకల్లోనూ, చచ్చిపోయిన చెట్లకిందా పాతిపెడతారు. మనం జాక్సన్‌ద్వీపాన్ని కొంతవరకు చూశాం. దాన్ని మళ్లీ ఎప్పుడన్నా

వెదకచ్చు. ఈలోగా ఊరికి దూరంగా కాలవపక్కన పాడుపడిన ఇల్లుండే, అక్కడ వెదుకుదాం. అక్కడ చచ్చిపోయిన చెట్లు చచ్చేన్ని ఉన్నాయి."

"అన్నిటికిందా డబ్బు వుంటుందా?"

"ఎందు కుంటుంది? నీకేమన్నా పిచ్చా?"

"మరి దేనికింద వెదుకుదాం?"

"అన్నిటికిందాను."

"ఇక అయినట్టే. ఈ వేసాకాలమంతా మనం కష్టపడవల్సివుంటుంది."

"అయితే ఏం? కష్టపడతాం. వంద డాలర్లుకల ఇత్తడిబిందె దొరకుతుందనుకో అప్పుడెల్లా వుంటుంది?"

హక్ కళ్లు జిగేలు మన్నాయి ఈమాట తలుచుకునేటప్పటికి.

"బలే, యమగా వుంటుంది. ఇదిగో టామ్! నాకు ఆ వంద డాలర్లు ఇచ్చేసెయ్యి. నాకు రత్నాలు అక్కర్లేదు."

"సరే, అలాగే. కాని నీ కొక్క రత్నంకూడా ఇవ్వను. అందులో ఒక్కొక్క రత్నం ఇరవైడాలర్లకి తక్కువ ఖరీదు చెయ్యదు."

"నిజంగానా టామ్?"

"ఆ. ఎవర్నన్నా అడుగు కావలిస్తే. నువ్వెప్పుడూ రత్నాలు చూడలేదా, హక్?"

"ఉహు."

"రాజులదగ్గిర తట్టలు తట్టలుంటాయి రత్నాలు.

"నే నెప్పుడూ రాజుల్ని చూడలేదు."

"యూరప్ వెళ్లి చూడు. ఈగల్లా ముసురుతారు."

"రాజులు ఈగల్లాగా వుంటారా?".

"ఒరేయ్, అమ్మవమ్మలాగా మాట్లాడకు. రాజులు ఈగల్లా ఎందు కుంటారు.? దర్జాగా రాజ తీవిగా ఉంటారు."

"సరేగాని, టామ్! ముందు ఎక్కడ తవ్వుదా మంటావ్?"

"కాలవ కవతల వేపున కొండమీద ఒక చచ్చిన చెట్టుంది. దానికింద చూద్దాం."

"ఆల్ రైట్. నేను తయార్."

ఒక గునపం, పార సంపాదించి ఇద్దరూ బయల్దే రారు. కాలవ మూడుమైళ్ళ దూరాన వుంది. చెమటతో తడిసి, వగరుస్తూ అక్కడికి చేరుకుని ఒక చెట్టునీడలో విశ్రాంతికోసం కూలబడ్డారు.

టామ్ అన్నాడు: "నాకు చాలా బావుంది యీ పని."

"నాకూ అంతే," అన్నాడు హాక్.

"హాక్! మన కిక్కడ ధనం దొరికితే, నీ వాటాతో నువ్వేం చేస్తావు?"

"రోజూ సోడాకొనుక్కు తాగుతాను. వచ్చిన ప్రతి సర్కసూ వదలిపెట్టకుండా చూస్తాను. ఓ, బలే దర్జాగా గడుపుతానులే."

"కాస్తన్నా దాచుకోవా?"

"ఎందుకూ?"

"ముసలితనంలో పనికొస్తుంది."

"ప్చ్. లాభం లేదు. మా నాన్న ఎప్పుడో అమాంతంగా వస్తాడు. చెవులు మెలేసి ఉన్నదంతా లాక్కుని తాగేస్తాడు. ఈలోగానే అంతా ఖర్చు పెట్టేసుకుంటాను. నీ డబ్బుతో ఏం చేస్తావు టామ్!"

"ఒక కొత్త డప్పు, పెద్దఖడ్గం, ఎర్రటి నెక్-టై, కొను క్కుంటాను, పెళ్లి చేసుకుంటాను."

"పెళ్లా?"

"ఆహా"

"టామ్! నీకేమన్నా మతి పోయిందా?"

"ఆగు. చూస్తూ వుండు."

"మా అమ్మా, నాన్నా చూడు. ఎప్పుడూ ఘోరయుద్ధం చేసేవాళ్లు. నాకు బాగా జ్ఞాపకం."

"నేను పెళ్ళి చేసుకునే అమ్మాయి యుద్ధం చెయ్యదు."

"ఈ ఆడాళ్లంతా ఒకటే. ఒళ్లంతా పట్టుకుని రక్కేస్తారు. నీ పిల్ల పేరేమిటి?"

"పిల్ల కాదు ఆమె అమ్మాయి."

"ఏదైనా ఒకటే. కొందరు పిల్ల అంటారు. కొందరు అమ్మాయి అంటారు. ఇంతకీ ఆమె పేరు?"

"ఇప్పుడు కాదు. తరవాత చెబుతాలే."

"నీ ఇష్టం. కాని నువ్వు పెళ్లి చేసుకుంటే నే నిక ఒంటరిగాణ్ణి అయిపోతా."

"అబ్బే నువ్వు మాయింట్లో నే వుందువుగాని. సరే, ఇక లే. తవ్వుదాం."

అరగంటసేపు ఇద్దరూ కష్టపడి తవ్వారు. ఫలితం లేదు. మరో అరగంట కష్టపడ్డారు. లాభం లేదు. హాక్ అన్నాడు:

"ఇంత లోతుగా పాతిపెడతారా?"

"ఒక్కొక్క సారి చాలా లోతుగా పాతిపెట్తారు. అసలు చోటు ఇది కాదనుకుంటా."

మరో చోటు ఎంచుకుని తవ్వటం మొదలెట్టారు నిశ్శబ్దంగా. హాక్ అలిసిపోయాడు. గునపాన్ని నేలకు గుచ్చి దానిమీద ఆనుకొని చొక్కాతో చెమట తుడుచుకున్నాడు.

"తరవాత ఎక్కడ తవ్వుదాం టామ్?"

"కార్డిఫ్ మెట్టమీద, అమ్మగారియింటి వెనకాల పెద్ద చెట్టుకింద తవ్వుదాం."

"అవును, అది మంచి చోటేకాని అది అమ్మగారిభూమికదా! డబ్బు ఆవిడ లాగేసుకుంటుందేమో?"

"ఎవరిభూమిలోనన్నా ఉండనీ ఆ డబ్బు ఎవరికి దొరికితే వాళ్ళదే."

మళ్ళీ తవ్వటం సాగించారు. హాక్ మళ్లీ అలిసి పోయి,

"వెధవది; ఇక్కడకూడా డబ్బున్నట్టు లేదురా-ఏమంటావ్?" అని అడిగాడు.

"చాలా ఆశ్చర్యంగా వుందే. ఎంత తవ్వినా

డబ్బు కనిపించటంలేదు. ఒక్కొక్కప్పుడు దెయ్యాలు వచ్చి డబ్బును మాయంచేస్తాయట. ఇప్పుడు అలాంటిదే జరిగివుంటుంది."

"దెయ్యాలకి పగటిపూట బలం వుండదుగా?"

"అవును. ఆవిషయం నేను మర్చిపోయాను. ఓ. అసలు మనం తప్పుచేశాం. మనంత దద్దమ్మ లెక్కడా వుండరు. చెట్టునీడ అర్ధరాత్రివేళ ఎక్కడ పడుతుందో అక్కడ తవ్వాలి."

"ఏమిట్రా టామ్! ఇంతసేపూ అనవసరంగా తవ్వించావు. మళ్ళీ అర్ధరాత్రి రావాలి. బోలెడు దూరం. నువ్వు రాగలవా?"

"ఓ. వస్తాను. ఇవ్వాళ రాత్రే మనం తవ్వాలి. ఈ గోతులు ఎవరన్నా చూస్తే ఇట్టే తెలిసిపోతుంది మన రహస్యం. వాళ్లుకూడా తయారవుతారు, మన కడ్డంగా."

"సరే. నేను రాండు తిరిగి మీ యింటి కొస్తాను. నేను 'మ్యావ్' మనగానే లేవాలి."

"అచ్ఛా. ఈగునపం, పార పొదల్లోదాచిపోదాం."

ఆ రాత్రి అనుకున్నవేళకి ఇద్దరూ అక్కడ చేరారు. చుట్టూ నిశ్శబ్దంగా, ఒంటరిగా వుంది. ఆకుల మధ్య దెయ్యాలు గుసగుసలాడుతున్నాయి. ఎక్కడో దూరాన కుక్క ఏడుస్తున్నట్టు మొరిగింది. ఒక గుడ్లగూబ దానికి సమాధాన మిచ్చింది. గుండెలు బిక్కుబిక్కు మంటున్నాయి. కొంతసేపటికి పన్నెండుగంట లయిందని నిశ్చయించారు. చెట్టునీడ ఎక్కడ పడు

తోందో గుర్తుపెట్టారు. అక్కడ తవ్వటం మొద
లెట్టారు. గునపం దేనికో తగిలి 'ఖంగ్' మన్నప్పు
డల్లా వాళ్లు అది ఇత్తడి బిందే ననుకునేవారు. చివరికి
అది ఏ రాయో అయ్యేది.

"హాక్! మళ్ళీ మనం తప్పుచోట తవ్వుతున్నా
మనుకుంటా."

"తప్పుచోటు కాదు. నీడ పడేచోటు ఖచ్చి
తంగా గుర్తుపెట్టాంగా."

"అది కాదు. మనం గుర్తుపెట్టినప్పుడు సర్గిగా
పన్నెండు అయిందో లేదో?"

హాక్ గునపం కింద పారేశాడు.

"అదీ, అసలు సంగతి. ఇక్కడ మానేద్దాం
పోనీ. మన కెల్లా తెలుస్తుంది పన్నెండు ఎప్పుడయిందో?
పైగా మనచుట్టూ దెయ్యాలు, భూతాలు నాట్యం
చేస్తున్నట్టు చప్పుడవుతోంది. చాలా అపాయకరం
యీపని. నిమిషనిమిషానికి నావెనక ఎవరో నుంచు
న్నట్టే అనిపిస్తోంది."

"నాకూ అలాగే వుంది హాక్! చెట్టుకింద డబ్బు
పాతిపెట్టేటప్పుడు సాధారణంగా 'చచ్చిన శవాన్ని'
కూడా పాతిపెడ్తారు కాపలాకోసం."

"బాబోయ్"

"అవును. నా కావిషయం చాలామంది చెప్పారు."

"ఇప్పుడు 'చచ్చిన శవాలను' మనం కదిలించట
మెందుకు టామ్! ఇంకోచోటికి పోదాం."

"దెయ్యాల ఇంటికి పోదామా?"

"దెయ్యాలుండే ఇల్లు నాకు నచ్చవు టామ్! మనం చూడనప్పుడు, నల్లటి ముసుగు వేసుకుని, వెన కాలగా వచ్చి, భుజంమీదగా వంగి దెయ్యం 'ఇహీ' మని ఇకిలిస్తుందనుకో అప్పుడు నా ప్రాణాలు పైనే ఎగిరిపోతాయి."

"పోనీ పగటిపూట వెళ్లి తవ్వుదాం."

"దెయ్యాలుండే యిళ్లకి పగటిపూట కూడా ఎవరూ పోరు తెలుసా?"

"ఎందుకంటే ఆ యిళ్లలో ఏదో హత్య జరిగి వుంటుందని భయం. అసలు ఆ కిటికీలోంచి నీలపు దీపాలు కనిపిస్తాయి తప్ప దెయ్యాలు కనిపించవు."

"వెలుగుతూ, ఆరుతూ నీలపు దీపం కనిపిస్తుం దనుకో దానివెనక దెయ్యం తప్పకుండా ఉండితీరు తుంది. నీలపుదీపాలు దెయ్యాలదగ్గరే వుంటాయి?"

"అయినా, అవి పగటిపూట రావుగా. మనకి భయమేముంది?"

ఇల్లా మాట్లాడుకుంటూ ఇద్దరూ కొండ దిగు తున్నారు. హాక్ మర్నాడు దెయ్యాల ఇంటిలో ప్రయత్నించటానికి ఒప్పుకున్నాడు.

వెన్నెల్లో కొంచం దూరంలో దెయ్యాల ఇల్లు కనిపించింది. కొన్నిచోట్ల గోడలు పడిపోయి, కప్పు విరిగిపోయి, కిటికీ రెక్కలు ఊడిపోయి, శిథిలమై వుంది. లోపల్నుంచి నీలపుదీపం కనిపిస్తుందేమోనని ఇద్దరూ

దూరంగా నుంచుని చాలాసేపు చూచారు. చివరికి విసుగుపుట్టి ఇళ్ళదారి పట్టారు.

# 13

మర్నాడు మధ్యాహ్నం టామ్, హక్ 'చచ్చిన చెట్టు' దగ్గిరికి వెళ్లి కిందటిరోజున అక్కడ దాచిన పార, పలుగు తీసుకున్నారు. దెయ్యాల యింటికి దబ్బున వెళ్లాలని టామ్‌కి ఒకటే తొందర. హక్‌కి కూడా తొందరగానే వుంది; కాని హఠాత్తుగా ఏదో జ్ఞాపకంవచ్చి ఇల్లా గన్నాడు.

'ఇటు చూడు టామ్! ఇవ్వాళ ఏం వారం?"

టామ్ వారాలన్నీ జ్ఞాపకం చేసుకుని, ఉలిక్కిపడ్డాడు; కళ్లు పెద్దవిచేసి,

"అరె బాప్! నాకీ ఆలోచన తట్టనే లేదురా!" అన్నాడు.

"నాకూ ఇప్పటిదాకా జ్ఞాపకం రాలేదు. శుక్రవారమని ఇప్పుడే గుర్తుకొచ్చింది," అన్నాడు. హక్.

"ఎంత జాగ్రత్తగా వుందామన్నా ఏదోటి పొరపాటు జరుగుతూనే వుంది. ఇవ్వాళ గనుక ఆపని తలపెడితే కష్టాలు తప్పవు."

"అవును, శుక్రవారం మంచిరోజు కాదు."

"ఆ సంగతి ఏ చంటిపిల్లాడికైనా తెలుసు. నువ్వే కనిపెట్టినట్టు డాబులు కొట్టకు."

"నే నేం డాబులు కొట్టడంలేదు. టామ్

మర్చేపోయాను. రాత్రి నాకు పీడకలకూడా వచ్చింది. అందులో ఎలికలు కనిపించాయి."

"అయితే తప్పకుండా ప్రమాదం జరుగుతుంది. ఎలికలు దెబ్బలాడుకున్నాయా?"

"లేదు."

"అయితే ఫరవాలేదు హాక్! ఎలికలు దెబ్బలాడుకోకపోతే మన చుట్టుపక్కల ఏదో ప్రమాదం జరుగుతుందని అర్థం; అంతే గాని మనకేమీ ఉండదు. ఏమైనా ఈ వ్యవహారం ఇవ్వాల్టికి మానేద్దాం హాక్! నీకు రాబిన్‌హుడ్ కథ తెలుసా?"

"తెలవదు. ఎవరు రాబిన్ హుడ్?"

"ఇంగ్లండు దేశంలోకల్లా గొప్పవాడు; గజదొంగ."

"బలే, నేనుకూడా గజదొంగ అయితే ఎంత బావుంటుంది? ఎవర్ని దోచేవాడు?"

"మంత్రుల్ని, మతగురువుల్ని, రాజుల్ని, ధనవంతుల్ని మాత్రం దోచుకునేవాడు. బీదవాళ్ళని చాలా ప్రేమించేవాడు. దోచుకున్న డబ్బంతా వాళ్లకి పంచిపెట్టేవాడు."

"చాలా గొప్పవాడై వుండాలి రాబిన్ హుడ్."

"నిజంగా ప్రపంచంలోకల్లా గొప్పవాడు. ఇప్పుడల్లాంటివాళ్లు ఒక్కళ్లైనా లేరు. ఇంగ్లండులో ఎంత గొప్పవీరుడినైనాసరే రెండు నిమిషాల్లో మట్టి తినిపించేవాడు. ఒక చెయ్యి వెనక్కి విరిచికట్టుకుని ఒక్క చేత్తో ఎంత సేనైనా యుద్ధంచేసేవాడు."

ఆరోజు చీకటిపడేదాకా ఇద్దరూ రాబిన్‌హుడ్ ఆట ఆడారు. మధ్యలో అప్పుడప్పుడు దెయ్యాల ఇంటి కేసి ఆశగా చూసేవారు. ఆ మర్నాడైనా తమ ప్రయత్నాలు ఫలిస్తాయో లేదోనని బెంగపడ్డారు. చివరి కిళ్లదారి పట్టారు.

శనివారం మధ్యాహ్నం మళ్ళీ ఆ చోటుకే వచ్చారు. నీడలో కూర్చుని చుట్టలు కాల్చారు. ఆఖరుసారి తవ్విన గొయ్యిని మళ్ళీ కొంచెం తవ్వారు. డబ్బు దొరుకుతుందని ఆశతో కాదు. టామ్ ఏమని చెప్పాడంటే, "కొందరు ఇలాగే భూమిలో తవ్వితవ్వి విసుగెత్తి వెళ్లిపోతారు. ఇంకొక ఆరంగుళాలు తవ్వితే డబ్బు బయటపడుతుంది. కాని వాళ్లు ఇక దొరకదని నిరాశచేసుకుని వెళ్లిపోతారు. అప్పుడు ఇంకెవళ్లో వచ్చి రెండు మూడుసార్లు గడ్డ పలుగు దిగేసేటప్పటికల్లా డబ్బుబిందెలు బయటపడిపోతాయి. పాపం మొదట్లో అంత కష్టపడి తవ్వినవాళ్ల కవి దొరకవు" అని చెప్పాడు.

అందుకని పోనీ చూద్దామని కొంచెం తవ్వి చూశారు. కాని అదృష్టం కలిసిరాలేదు వాళ్లకి. తమ కర్తవ్యం తాము చేశామనే సంతృప్తితో వాళ్లు నిట్టూరుస్తూ బయల్దేరారు.

దెయ్యాల ఇంటికి వచ్చేటప్పటికి అక్కడ అంతా ప్రశాంతంగా వుంది పిట్టలుకూడా రావటానికి భయపడే ఆ ఒంటరి ప్రదేశంలో ఆ నిశ్శబ్దాన్ని గమనించేసరికి వాళ్లకి ఎందుకో అర్థంకాని భయం ఆవేశించింది.

కిటికీగుండా తొంగిచూశారు. ఇంటో నేలనిండా గడ్డి ఒత్తుగా మొలిచింది. దట్టమైన బూజు గోడలనిండా అలముకుంది. విరిగిపోయిన ఒక పాత పొయ్యిలో 'ఇక్ష్వాకుల కాలం' నాటి బొగ్గులు, బూడిద ఇంకా అల్లాగే వున్నాయి. నెమ్మదిగా, ఊపిరికూడా బిగపట్టి లోపలికి ప్రవేశించారు. జాగ్రత్తగా అడుగుతీసి అడుగు వేస్తూ, చీమ చిటుకుమంటే, వెనక్కి తిరిగి పలాయనం చిత్తగించడానికి సిద్ధంగా, ఇంట్లోకి వెళ్లారు.

చుట్టూ పరిశీలించారు. కొద్దిసేపట్లో అక్కడి వస్తువులన్నీ వాళ్లకి పరిచయమయ్యాయి. ఇప్పుడు కొద్దిగా భయం తీరింది. తమ ధైర్యాన్ని చూసి తామే ఆశ్చర్యపడ్డారు; గర్వపడ్డారు కూడా. ఇక పై అంతస్తుకి కూడా వెళ్లి పరీక్షచేద్దామనుకున్నారు. మేడమీదికి వెడితే, ఎవరన్నా వస్తే పారిపోవటానికి వీలుండదు. అయినా తమ చెయ్యబోయే మహాకార్యానికి పైకి వెళ్లటంకూడా అవసరం.

అందుచేత తమ సాధనాలు ఒక మూల పడేసి, విరిగిపోయిన మెట్లమీద, కాళ్లు ఎత్తెత్తి తేలిగ్గా వేస్తూ ఎక్కారు. అక్కడ వస్తువులన్నీ చిందరవందరగా వున్నాయి. ఒక మూల అలమార కనిపించింది. అందులో ఏమైనా దొరకచ్చుననే ఆశతో గభాలున తెరిచి చూశారు. అందులో బొద్దింకలుతప్ప మరేమీ కనపడలేదు.

వాళ్లకి ఈపాటికి భయంపూర్తిగా తగ్గిపోయింది.

ఇక కిందకిపోయి పని ప్రారంభిద్దాం అనుకున్నారు. హఠాత్తుగా 'ష్' అన్నాడు టామ్.

"ఏమిటీ?" అన్నాడు హక్ మెల్లిగా.

"ష్! అదుగో-వినబడిందా?"

"ఆ! ఓయి బాబో! పారి పోదామా?"

"కదలకు. ష్! కింద తలుపు నెవరో తెరుస్తు న్నారు."

ఇద్దరూ వెంటనే చప్పుడు చెయ్యకుండా నేల మీద బోర్లా పడుకుని కంతలలోంచి కింద హాలులోకి చూశారు. వాళ్ళ గుండెలు రైలు ఇంజన్‌లా 'గుస్ గుస్' మంటున్నాయి.

ఇద్దరు వ్యక్తులు లోపలి కొచ్చారు. వాళ్ళలో ఒకణ్ణి టామ్, హక్ వెంటనే పోల్చారు. అతడు ఈమధ్యే కొత్తగా ఊళ్ళోకివచ్చిన స్పెయిన్ దేశస్థుడు. వాడు చెవిటి, మూగ కూడాను. ఆ రెండోవాడెవడో తెలియలేదు.

ఆ 'రెండోవాడు' చిరిగి, మాసిపోయిన గుడ్డలు కట్టుకున్నాడు. వాడి వేషం భయంకరంగా వుంది. స్పెయినువాడు ఒక దుప్పటి కప్పుకున్నాడు; తెల్లటి ఒత్తైన మీసాలున్నాయి. పచ్చటి కళ్లజోడు పెట్టు కున్నాడు. ఆ 'రెండోవాడు' ఏదో నెమ్మదిగా మాట్లాడుతున్నాడు. ఇద్దరూ లోపలికొచ్చి గోడ కాను కుని తలుపుకేసి చూస్తూ కూర్చున్నారు.

"నఖ్ఖు. నా కది ఇష్టంలేదు. అది అపాయ కరమని నాఉద్దేశ్యం" అన్నాడు రెండోవాడు.

"అపాయకరమా? నీ మొహం ను వ్వ్వారుకో," అన్నాడు స్పైయినువాడు.

ఆ మాటలువిని మేడమీాద టామ్, హాక్ ఉలికి పడ్డారు; వాళ్లిద్దరికీ మూర్ఛవచ్చినంతపని అయింది. స్పైయినువాడు మూగవాడు, చెవిటివాడు అను కున్నారు; వాడిప్పుడు శుభ్రభంగా మాట్లాడుతున్నాడు. అంతే కాదు, ఆ గొంతిక ఇంజన్‌జో గొంతిక.

"అక్కడ మనంచేసిన పనికంటే ఇది అపాయ కరం అంటావా? కాదు. ఏం ఫర్వాలేదు," అన్నాడు మళ్లీ ఇంజన్‌జో.

"అది వేరు. ఆచోటు నదికిబాగా ఎగువన వుంది. చుట్టుపట్ల ఒక్క ఇల్లుకూడా లేదక్కడ," అన్నాడు రెండోవాడు.

"అది సరే. ఇప్పుడు పట్టపగలు ఇక్కడికి రావటం అపాయకరం కాదా? మనను ఎవరైనా చూస్తే అనుమానించరూ?"

"నిజమే అనుకో. అయినా ఆపని చేసివచ్చే టప్పుడు ఇంతకంటే మంచిచోటు దొరకలేదు కనక ఇక్కడికొచ్చాము. అసలిదికూడా అపాయకరమే. ఇక్కడికి రాగూడదని నిన్ననే అనుకున్నా. ఆ ఎదురుగా మెట్టమీాద పిల్లలు ఆడుకుంటున్నారు నిన్న. వాళ్లు చూస్తేమన్ని వెంటనే గుర్తుపట్టే వారు."

"మెట్టమీద పిల్లలు" అనేమాట వినేసరికి టామ్, హాక్‌ల గుండెలు మళ్లీ ఝల్లుమన్నాయి. నిన్న అక్కడ వీళ్లకి కనిపించింది తామే నని, నిన్న శుక్ర వారమని, ఇక్కడికి తము రాకపోవటం చాలా మంచి దైందని అనుకున్నారు. అసలు ఇవ్వాళైనా ఎందుకు రావాలిక్కడికి. కనీసం ఏడాదైనా ఆగి వుండాల్సింది.

ఇంజన్ జో, ఆ రెండోవాడూ చేతిమూట విప్పి తెచ్చుకున్న తిండి తిన్నారు. తిండి పూర్తయ్యాక జో అన్నాడు,

"ఒరే అబ్బాయ్! నువ్వుపోయి నది ఎగువన పూర్వపు చోటులోనే వుండు; నేనోకసారి ఊళ్లోకి వెళ్లి పరిస్థితులన్నీ చూసి వస్తాను. తరవాత నువ్వు అపాయ కరమని భయపడుతున్నావే, ఆపని కాస్తా చేసేద్దాం. తరవాత టెక్సాస్ రాష్ట్రానికి ఉడాయిద్దాం. ఇక మన్ని దేవుడుకూడా పట్టుకో లేడు."

దీనికి రెండోవాడు అంగీకరించాడు. తరవాత ఇద్దరూ కాళ్లు సాచుకుని బద్ధకంగా ఆవలించారు.

"నాకు చచ్చే నిద్ర వస్తోంది. నువ్వు మేలుకుని కాపలా కాయి," అన్నాడు ఇంజన్ జో.

రెండు నిమిషాల్లో ఇంజన్ జో పంది మూలిగి నట్టు గుర్రుకొట్టడం మొదలెట్టాడు. రెండోవాడు కాస్సేపు అటూ, యిటూ చూశాడు. ఇంజన్ జోని లేపుదామని తట్టాడు కాని, వాడు లేవలేదు. రెండో

వాడుకూడా ఆవులించాడు; మరో నిమిషంలో వాడు కూడా గుర్రుకొట్టడం ప్రారంభించాడు.

పైన పిల్లలు "అమ్మయ్యా"అని నిట్టూర్పు విడిచారు.

"ఇదే సమయం, పారిపోదాం పద," అన్నాడు టామ్.

"నేను రాలేను. వాళ్లు లేచారంటే మన పని అయిందన్న మాటే," అన్నాడు హక్.

టామ్ ఎంత బతిమాలినా హక్ ఒప్పుకోలేదు. టామ్ ధైర్యంగా ఒక్కడే లేచి బయల్దేరాడు. అది బల్లచెక్కలతో కూర్చిన నేల అవటం మూలాన ఒక్క అడుగు వేశాడో లేదో 'కిర్రు' మంది. అంచేత వెంటనే మళ్లీ టామ్ బోర్లాపడుకున్నాడు కిక్కురు మనకుండా.

టామ్, హక్ సెకండ్లు లెక్క పెడుతున్నారు. కాలం ఆగిపోయినట్టు అనిపించింది. చివరి కెలాగైతే నేం సూర్యుడు అస్తమిస్తూ వుండటం చూసి, "అమ్మయ్య" అని మళ్ళీ నిట్టూర్చారు.

ఇంతలో ఒక గుర్రు ఆగిపోయింది. ఇంజన్ జో లేచి కూర్చున్నాడు. చుట్టూ తేరిపారచూసి కళ్లు నులుముకున్నాడు. పక్కన గుర్రు తీసే స్నేహితుణ్ణి చూసి, వెకిలిగా నవ్వి, కాలితో తన్ని లేపాడు.

"ఏమ్, లే లే. ఇదేనా నువ్వు కాపలా కాయటం? ఏమీ జరగలే దనుకో."

"అరే. నేను నిద్రపోయానా?"

"కొద్దిగానేలే. సరేగాని, మనకి మిగిలిన ఆకాస్త డబ్బూ ఏం చేద్దాం?"

"ఇక్కడే వుంచేద్దాం. టెక్సాస్ పోయేరోజు దాకా దాన్ని కదిలించవద్దు. ఆరువందల యాభై డాలర్లు మోసుకువెళ్ళటమంటే సామాన్యం కాదు," అన్నాడు రెండోవాడు.

"సరే నువ్వు చెప్పినట్టే చేద్దాం. ఇంకొక్కసారి ఇక్కడికి వచ్చినంతలో మనకి నష్టమేమీ లేదు."

"కాని,మనం రాత్రిపూట రావటమే మంచిది."

"అల్లాగే కాని ఇటు చూడు. మన డబ్బును కాస్త జాగ్రత్త చేసుకుందాం. బాగా లోతుగా పాతి పెడదాం. మన జాగ్రత్తమీద మనం ఉండాలిగా," అన్నాడు ఇంజన్ జో.

దీనికి రెండోవాడు అంగీకరించాడు. సరాసరి పొయ్యిదగ్గిరికి వెళ్ళి ఒక రాయి తొలగించి ఒక సంచీ తీశాడు. ఆసంచీ తీస్తుండగానే గలగల మోగింది. సంచీ విప్పి ఇరవయ్యో, ముప్ఫయ్యో డాలర్లు తనకీ, మరొక ఇరవై ముప్ఫయ్ డాలర్లు ఇంజన్ జోకి తీసుకున్నాడు.

జో తన పొడుగాటి కత్తితో ఒకచోట తవ్వుతున్నాడు డబ్బు పాతిపెట్టేందుకు.

ఇదంతా మేడమీదనుండి టామ్ హాక్ లు చూస్తూనే వున్నారు. డబ్బుసంచీని చూడగానే వాళ్ల కళ్లు మిలమిల మెరిశాయి. భయం, గియం ఎగిరి చక్కాపోయింది. ఆరువందల డాలర్లు అంటే కాస్త

కూస్త డబ్బా? దాంతో అరడజనుమంది పిల్లలు ధన వంతులు కావచ్చు. పైగా డబ్బుకోసం ఎక్కడ తవ్వాలి అన్న ప్రశ్నే లేదు. వాళ్ల కళ్లఎదురుగుండా ఇంజన్ జో పాతిపెడ్తున్నాడు.

ఇంతలో ఇంజన్ జో కత్తి నేలలో దేనికో తగిలింది.

"హెల్లో," అని అరిచాడు జో. "ఏమిటది?" అన్నాడు వాడి స్నేహితుడు.

"ఇదేదో వుందిక్కడ. పెట్టెలాగా వుంది. ఇట్రా చూద్దాం," అన్నాడు జో.

కత్తితో పెట్టెలో కన్నంచేసి, చెయ్యి పెట్టి లాగాడు. చేతిలోకి బంగారునాణెములు వచ్చాయి.

"అరెబాస్! డబ్బేరా ఇదంతా," అన్నాడు జో.

కింద పిల్లు, పైన వాళ్లుకూడా ఆశ్చర్యంతోనూ, సంతోషంతోనూ, ఊపిరిపీల్చటంకూడా మర్చిపోయి చూస్తున్నారు డబ్బుకేసి. జో స్నేహితు డన్నాడు:—

"మనం తొందరగా దీన్ని తవ్వి బయటకు తియ్యాలి. లోపల పొయ్యి దగ్గిర పార, పలుగు చూశాను ఇందాక. అవి పట్టుకొస్తా నాగు," అని గబగబ వెళ్ళి టూమ్, హాకీలు ఇందాక అక్కడ పెట్టిన పార, పలుగు తెచ్చాడు.

ఇంజన్ జో పారకేసి దీక్షగా చూశాడు. అటు తిప్పాడు, ఇటు తిప్పాడు; ఏదో గొణుక్కున్నాడు. రెండు నిమిషాల్లో పారసహాయంతో పెట్టెని తీశాడు బయటికి. అదేమంత పెద్ద పెట్టె కాదు. దానికి చుట్టూ

ఇనపబద్దలు కట్టివున్నాయి ఒకప్పుడు చాల బలమైనదే ఆపెట్టె. కాని, ఎన్నేళ్లనుంచి భూమిలో వుందో, ఇప్పుడు చెదలుపట్టి ఒక్క గుద్దుకు విరిగిపోయింది.

దాన్నిండా కొన్నివేల డాలర్లున్నాయి.

"మ్యురెల్ గాడి ముఠా ఇదివరలో ఎప్పుడూ ఈవేపునే తిరుగుతూవుండేదట," అన్నాడు రెండో వాడు.

"వాళ్లే పాతిపెట్టి వుంటారు యీ డబ్బు," అన్నాడు జో.

"ఇక ఇప్పుడు నువ్వు 'ఆ పని' చెయ్య నవసరం లేదనుకుంటా."

"ఇదిగో నీకు నాసంగతి తెలియదు. 'ఆ పని గూర్చి నీకసలే తెలియదు. కేవలం డబ్బు దొంగిలించడానికి కాదు 'ఆపని తలపెట్టింది; పగ తీర్చుకోటానికి. నువ్వు నాకు సహాయం చెయ్యాలి. తర్వాత టెక్సాస్‌కు పారిపోదాం. ఈలోగా నువ్వు మీయింటికిపో. నేను కబురు చేసినప్పుడు వద్దువుగాని," అన్నాడు జో.

"సరే, నీ యిష్టం. ఈ డబ్బు నేం చేద్దాం? పాతి పెడదామా మళ్లీ?"

"ఊఁ... (మేడమీద పరమసంతోషం) అహా వద్దు...(మేడమీద నిరాశ) మర్చేపోయా ఈ సంగతి. ఆ పారకి తడిమట్టి వుంది; యిందాక చూశాను. (టామ్, హాక్‌ల గుండెల్లో బండరాళ్లు) ఆపార, పలుగు ఎవరివి? ఇక్కడెందు కున్నాయి? ఆ తడిమట్టి ఎందు కుంది? అవి తెచ్చిన వాళ్లెక్కడికి పోయారు? ఆ మనుషు లెవరో

వచ్చి చూస్తారు. ఇక్కడ నేల కొత్తగా తవ్వినట్టు కని పిస్తుంది. కనక, అది మంచిది కాదు. దీన్ని నాతో తీసుకుపోతాను" అన్నాడు ఇంజన్ జో.

"అవును సుమా! నేనీ సంగతి నాలోచించనే లేదు. అయితే ఎక్కడ దాస్తావు నంబర్ ఒకటిలోనా, నంబర్ రెండులోనా?"

"నంబరు ఒకటి అందరికీ తెలిసిందే. నంబరు రెండులో 'శిలువ' కింద దాస్తాను."

"ఆల్ రైట్ చీకటిపడింది; పోదాం పద."

ఇంజన్ జో లేచి ప్రతికిటికీలోనుంచీ జాగ్రత్తగా బైటికి తొంగి చూశాడు.

"ఎవరు తెచ్చివుంటారు వాటిని? ఒకవేళ వాళ్లు మేడమీాద వున్నారేమో?"

టామ్, హాక్‌ల గుండెలు ఒక క్షణం ఆగి పోయాయి. భయంతో ముచ్చెమటలు పోశాయి.

ఇంజన్ జో కత్తితీసి పట్టుకున్నాడు. ఒక నిమి షం సేపు సందేహిస్తూ నుంచున్నాడు. చివరికి మెట్లెక్క డానికి బయల్దేరాడు. పిల్లలు ఎక్కడన్నా దాక్కుందా మనుకున్నారు. కాని, లేవడానికి బలం చాలక పడు కున్నవాళ్లు పడుకున్నట్టే వుండిపోయారు. మెట్లమీాద ఇంజన్ జో అడుగులు భయంకరంగా ధ్వనిస్తున్నాయి. ఆ అడుగులు తమ గుండెలమీాదే పడుతున్నట్టు అని పించింది. ఇక భరించలేక పక్కగదిలోకి పారిపోదా మనుకుంటున్నారు. ఇంతలోనే "ఫెళ ఫెళా" మని ఉరు

ములు ఉరిమినంత చప్పుడైంది. అసలే ఊగులాడుతూ చివికిచివికివున్న ఆపాతకొయ్యమెట్లు ఇంజన్‌జో బరువుకి ఆగలేక ఫెళ ఫెళమని విరిగిపోయాయి. గుమ్మడికాయ పడ్డట్టు జో నేలమీద పడ్డాడు. బూతులు తిట్టుకుంటూ లేచి వళ్లు దులుపుకున్నాడు. వాడి స్నేహితు డిలా గన్నాడు—

"ఎందుకూ యీ శ్రమంతా? మేడమీద ఎవ రన్నా ఉంటే ఉండనీ, మనతో పోట్లాటకి తయారవు తారా రానీ, ఇంకో పదిహేను నిమిషాల్లో బాగా చీకటిపడుతుంది. అప్పుడు వాళ్లు మన్ని వెంబడిస్తే వెంబ డించనీ. నా ఉద్దేశ్య మేమిటంటే, ఈచుట్టు పక్కల ఎవరన్నా మన్ని చూసివుంటే దయ్యాలనుకుని ఈ పాటికే పారిపోయి వుంటారు."

జో కాస్సేపు గొణిగాడు ఏదో. తరవాత ఇద్దరూ తమ వస్తువులు తీసుకుని మెల్లిగా ఇంటి ఇవ తలకొచ్చి నదికేసి నడిచిపోయారు.

టామ్, హాక్‌లు లేచారు. నీరసంగా వున్నారు. కాని, భయం మాత్రం పోయింది. సంజచీకట్లో నడిచి పోతున్న దొంగ లిద్దరికేసీ నిరాశతో చూశారు. వెంబ డించాలన్న ఆలోచన మానుకున్నారు. ఎల్లాగైతేనేం కష్టపడి మేడమీంచి కాళ్లుచేతులు విరక్కుండా దిగారు. ఆ పార, పలుగు అక్కడ పెట్టినందుకు తమ తెలివి తక్కువని తామే నిందించుకున్నారు. అవిగనక అక్కడ పెట్టివుండకపోతే ఇంజన్‌జో అనుమానించ

కుండా చూసుకొన్నట్టు డబ్బును ఇట్లా నే పాతిపెట్టేవాడు. మళ్ళీవచ్చి చూసుకునేసరికి ఏమీ కనుపించక గుండెలు బాదుకునేవాడు. ఛ! ఛా! ఆ పార, పలుగు ఎందుకు తెచ్చారు అక్కడికి?

పగ తీర్చుకోవటానికి మళ్ళీ ఒకసారి ఊళ్ళోకి వస్తా నన్నాడుగా ఇంజన్ జో. అందుచేత వాడిమీద ఒక కన్ను వేసి వుండటానికి, 'నంబర్ రెండు' ఏమిటో కనిపెట్టడానికి నిశ్చయించారు వాళ్ళు. ఇంతలో ఒక భయంకరమైన ఆలోచన తట్టింది టామ్‌కి.

"పగ! పగ అంటే మనమీదనే నేమో?" అన్నాడు.

"అయ్యో బాబోయ్! అయితే చచ్చామన్న మాటే," అన్నాడు హాక్. అతడికి మూర్ఛపర్యంతం అయింది.

ఇంజన్ జో పగబట్టింది తమమీద కాదనుకో టానికి ప్రయత్నించారు వాళ్ళు. కనీసం టామ్ ఒక్క డిమీదే పగ తీర్చుకోదలచాడేమో ననుకున్నారు. ఎందుకంటే హంతకుడిమీద సాక్ష్యమిచ్చింది టామ్ ఒక్కడేగా.

అంటే టామ్ ఒక్కడే ఇంజన్ జో అపాయంలో పడ్డాడన్నమాట. ఇది టామ్‌కి బొత్తిగా ఇష్టం లేదు. అపాయంలో నైనా మరొకడు తోడుగా వుంటే కాస్త ధైర్యంగా వుంటుంది.

ఇద్దరూ ఇళ్లకు చేరుకున్నారు. ఆరోజున తాము చేసిన సాహసకృత్యాల గడబిడతో వాళ్లకి నిద్ర సరిగా పట్టలేదు. టామ్‌కు అన్నీ పీడకలలే వచ్చాయి. కనీసం నాలుగుసార్లయినా 'గుప్తధనం' టామ్‌కు దొరికింది. కాని నాలుగుసార్లూ కళ్లు తెరచీ తెరవడంతో ఆ ధనంకాస్తా హరించుకుపోయి, వట్టిచేతులు మాత్రం మిగిలాయి.

తెల్లవారి లేచాక నిన్న జరిగిన విశేషాలన్నీ మరోలోకంలో జరిగినట్టు దూరమైపోయాయి. అందుచేత అదంతా కల అయివుండాలని టామ్ అనుకున్నాడు. అది కల అని చెప్పడానికి ఒక బలమైన కారణం వుంది. ఎందుకంటే టామ్ దృష్టిలో అన్నివేల డాలర్లు ఒక్కసారిగా మానవమాత్రుడికి కళ్లబడటం అసంభవం. అసలు అతడు యాభైడాలర్లుకూడా ఎప్పుడూ ఒకచోట చూడలేదు. అల్లాంటిది కొన్నివేల డాలర్లు కనిపించాయంటే ఎవరు నమ్ముతారు?

టామ్‌కి, అతనితోటి పిల్లలందరికిమల్లేనే డబ్బునుగూర్చి కొన్ని వింత ఊహలున్నాయి. పెద్దవాళ్లు 'వెయ్యిడాలర్లు' 'లక్షడాలర్లు' అనుకొంటుంటే విన్నప్పుడల్లా వాళ్లు ఊరికే సరదాకి అనుకొంటున్నారని అతని ఊహ. అన్నిడాలర్లు భూలోకంలో ఉండటానికి వీలే లేదని అతని వాదన. కనుక, నిన్న జరిగినదంతా కలే అయివుండాలని తీర్మానించుకున్నాడు.

కాని, అది నిజంగా కలేఅయితే మళ్ళీ మళ్ళీ

జ్ఞాపకానికివచ్చి ఎందుకు బాధపెడుతుంది? నిన్న జరిగిన విశేషాలు ఒకదానితరవాత ఒకటిగా టామ్‌కళ్ల ఎదుట నాట్యం చెయ్యసాగాయి. ఇక ఈ సందేహావస్థని భరించలేక అటో ఇటో తేల్చుకోవాలనుకున్నాడు, హక్ కోసం వెదికాడు.

హక్ నదఒడ్డున పడవలో కూర్చుని కాళ్లు నీళ్లలో పెట్టి గిలగిల కొట్టుకుంటున్నాడు. వాడి మొహంలో విచారం గూడుకట్టుకునివుంది. టామ్ తను ముందుగా అడగకూడదనీ, హక్ ముందుగా తనంత తానే ఆ విషయం ఎత్తితే సరే సరి లేకపోతే కలకిందే జమ కట్టాలనీ అనుకున్నాడు.

"హల్లో, హక్!" "హల్లో, టామ్!"

కాస్సేపు ఇద్దరూ మౌనం.

"టామ్! ఆ వెధవపార, పలుగు 'చచ్చిన చెట్టు' దగ్గరే వదిలేసి వెళితే ఎంత బాగుండిపోను? ఆ డబ్బు చేతికి చిక్కి—కూడా జారిపోయింది గదా!" అన్నాడు హక్.

టామ్:—"అయితే అది కల కాదన్నమాట. కల అయితేనే బావుండు ననిపిస్తోంది హక్!"

హక్:—"కలేమిటి?

టామ్:—" అదే నిన్న జరిగింది అంతా కలేమో ననుకున్నా."

హక్:—"కలా? ఏం తెలివైనవాడివిరా టామ్! ఆ మెట్లు సమయానికి విరగకుండావుంటే తెలిసేది

అది కలో నిజమో. రాత్రంతా ఆ చచ్చినవాడే వచ్చాడు కలల్లోకి.

టామ్:—"ఇంజన్‌జో చస్తే మనకేం లాభం? వాణ్ణి వెదికి కనుక్కోవాలి. ఆ డబ్బు ఎలాగైనా కొట్టెయ్యాలి."

హాక్—"మనం వాణ్ణి ఈ జన్మలో కనుక్కోలేం. డబ్బు అసలే దొరకదు. నిన్న మన చేతిదాకా వచ్చి జారిపోయింది. ఇక మళ్ళీ రాదు."

టామ్:—"ఏమైనా వాడెక్కడుంటాడో కనుక్కోవాలి. ఆ 'నంబర్ రెండు' ఎక్కడో తెలుసుకోవాలి."

హాక్:—"నంబర్ రెండు! ఆ అవును అదే. కాని ఎల్లా తెలుస్తుంది అదెక్కడో?"

టామ్:—"అది ఇంటి నంబరేమో?"

హాక్:—"ఈఊళ్లో ఇళ్లకి నంబర్లు లేవుగా."

టామ్:—"నంబర్లుంటే మన పని తేలికయ్యేది; వెధవప్రూరు. ఆగు, కాస్త ఆలోచించనీ—..ఆ, అది ఏదో గదినెంబరు; మన వూళ్లో హోటలులో గది కావచ్చు."

హాక్:—"కావచ్చు. ప్రయత్నించి చూద్దాం"

టామ్:—"నువిక్కడే ఉండు హాక్! నేను వెళ్లి చూశొస్తాను." టామ్ ఒక్కడే వెళ్లాడు. వీధుల్లో హాక్‌తో కలిసి అందరూ చూస్తుండగా తిరగటం టామ్

కిష్టంలేదు. అరగంటసేపైన తర్వాత తిరిగి వచ్చాడు. తను కనుక్కున్న విషయాలు హాక్‌కి చెప్పాడు.

ఊళ్లో రెండు హోటళ్లున్నాయి. ఒకటి పెద్దది. అందులో రెండో నంబరు గదిలో చాల రోజుల్నించి ఒక ప్లీడరు ఉంటున్నాడట. చిన్న హోటలుకి వెళ్లి కనుక్కోగా రెండో నంబరు గదిలో ఎవరో వుంటున్నారని తెలిసింది. కాని, ఆ మనిషి ఎవరో హోటలు యజమానికికూడా తెలియదట. ఎప్పుడూ గదికి తాళం వేసి వుంటుందట. రాత్రిళ్లుమాత్రం ఎవరో వస్తారట. లైటు కనిపిస్తుందిగాని, మనిషి కనిపించడట. అందుచేత ఆ గదిలో దెయ్యాలు తిరుగుతున్నాయని అనుకుంటున్నారట.

హాక్ ఈకథంతా నోరు తెరచుకుని ఆశ్చర్యపోతూ విన్నాడు. ఆ గదిలోనే ఇంజన్‌జో ఉంటున్నాడని ఇద్దరూ ఒక నిశ్చయానికి వచ్చారు. ఇక తరువాత కార్యక్రమ మేమిటీ అని ఇద్దరికీ సమస్య పట్టుకుంది.

## 14

టామ్ చాలాసేపు దీక్షగా ఆలోచించాడు. చివరి కిలా గన్నాడు:

"ఒకపని చేద్దాం. ఆ రెండో నంబరు గదికి ఒక దొడ్డితలుపువుంది. హోటలుకూ, ఇటికల దుకాణపు మొండిగోడలకూ మధ్య ఇరుకు సందులేదూ? ఆ సందువెంబడే వెడితే నంబర్ 2. దొడ్డితలుపును చేరుకో

వచ్చు. నువ్వు నీకు దొరికినన్ని తాళం చెవుల గుత్తులు తీసుకురా. నేను మా పెద్దమ్మ తాళంచెవులన్నీ ఎత్తు కొస్తాను. ఏరాత్రయితే కటిక చీకటిగా వుంటుందో, ఆ రాత్రే వెళ్ళి దొడ్డితలుపుగుండా లోపలికి దూరు దాం. ఇదిగో ఒక మాట. సగతీస్కోటానికి ఇంజన్‌జో ఊళ్లో సంచారం చేస్తానన్నాడు. వాడు కనిపిస్తేమాత్రం వదలకు; వెంటపడు. వాడు నంబర్ రెండులోకి వెడితే సరేసరి; లేకపోతే అది కాదన్నమాట."

"అమ్మో! నేను ఇంజన్‌జోని ఒక్కణ్ణే వెంబ డించలేను."

"హాక్! రాత్రిపూట చీకట్లో వెంబడిస్తే ఏం ఫర్వాలేదు. ఒకవేళ వాడు నిన్ను చూసినా ఏమీ అనుకోడు."

"సరే; బాగా చీకటిగా వుంటే వెంటపడతా. ఏమో తెలియదు ఎల్లా వుంటుందో, చూస్తాను."

"పందెం. నేనైతే చీకట్లో వాణ్ణి వెంబడించ గలను."

"అయితే వెడతానులే టామ్!"

"ఆ, అదీ మొగతన మంటే; అల్లాగుండాలి. భయపడబోకు హాక్! నేనున్నా నిన్ను రక్షించ టానికి."

* * * *

ఆ రాత్రి మన వీరు లిద్దరూ ఇంజన్‌జో అంతు కనుక్కోటానికి సిద్ధమయ్యారు. తొమ్మిదింటి దాకా

హోటలు చుట్టుపక్కలే తచ్చాడారు. ఒకళ్లు సందు మొగలోనూ, ఇంకొకళ్లు ఇంకొంచెం దూరంలోనూ, గస్తీతిరిగారు. సందులోకి ఎవరూ వెళ్లలేదు; అందులో నుంచి బయటికి ఎవరూ రాలేదు. అలాగే గదిలో నుంచి ఎవరూ ఇవతలకీ రాలేదు; లోనికీ పోలేదు.

ఆ రాత్రి అనుకూలంగా ఉండేటట్లే ఉన్నది. అందుచేత టామ్ ఇంటికి వెళ్ళిపోయాడు. చీకటి దట్టంగా ఉండేపక్షంలో హక్ వచ్చి 'మ్యావ్' మనాలి. వెంటనే టామ్ లేచి తాళంచెవుల గుత్తులతో సహా తయారవుతాడు. అది ఒడంబడిక.

కాని, దురదృష్టవశాత్తు ఆ రాత్రి వెన్నెల పుచ్చపువ్వులా కాసింది. అందుచేత కొంతసేపు హక్ కాపలా కాశాడు; చివరికి నిద్ర ఆపుకోలేక పన్నెండు గంటల వేళ ఒక ఖాళీపెట్టులో దూరి నిద్రపోయాడు.

మంగళ వారంనాడుకూడా అదృష్టం కలిసి రాలేదు. బుధవారమూ అంతే. గురువారం రాత్రి కొంచెం ఆశాచిహ్నాలు కనిపించాయి. అవను కనిపెట్టి టామ్, పెద్దమ్మ పాతలాంతరును సంగ్రహించి బయటికి వచ్చాడు. లైటు వెల్తురు కనబడకుండా దుప్పటి కప్పుకున్నాడు. లాంతరు ఆర్పి హక్ ఖాళీపెట్టులో దాచాడు. గస్తీ ప్రారంభమయింది. పదకొండు గంటలవేళ హోటలులోని లైట్లన్నీ ఆరిపోయాయి. ఇక చుట్టుపక్కల ఎక్కడా దీపమన్నమాటే లేదు. స్పెయిన్ దేశస్థుడి వేషంలోవున్న దౌర్భాగ్యుడెవరూ సందు

లోకి పోలేదు; ఇవతలకి రాలేదు. అంతా అనుకూలం గానేవుంది. గాఢాంధకారం రాజ్యం చేస్తోంది. అప్పు డప్పుడు దూరంగా ఉరుములమోత తప్ప మరే శబ్దమూ వినిపించటం లేదు.

షెడ్డులో లాంతరు వెలిగించాడు టామ్. దుప్పటి కప్పుకుని లోపల లాంతరు దాచాడు. మెల్లిగా ఇద్దరు యోధులు సందును సమీపించారు. సందు మొగలో హక్ కాపలా వున్నాడు. టామ్ సందులో ప్రవేశించాడు.

తరవాత కొన్ని నిముషాలు గడిచాయి. నిముషాలేమిటి? అవి యుగాలుగా కనిపించాయి ఒంట రిగా కాపలా కాస్తున్న హక్‌కి. పర్వతమంత బరువు గల ఆందోళన అతని గుండెలమీద కూర్చుంది. ఆ చీకట్లో దీపం కనిపిస్తే బావుండును; టామ్ ఇంకా బతికే వున్నాడని ధ్రువపడుతుంది. టామ్ వెళ్ళి చాలా గంటలై వుంటుంది. బహుశా మూర్ఛపోయి వుం టాడు; లేక చచ్చిపోయి వుండచ్చు. భయంవల్ల అతని గుండె 'బెలూన్' మల్లే టప్పుమని బద్దలై వూరు కుందేమో.

ఇల్లా ఆలోచిస్తూ హక్ తనకు తెలియకుండానే సందులోకి నడిచివచ్చి హోటలుకేసి వెడుతున్నాడు. చాలా భయంకరమైన ఆలోచనలు వస్తున్నాయి. ఏ నిమిషంలోనైనా ప్రళయంలాంటిది సంభవించవచ్చునని అనుమానిస్తున్నాడు. అతని గుండె కొట్టుకునే పద్ధతి

చూస్తే, అది రొమ్ము చీల్చుకుని ఊడిపడు తుందేమో ననిపించింది.

హఠాత్తుగా మెరుపు మెరిసినట్లు దీపం వెల్తురు. టామ్ పరుగెత్తుకొచ్చి హక్ మీద పడి,

"పారిపో! పారిపో బతికుంటే బలుసాకు తినచ్చు" అన్నాడు.

టామ్ ఈ రెండుముక్కలు అనేలోపలే హక్ కాలు జాడించాడు. గంటకి ముప్ఫయి, నలభై మైళ్ల వేగంతో పరుగు పుచ్చుకున్నాడు. ఊరిచివర కసాయి దుకాణపు షెడ్డు చేరిందాకా ఇద్దరూ పరుగు ఆపలేదు. షెడులోకి వచ్చి పడ్డారో లేదో, బ్రహ్మాండమైన తుపాను ప్రారంభమైంది. టామ్ కాస్త తేరుకోగానే ఇలా గన్నాడు:—

"హక్! ఏం చెప్పనురా........రెండు తాళం చెవులు పెట్టి ప్రయత్నించాను. ఎంత మెల్లిగా తిప్పానో! అయినా అవి గిరుమన్నాయి. బలే భయంవేసింది. తాళం రాలేదు. నాకు తెలియకుండానే గొళ్ళెం పట్టుకున్నాను. తలుపు ఇట్టే వచ్చేసింది. అసలు తాళం వేసి లేదు. నెమ్మదిగా లోపల కడుగుపెట్టాను. దుప్పటి తీసి వేశాను...వెంటనే వెయ్యిపిడుగులు పడినట్టయింది"

"ఏమిటి? ఏం జరిగింది. టామ్?"

"ఇంజన్ జో చేతిని దాదాపు తొక్కేశాను."

"నిజంగా?..."

"అక్కడ నేలమీద కాళ్ళు, చేతులు బారచాచుకుని కొండచిలవలా పడుకునిఉన్నాడు వాడు. బాగా, దిట్టంగా నిద్రపోతున్నాడు."

"బాప్ రే! నువ్వేం చేశావ్? వాడు లేచాడా?"

"ఊహుూ. బాగా తాగినట్టున్నాడు; లేవలేదు. ఆ దుప్పటి తీసుకుని పరుగెత్తుకొచ్చాను."

"నేనైతే ఆ దుప్పటిమాట మర్చిపోయి పారిపోయి వచ్చేసేవాణ్ణి."

"అది పోతే మా పెద్దమ్మ చర్మంవొలిచేస్తుంది."

"ఆ పెట్టె కనిపించిందా?"

"చుట్టూ చూసేదాకా నేను ఆగలేదు. పెట్టె కనిపించలేదు; "శిలువ" కనిపించలేదు. ఇంజన్‌జో పక్కన ఒక సీసా, రేకుగ్లాసు మాత్రం కనిపించాయి. రెండు పెద్ద పీపాలు, బోలెడు సీసాలు కూడా కనిపించాయి. ఆ గదిలో దెయ్యాలున్నట్టు హోటలువాళ్లు భయపడటానికి కారణం ఇప్పటికైనా తెలిసిందా?"

"తెలనలా."

"ఆ గదిలో విస్కీ దెయ్యాలున్నాయన్న మాట."

"కావచ్చు. కాని టామ్! ఇంజన్‌జో మత్తెక్కి పడుకునుంటే, ఇదే సమయం ఆ పెట్టె ఎత్తుకురావటానికి."

"అవును. నువ్వు మరి వెళ్లొస్తావా?"

హాక్ మోకాళ్లు గజగజ కొట్టుకున్నాయి.

"నేను వెళ్లలేను."

"నేనూ వెళ్లలేను. హక్! ఇంజన్ జో పక్కన ఒకటే సీసా ఉంది. కనీసం మూడు సీసాలైనా వుంటే గాని వాడికి మళ్లీ లేవలేనంత మత్తెక్కదు. అప్పుడు నేనొక్కణ్ణే వెళ్ళి పెట్టె ఎత్తుకొచ్చేవాణ్ణి."

కాసేపు మౌనంగా ఇద్దరూ దీర్ఘాలోచన చేశారు. టామ్ ఇలా అన్నాడు:—

"హక్! ఆ గదిలో ఇంజన్ జో ఉన్నంత కాలం మన మటుకేసి వెళ్లగూడదు. అది ప్రమాదం. ప్రతి రాత్రీ మనం కాపలా కాస్తే ఎప్పుడో ఒకప్పుడు వాడు అవతలికి వెళ్లటం చూస్తాం. అప్పుడు కన్ను మూసి కన్ను తెరిచేటంతలో పెట్టె నెత్తుకురాగలం."

"నేను ఒప్పుకుంటున్నా దానికి. ఈ రాత్రే కాదు, ప్రతిరాత్రీ—తెల్లవారేదాకా నేను గస్తీ తిరుగుతాను. ఆ మిగతా పనిమాత్రం నువ్వే చెయ్యాలి.

"ఆల్ రైట్! నువ్వు ఒక పని చెయ్యాలి. హూపర్ వీధికి వచ్చి "మ్యావ్" అనాలి. నే నింకా లేవకపోతే కిటికీమీద బెడ్డలు వెయ్యి. నేను చెంగున లేస్తాను. వాన వెలిసింది. నేను ఇంటికి పోతాను. ఇంక రెండు గంటల్లో తెల్లారుతుంది. ఈ రెండు గంటలూ నువ్వు కాపలా కాస్తావుకదూ?"

"టామ్! కాస్తానని అన్నాను. కాసి తీరుతాను. ఏడాదిదాకా ప్రతిరాత్రీ ఆ హోటల్ని చెయ్యంలాగా పట్టుకుని వదలను."

"సరే. కాని నీపడక ఎక్కడా?"

"బెన్ రోజర్సువాళ్ల గడ్డివామువాటున. నేనక్కడ పడుకున్నా బెన్ ఏమీ అనడు. వాళ్ల నీగ్రో నౌకరు జేక్ కూడా ఏమీ అనడు. జేక్ బలే మంచివాడు. అత నడిగినప్పుడల్లా నీళ్ళు మోసుకు తెచ్చి పెడుతూవుంటాను. నే నడిగినప్పుడల్లా తింటాని కేమన్నా పెడుతూవుంటాడు తనదగ్గిర వుంటే. నేనంటే అతని కిష్టం. ఎందుకంటే 'అతనికంటె గొప్ప వాణ్ణి' అని ఎప్పుడూ అనుకోను. అతను నీగ్రోఅయినా ఒకోసారి అతనితో కలిసి అన్నం తింటాను. లోపల ఆకలి మాడుస్తుంటే ఎంత గొప్ప మనిషైనా కొన్ని కొన్ని నీచపు పనులు చెయ్యాల్సి వస్తుంది."

"పగటిపూట పనేమీ లేకపోతే నువ్వు నీ యిష్టం వచ్చినంతసేపు పడుకో. నేను వచ్చి లేపను. రాత్రిళ్లు ఏమన్నా కనిపిస్తేమాత్రం వెంటనే వచ్చి "మ్యావ్" మనాలి. ఏం?"

శుక్రవారం పొద్దున నిద్రలేచీ లేవగానే టామ్‌కి ఒక గొప్ప శుభవార్త తెలిసింది. జడ్జి థాచర్ గారు పెళ్లాం బిడ్డలతోసహా విదేశాలనుంచి తిరిగివచ్చారు. వెంటనే ఇంజన్ జో గుప్తధనం వగైరాలన్నీ టామ్ మనస్సులో ఒక మూలకి నెట్టివేయబడ్డాయి. బెకీ థాచర్ ఆ ఖాళీ స్థలాన్నంతా ఆక్రమించు కుంది. బెకీని కలుసుకున్నాడు. మిగతా స్కూలుపిల్లల్తో కలిసి దాగుడు మూతలు మొదలైన ఆటలు చాలా సేపు ఆడారు.

బెకీ ఇదివరకు స్కూలు పిల్లలందర్నీ "పిక్ నిక్"కి తీసికెడతానని వాగ్దానం చేసిందికదూ. ఇప్పుడు వాళ్ళమ్మని వేధించుకుతింది, ఆ మర్నాడే 'పిక్ నిక్' కి పంపించ వలసిందని. బెకీ పోరుపడలేక వాళ్ళమ్మ ఒప్పుకుంది. ఇక బెకీ ఆనందం వర్ణించతరం కాదు. టామ్ కూడా తన సంతోషాన్ని దాచుకోలేదు. చీకటి పడకముందే అందరికీ ఆహ్వానాలు వెళ్లాయి. స్కూలు పిల్లలు వెంటనే 'పిక్ నిక్' ప్రయత్నాలు, ఏర్పాట్లు ప్రారంభిచారు. టామ్ సంతోషంతో ఉక్కిరి బిక్కిరై పోయి ఎంతసేపటికీ నిద్ర పోనేలేదు. హాక్ వచ్చి 'మ్యావ్' అంటాడేమోనని ఎదురు చూశాడు. ఎందుకంటే ఆ రాత్రి ఇంజన్ జో డబ్బును ఎత్తుకువచ్చి మర్నాడు బెకీని, మిగతా పిల్లల్ని ఆశ్చర్యంలో ముంచెయ్యాలని అతని ఆశ, కాని ఆ రాత్రి ఎలాంటి సిగ్నలూ రాలేదు.

ఎలాగైతే నేం తెల్లవారింది. పది, పదకొండు గంటలకల్లా జడ్జి థాచర్ గారి యింటివద్ద పిల్లల కోలాహలం చెలరేగిపోతోంది. పెద్దవాళ్లు కూడా వెడితే పిల్లలకి సరదా చస్తుందని బెకీ తల్లిదండ్రులు బయల్దేరలేదు. పిల్లలని పద్దెనిమిదేళ్ల ఆడపిల్లలు కొందరికీ, ఇరవై రెండు, ఇరవైమూడేళ్ల యువకులు కొందరికి అప్పచెప్పి 'భద్రంసుమా!' అని హెచ్చరించారు. నది దాటటానికి స్టీముబోటును అద్దెకు తీసుకున్నారు. తినుబండారాలు, ఇతర సామానులు చేతబట్టుకుని యాత్రికులు వీధుల్లో

ఊరేగింపు మళ్లే తర్లి వెళ్లారు. సిడ్‌కు వంట్లో బాగుండ నందున అతనికి ఈ అదృష్టం పోయింది. అతన్ని చూస్తూ వుండటానికి మేరీకూడా ఇంటివద్దే ఉండి పోయింది. బెకీ తల్లి ఇలా చెప్పింది:—

"బెకీ! ఈ రాత్రి నువ్వు ఇంటికి రావద్దు. రేవు దగ్గిరగావున్న స్నేహితుల యిళ్లల్లో ఎక్కడనా పడుకో. తెల్లవారిం తరవాత వద్దువుగాని."

"అయితే సుసీహార్పర్ వాళ్ల యింట్లో ఉంటా నమ్మా," అంద బెకీ.

"సరే. కాని జాగ్రత్తగా మసులుకో. ఎవ్వర్నీ ఇబ్బంది పెట్టకు."

కొంతదూరం పోయాక టామ్ బెకీతో ఇలా గన్నాడు:

"చూడు బెకీ! జోహార్పర్ ఇంటికి పోయే బదులు మనం డగ్లస్ అమ్మగారింటికి పోదాం. అక్కడ బలే బావుంటుంది. ఆవిడ మనకి ఐస్‌క్రీమ్ పెడుతుంది. ఆవిడ దగ్గిర ఎప్పుడు చూసినా తట్టలు తట్టలు ఐస్‌క్రీమ్ వుంటుంది. మన నావిడ బాగా ఆదరిస్తుందికూడా."

"రైట్. బలే సర్దాగా వుంటుంది...కాని అమ్మ ఏమన్నా అంటుందేమో?"

"మీ అమ్మకి ఈ సంగతి ఎలా తెలుస్తుంది?"

బెకీ కాస్త ఆలోచించింది.

"మనం అమ్మకి చెప్పకుండా పోవటం మంచిది కాదనుకుంటా."

"ఫరవాలేదు బెకీ! మీ అమ్మకి తెలియదుగా? నువ్వు క్షేమంగావుంటే ఎక్కడికెళ్ళినా ఆవిడ ఏమీ అనుకోదు. అసలు ఆవిడకీ ఆలోచన తట్టితే అక్కడకే వెళ్ళమనేది. పందెం."

డగ్లస్ అమ్మగారి అద్భుతమైన ఆతిథ్యం తలుచుకునేటప్పటికి బెకీకి నోరూరింది. అందువల్లనూ, టామ్ బలవంతంవల్లనూ బెకీ ఒప్పుకోక తప్పలేదు. కనుక, ఆ రాత్రి తమ కార్యక్రమాన్ని గూర్చి ఎవ్వరికీ చెప్పకూడదని నిశ్చయించుకున్నారు.

కాని హాక్ ఈరాత్రే వచ్చి సిగ్నల్ ఇస్తాడేమోనని టామ్ అనుమానించాడు. దీంతో కొంత సరదా చచ్చింది. అయినా అమ్మగారి ఇంట్లో జరగబోయే వేడుకలను వదలుకొనటానికి టామ్ ఇష్టపడలేదు. కాకపోయినా కిందటిరాత్రి ఎంత ఎదురు చూసినా హాక్ రాలేదు. ఈ రాత్రి మాత్రం వస్తాడని నమ్మకమేముంది? రాత్రికి తప్పకుండా రాగల వేడుకని వదులుకుని, వస్తుందో రాదో అనుమానంగా వున్న గుప్తధనంకోసం వెళ్ళటం ఏమి వివేకం?

స్టీమ్ పడవ పోయి పోయి గ్రామానికి మూడు మైళ్ళ దిగువనవున్న ఒక చోట లంగరు దింపింది. అక్కడ చాల అందమైన అరణ్యం వుంది. కొద్దిసేపట్లోనే జనసంచారం ఎరగని ఆ అడవి యావత్తూ మన యాత్రికుల నవ్వులతో, కేరింతలతో మారుమ్రోగింది. వళ్లు వేడెక్కి, అలిసిపోవటానికి ఎన్ని

మార్గాలున్నాయో అన్నీ పూర్తయాక వాళ్లు తిరిగి తమ క్యాంపుకు వచ్చారు. వెంటనే తినుబండారాల మీద యుద్ధం ప్రకటించారు. రొట్టెలు, మాంసం మొదలైన శత్రువులనందర్నీ ధ్వంసంచేసే శాక చెట్ల నీడల్లో తృప్తిగా కాళ్లు చాచుకుని, తాపీగా ఆవులించారు.

ఇంతలో ఎవరో అన్నారు:

"గుహకు వచ్చేవాళ్లెవరో చేతులెత్తండి."

అందరూ చేతులెత్తారు. కొవ్వొత్తులు కట్టలు కట్టలు చేతపుచ్చుకున్నారు. కొండ ఎక్కారు. గుహ ద్వారం కొండ కొంతఎత్తు ఎక్కితేగాని రాదు. ఆ ద్వారం ఇంగ్లీషు అక్షరం 'A' లాగా వుంటుంది. లోపలకి వెళ్లగానే ఒక గదిలాంటిది కని పిస్తుంది. అక్కడ మంచుమీద నిలబడినంత చల్లగా వుంది. చుట్టూ సున్నపురాళ్ల గోడలను ప్రకృతే కట్టి వుంచింది. గోడలు చెమటపట్టినట్టు తేమగావున్నాయి. ఆ కటిక చీకట్లో నుంచుని కింద మధ్యాహ్నపు ఎండలో తళతళలాడే పచ్చనిలోయను చూస్తుంటే చాలా తమాషాగావుంది. రెండు నిమిషాలు అలా నిశ్శబ్దంగా చూశారో లేదో, కోలాహలం ప్రారంభ మయింది. ఎవరో ఒకళ్లు కొవ్వొత్తి వెలిగించటం, మిగతావాళ్లు అతనిమీద పడి ఆర్పెయ్యటం; ఇదీ ఆట. ఈ ఆటలో ఉత్సాహంకూడా ఖర్చు కాగానే, అందరూ సందడిచేస్తూ గుహలోపల్లోపలికి నడిచారు. గుహ

మధ్యలో దాదాపు పది అడుగుల వెడల్పైన మార్గం వుంది. అది అంతకంతకి కొండఅడుగుకి పోతున్నట్టుంది. కొవ్వొత్తుల వెలుతురు కాంతికిరణం ఎప్పుడూ సోకి ఎరగని ఆ చీకటిగుహాని, అందులోని రహస్యాలని వెలిగిస్తున్నది. అరవై అడుగులదూరాన కలుసుకునే గోడలు కూడా స్పష్టంగా కనపిస్తున్నాయి. ప్రతి అయిదారు అడుగులకీ ప్రధాన మార్గంలోనుంచి చిన్న చిన్నసందులు లెక్కలేనన్ని చీలుతున్నాయి.

ఆ గుహా పేరు 'మెక్‌డుగాల్ గుహ.' అందులో ఎన్ని చిన్న చిన్న దారులు, రహస్య సొరంగాలు ఉన్నాయో చెప్పతరంగాదు. ఏ దోవన వెళ్లినా గుహాకి అంతం కనిపించదు. ఎన్నిరోజులు తిరిగినా దాని అవతల చివర కనిపించదని ప్రజలు చెప్పకుంటూ వుంటారు. పొరకింద' పొరగా పాతాళలోకంవరకూ వెళ్ళినా అ గుహాకి అంతంలేదు. ఎవ్వరికీ ఆ గుహానుగూర్చి తెలియదు. యువకుల్లో చాలామందికి, కొంత భాగం మాత్రమే తెలుసు. ఆ కొంతభాగం' దాటి అవతలకి వెళ్లటం ఆచారంలో లేదు. టామ్‌సాయర్‌కి కూడా యువకులకి తెలిసినంతా తెలుసు.

ఈవిధంగా ముప్పాతిక మైలుదాకా వాళ్లు నడిచారు. తరవాత కొందరు కొందరు ముఠాలుగానూ, జతలుగానూ చీలి పక్కదారుల్లోకి పోయారు. ఆదారులు కలిసే చోట మళ్లీ హఠాత్తుగా ఎదురుపడి "బా" అని ఒకరినొకరు జడిపించుకున్నారు. ఒక్కొక్కసారి

కొందరు అరగంట సేపటిదాకా కనిపించకుండా దాక్కొనిగేవాళ్లు. ఇదంతా ఆ 'తెలిసిన భాగం' లోనే జరిగింది.

క్రమంగా యాత్రికులు నవ్వుతూ, తుళ్లుతూ. ఆయాసపడుతూ గుహాద్వారాన్ని తిరిగి చేరుకున్నారు. బయటికి వచ్చి చూసుకునేటప్పటికి వాళ్లకి ఒళ్లంతా దుమ్ము, బూజు, గబ్బిలాల పెంటికలతో నిండిపోయి వుంది. గుహాలో ఉన్నంత సేపూ వాళ్లకి టైమ్ ఎంత జరిగిపోయిందో తెలియనే లేదు. బయటికి వచ్చి చూస్తే సూర్యాస్తమయం కావస్తున్నది. అయినా ఇంత వినోదంగా ఆ రోజు గడిపినందుకు అంతా సంతృప్తిపడ్డారు. వీళ్లకోసం పడవవాళ్లు అరగంటనించీ కాచుకు కూర్చున్నారు. పడవ నదిలో తిరుగు ప్రయాణం చేయసాగేసరికి ఎవ్వరూ కాలం వ్యర్థమైపోయిందని చింతపడలేదు, ఒక్క పడవ యజమాని తప్ప.

పడవ ఊరి పెద్దరేవు దగ్గిర ఆగకుండా ముందుకు పోయింది. ఆ ప్రాంతంలో అప్పటికే కాపలాకోసం వచ్చిన హాక్ ఈ పడవని చూశాడు. అది ఈ రేవుదగ్గిర ఎందుకు ఆగలేదో, అందులోఉన్న దెవరో అతని కర్థం కాలేదు. పడవలో యాత్రికులు తెగ అలిసి ఉంటంవల్ల కిక్కురుమనకుండా కూర్చున్నారు. పడవ సంగతి వదిలేసి హాక్ తన విధి తాను నిర్వర్తిస్తున్నాడు. దట్టంగా మబ్బులు పట్టి రాత్రి కారు

చీకటిగా వుంది. పదిగంట లయింది. వీధుల్లో జనసంచారం, దీపాల వెలుతురు తగ్గిపోయింది. మన ఒంటరి కాపలావాణ్ణి దెయ్యాలకి, నిశ్శబ్దానికి వదిలిపెట్టి గ్రామం నిద్రపోయింది. పదకొండు అయింది. హోటలు దీపాలు కూడా ఆరిపోయాయి. ఇప్పుడు ఎక్కడ చూసినా అంధకారమే.

హాక్ అలాగే ఎదురుచూస్తున్నాడు; కాని ఏమీ జరగలేదు. అతని నమ్మకం సడలిపోతోంది. ఈ కాపలావల్ల ఏమైనా ఉపయోగం వుందా ? నిజమైన ఉపయోగం ఏమైనావుందా ? ఈ వెధవకాపలా వదిలేసి పోయి పడుకుంటే?...

హఠాత్తుగా ఒక ధ్వని వినపడింది. హాక్ ఒళ్లంతా చెవులు చేసుకుని విన్నాడు. హోటలు సందులోని తలుపు నెమ్మదిగా తెరుచుకుంది. ఇటుకల దుకాణపు గోడచాటున దాక్కున్నాడు. మరో నిమిషంలో ఎవరో ఇద్దరు వ్యక్తులు అతన్ని రాసుకునేంత దగ్గరగా వెళ్లారు. ఒకడి చంకలో ఏదో వుంది... అది డబ్బుపెట్టె కావచ్చును. కనక ఆ డబ్బును ఎక్కడో మరోచోట దాస్తున్నారన్నమాట. ఇప్పుడు టామ్ కోసం పరిగెత్తటంవల్ల లాభమేముంది? ఈలోగా వాళ్లు ఎటో పోతారు; ఇక వాళ్లని పట్టుకోవటం దేవుడితరం కాదు. కాదు! తను వాళ్లని వెంబడిస్తాడు, చీకటిలో వాళ్లు తన్ను చూడలేరు.

పిల్లివలె అడుగులు వేస్తూ హాక్ వాళ్ళని అనుస రించాడు, కొంతదూరంలో.

వాళ్లు సందులు, గొందులు తిరిగి, చివరికి కార్డిఫ్ మెట్టకు పోయేదారినిపడ్డారు. మెట్టమీద వేల్సు దేశస్థుడొకని యిల్లువుంది. జంకూ, గొంకూ లేకుండా వాళ్లు ఆ యింటినికూడా దాటి ఇంకా పైకి ఎక్కారు. బలే బావుందనుకున్నాడు హాక్. కొంచెం ఎగువగా ఒక చిన్న కందకం వుంది. అందులో డబ్బు దాస్తారను కున్నాడు. కాని వాళ్లు దాన్ని దాటి ఇంకా పైకి పోయారు. ఎత్తుగా పెరిగివున్న పొదల మధ్య సందు గుండా పోయారు. ఆ తరవాత హఠాత్తుగా చప్పు డాగి పోయింది. హాక్ ఇంకాపైకి నడిచాడు. అతని కెవ్వరూ కనిపించలేదు. ఆగాడు. మళ్ళీ మెల్లిగా అడు గులు వేశాడు; హఠాత్తుగా మళ్ళీ ఆగాడు. అంతా నిశ్శబ్దం. తనగుండె కొట్టుకునే చప్పుడుతప్ప మరే శబ్దమూ లేదు. కొండకొసన ఒక గుడ్లగూబ అరిచింది. అడుగుల అలికిడి మాత్రం వినబడలేదు.

హారిన్నా! ఛాన్సు పోయినట్టేనా? ఉన్నట్టుండి వాళ్లేమయిపోయారు? గమ్మత్తుగా వుందే! వెనక్కి తిరిగి పారిపోదా మనుకున్నాడు. ఇంతలో అతనికి నాలుగు అడుగుల అవతలనుంచి దగ్గువినిపించింది. హాక్ గుండెకాయ ఎగిరినోట్లోకి వచ్చేసింది. కాని మళ్ళీదాన్ని మింగేశాడు. డజను మలేరియా జ్వరాలు ఒక్కసారి పట్టుకున్నట్టు వణికిపోతూ ఉన్నచోటే నిల

బడి పోయాడు. తను ఎక్కడ నుంచున్నాడో హాక్ కి తెలిసింది. డగ్లస్ అమ్మగారి ఇంటికి వెళ్లేదోవలో నుంచున్నాడు. అచ్ఛా, డబ్బు ఇక్క డెక్కడ పాతి పెట్టినా తేలిగ్గా కనుక్కోవచ్చు.

ఇంజన్ జో గొంతుక అతిమెల్లిగా వినిపించింది:

"దీని దుంప తెగిరి! ఇంకా మేలుకునే వున్నట్టుందే ఆమె? రాత్రి యింత పొద్దుపోయినా లైట్లు వెలుగుతూనే వున్నాయి."

"లైట్లు కనిపించవేం?"

ఈ రెండో గొంతిక దెయ్యాల ఇంట్లో కనిపించిన కొత్తవాడిది. మెరుపులాంటి ఆలోచన హాక్ మెదడులో మెరసింది. ఈ ఇద్దరు దొంగలూ అనుకున్న "పగ" ఇదేనన్నమాట. వెంటనే పారిపోవాలనుకున్నాడు. కాని డగ్లస్ అమ్మగారు ఎన్నోసార్లు తనపై చూపించిన దయ, ఆమె చేసిన ఉపకారాలు జ్ఞాపకం వచ్చాయి. వీళ్లు ఆమెని చంపబోతున్నారేమో? త్వరగా వెళ్ళి ఆమెను హెచ్చరిస్తే?...... ఉహూ వీళ్లు వచ్చి తన్ను పట్టుకోవచ్చు. ఇంజన్ జో మళ్ళీ సమాధానమిచ్చేలోపుగా హాక్ చాలా ఆలోచన చేశాడు.

"నీకు పొద అడ్డంగా వుంది. ఈ పక్కకి రా లైట్లు కనిపిస్తాయ్"

"ఆ. ఆ ఇంట్లో ఎవరో జనం ఉన్నట్టే వుంది. మానేద్దాంలే."

"మానేద్దామా? అందులో నేను ఈ దేశం శాశ్వతంగా విడిచిపోతుండగా "పగ" తీర్చుకోకుండా మానెయ్యటమా? ఇదుగో, నీతో ఒక మాట చెబుతా విను. ఆమె డబ్బు చిల్లిగవ్వకూడా నా కక్కర్లేదు. నువ్వు తీసుకో. ఆమె మొగుడు బతికున్నప్పుడు నన్ను చాలా బాధించాడు. అతను జడ్జీగ వున్నప్పుడు నన్నొకసారి గుర్రం కొరడాతో కొట్టించాడు. ఎక్కడనుకున్నావ్? జైలుముందు, అందరి ఎదుటా. కొరడాతో కొట్టించాడు! వింటున్నావా? అర్థమైందా నే చెప్పేది? కొరడాతో కొట్టించాడు! నేను "పగ" తీర్చుకోకుండానే చచ్చాడు. ఇప్పుడతని భార్య మీద నాపాతపగ సాధించకుండా వదలి పెడతానా?"

"వద్దు జో! ఆమెని చంపవద్దు."

"చంపటమా? చంపుతానని ఎవరన్నారు? అతనైతే చంపేసేవాణ్ణి. ఆమెని చంపను. ఆడదాని మీద పగతీర్చుకోవాలంటే చంపకూడదు. ముక్కులు, చెవులు కత్తిరించాలి."

"జో! చాలా ఘోరం అది...

"నోరు ముయ్. నీ సలహా నాకక్కర్లేదు. ఆమెను మంచానికి కట్టేస్తాను. చస్తే చావనీ. నువ్వు నాకు ఈ పనిలో తోడుపడాలి. అందుకే నిన్నిక్కడికి తీసుకొచ్చాను. నా కొక్కడికీ యీ పని కుదరదు. నువ్వు గనక కదిలావంటే చంపేస్తాను. నిన్ను చంపితే

దాన్నికూడా చంపాల్సివస్తుంది. ఇక తరవాత ఈ హత్యలు చేసినవాణ్ణి కనుక్కోవటానికి భూమి తలకిందులు కావసిందే! హుఁ!"

"సరే! చేసి తీరాలంటే నా అభ్యంతరం ఏమీ లేదు. కానీయ్. ఎంతదబ్బున చేసేస్తే అంతమంచిది."

"ఇప్పుడా? అక్కడ లైట్లు ఉండగానా? నీమీద నాకు అనుమానం కలుగుతోంది. జాగ్రత్త! హొ!... తొందర లేదు. దీపాలారనీ."

తరవాత నిశ్శబ్దం. ఆ నిశ్శబ్దం వాళ్ళ మాటల కంటే భయంకరంగా వుంది. హాక్ ఊపిరి బిగపట్టి వెనక్కి అడుగు వేశాడు. మరొక అడుగు వేశాడు. కాలికింద ఎండిన పుల్ల ఒకటి విరిగిన చప్పుడైంది. హాక్ పై ప్రాణాలు పైనే ఎగిరిపోయాయి. విన్నాడు; అలికిడి ఏమీ లేదు. అంటే వాళ్లు కదల్లేదన్నమాట. నెమ్మదిగా పొదల ఇవతలికి వచ్చాడు. ఇందాకటి చిన్న కందకాన్ని చేరుకున్నాడు. ఇక భయంలేదనుకున్నాడు. రివ్వున బాణంలాగా పరుగెత్తాడు కొండకిందకి. వేల్సు దేశస్థుడి ఇంటిముందుకి వచ్చేవరకూ దోవలో ఎక్కడా ఆగకుండా పరిగెత్తాడు.

# 15

హాకల్‌బెరీఫిన్ తలుపు దడ దడ తట్టాడు. వెంటనే వేల్సు దేశస్థుడు, యువకులు, బలిష్ఠులు అయిన అతని ఇద్దరు కొడుకులు కిటికీలోంచి మొహాలు బయట పెట్టారు.

"ఎవరక్కడ? ఏమిటా గోల? ఏం కావాలి?"

"నన్ను లోపలికి రానివ్వండి. తొందరగా. అన్నీ చెప్పేస్తాను."

"అసలెవరు నువ్వు?"

"హాకల్ బెరీఫిన్. తొందరగా తలుపు తియ్యండి."

"హాకల్ బెరీఫిన్? ఈ పేరు చెబితే తెరవబడే తలుపులు చాలా తక్కువ. అయినా లోపలికి రానియ్యండి సంగతేమిటో కనుక్కుందాం."

హాక్ లోపలికి వచ్చీరాగానే అన్నమాటలివ్వి:

"సార్! నేను చెప్పినట్టు మళ్ళీ ఎవరితోనూ చెప్పకండి. చెప్పకండి సార్! నన్ను చంపేస్తారు వాళ్లు. అమ్మగారు నా కెన్నోసార్లు ఉపకారం చేసింది. ఆవిడని......ఎవ్వరితోనూ చెప్పమని ఒట్టుపెట్టుకోండి"

"ఏదో ప్రమాదకరమైన విషయంలాగేవున్నది. హాక్! మేము ఎవ్వరితోనూ చెప్పం. త్వరగా చెప్పు అదేదో."

మరి మూడు నిమిషాల తరవాత వేల్సు దేశీయుడు, ఇద్దరు కొడుకులను వెంటబెట్టుకుని కొండ ఎక్కుతున్నాడు. పిస్టల్లు రెడీగా పెట్టుకుని బాటన వేళ్లే మీద నడుస్తూ పొదలమధ్య ఇరుకుదారిలో ప్రవేశించారు. హాక్ అక్కడదాకా వచ్చి ఆగిపోయాడు. ఒక పెద్ద రాతిబండ వెనక దాక్కుని వింటున్నాడు. కాస్సేపు

భయంకరమైన నిశ్శబ్దం...హఠాత్తుగా తుపాకుల మోత, ఒక కేక...

అదేమిటో తెలుసుకునేదాకా హాక్ ఆగలేదు.

అదిరిపడి ఒక దూకు దూకి కొండకిందకి శర వేగంతో పరుగెత్తాడు.

*   *   *

మర్నాడు ఆదివారం. ఇంకా తెల్లవారుతుండగానే హాక్ మెల్లిగా కొండ ఎక్కి వేల్సుదేశీయుని తలుపు తట్టాడు. లోపల అంతా నిద్రపోతున్నారు. కాని చీమ చిటుకుమంటే ఎగిరిపోయే నిద్రఅది. రాత్రి జరిగిన సంఘటనలమూలంగా వాళ్లు కలతనిద్ర పోతున్నారు. కిటికీ గుండా ఒక గొంతుక వినిపించింది.

"ఎవరది?"

హాక్ వణికే గొంతుకతో సమాధానమిచ్చాడు:

"నేనే సార్ హాక్ ఫిన్‌ని."

"ఈ పేరు చెబితే ఈ తలుపులు రాత్రిగాని, పగలుగాని ఎప్పుడైనా సరే తెరుచుకుంటాయి. రామ్మా, లోపలికి రా."

హాక్ తన జన్మలో ఎప్పుడూ ఇంత ప్రేమతో తన్ను ఆహ్వానించటం వినలేదు. అందులో ఆ చివరి మాటలు మరీ కొత్తగా వినిపించాయి. హాక్ వెళ్లి తన కోసం వెయ్యబడిన బల్లపీటమీద కూర్చున్నాడు

ముసలాయన, ఇద్దరు యువకులు దుస్తులు మార్చుకొంటున్నారు.

"అబ్బాయ్ నీకు బాగా ఆకలిగా వుందనుకుంటాను. పొద్దుపొడిచేసరికల్లా మనకి భోజనం తయారైపోతుంది. తరవాత 'గరమ్ గరమ్' పొగాకు కాలుద్దాం. కనక నువ్వు ఆ విషయమై గాబరాపడనవసరంలేదు. అసలు నువ్వు రాత్రే ఇక్కడికి వచ్చి పడుకుంటావేమో ననుకున్నాం."

"లేదు సాబ్. నాకు బలే భయంవేసింది. పిస్టలు మోత వినిపించగానే దౌడుతీశాను; మూడు మైళ్ల దాకా ఆగలేదు. రాత్రి ఏం జరిగిందో తెలుసుకోవాలని వచ్చాను. వెలుతురు వచ్చిన తర్వాతనైతే వాళ్లు కనిపిస్తారేమో నని చీకట్లోనే వచ్చేశాను. వాళ్ల శవాలను చూట్టానికి కూడా భయంగా వుంది." అన్నాడు హక్.

"పాపం రాత్రంతా నిద్రపోలేదల్లే వుంది. ఇప్పుడు తిండి కానిచ్చాక, ఇక్కడ పక్కవేస్తాం పడుకో. లే దబ్బాయ్! వాళ్లు చావలేదు. నువ్వు చెప్పినప్రకారంగా ఆ పొదల దారిలోకి వెళ్ళాం. సరిగ్గా వాళ్లకి పదిహేను అడుగుల దూరంలోకి వెళ్ళి ఆగాం. ఇంతలో—వెధవది...నాకు తుమ్ము వచ్చే సూచనలు కనిపించాయి. ఆపుకుందా మనుకున్నాను కాని లాభం లేకపోయింది. ఆపుకున్నందువల్ల మరీ బలంగా తుమ్మ్రవలసివచ్చింది. నేను పిస్టలు పట్టుకుని వీళ్లిద్దరి

ముందు నుంచున్నాను. నేను తుమ్మగానే ఆ దొంగ లిద్దరూ పారిపోవ ప్రయత్నించారు.

వెంటనే నేను "ఫైర్" అని కేకేశాను. వాళ్ల అలికిడి వినిపించిన చోట ముగ్గురం ఒక్కసారిగా పిస్టళ్లు పేల్చాం. కాని వాళ్లు తప్పించుకుపోయారు. అడవిలో చాలాదూరం వాళ్లని తరిమాం. వాళ్లు పారిపోతూ రెండు కాల్పులు కాల్చారు. కాని గుండ్లు మాకు తగ లేదు. వాళ్ల అలికిడి మాయంకాగానే మేము వెనక్కి తిరిగి కానిస్టేబిళ్లను లేపాము. వాళ్లు నదిఒడ్డున గస్తీ తిరుగుతున్నారు. తెల్లవారగానే అడవిలో గాలిస్తా మని పోలీసు అధికారి చెప్పాడు. మా ఇద్దరు అబ్బా యిలుకూడా అక్కడికి బయల్దేరబోతున్నారు. ఆ వెధ వలు ఎల్లా వుంటారో కాస్త ఆనవాళ్లు తెలిస్తే బాగుం డును. కాని నువ్వు చీకట్లో వెంబడించావు కదూ, నీకు తెలిసిఉండదు."

"కాదు సార్. నేను వాళ్లని ఊళ్లోనుంచే వెంబడించాను. వెలుతురులో కొద్దిగా కనిపించారు," అన్నాడు హాక్.

"అచ్ఛా. చెప్పు ఎల్లా వుంటారో."

"మన వూళ్లో ఈమధ్య రెండు మూడుసార్లు తిరిగిన చెవిటి, మూగ స్పెయిన్ దేశస్థుడు ఒకడు. రెండోవాడు చిరుగు గుడ్డలు కట్టుకుని దొంగచూపులు చూసుకుంటూ——"

"చాలు, చాలు. తెలిసిపోయింది. ఒకసారి అమ్మగారి యింటివెనక అడవిలో చూశాం; మమ్మల్ని చూసి వాళ్లు వెనక్కి వెనక్కి తగ్గారు. ఒరే అబ్బాయిలూ! రేపు పొద్దున భోంచేద్దురుగాని, ఉన్నపళంగా పరుగెత్తుకు వెళ్ళండి. పోలీసుఅధికారితో ఈ విషయం చెప్పండి."

యువకు లిద్దరూ తక్షణమే వెళ్లిపోయారు. వాళ్లు వాకిలి దాటుతుండగా హాక్ గభాలున లేచి,

"సార్! హాక్ఫిన్ ఈ సంగతులు మీతో చెప్పినట్లు బయటపెట్టకండి," అని వాళ్లని బతిమాలాడు.

"సరే, నీ యిష్టం. చెప్పవద్దంటే చెప్పం. కాని న్యాయంగా ఈ కీర్తి నీకు రావలసివుంది."

"వద్దండి వద్దు. చెప్పద్దు."

"చెప్పంలే. భయపడకు," అని వాళ్లు వెళ్లిపోయారు.

"వృద్ధుడు ఇలా గన్నాడు:

"వాళ్లు చెప్పరు; నేనుకూడా చెప్పను. కాని చెబితే వచ్చే నష్ట మేముంది?"

హాక్ సందేహించాడు చెప్పటానికి. ఆ దొంగ లిద్దరిలో ఒకణ్ణిగూర్చి తనకి చాలా విషయాలు తెలుసుననీ, తనకి తెలుసని ఆ దొంగకి తెలవటం తన కిష్టం లేదని చెప్పాడు. అంతకు మించి ఒక్క మాటకూడా హాక్ బయట పెట్టలేదు.

"అసలు వాళ్ళమీాద నీ కనుమానం ఎల్లా కలిగింది?"

హాక్ తను ఇవ్వబోయే సమాధానాన్ని కాస్సేపు లోపల ఆలోచించుకున్నాడు. తరవాత ఇలా గన్నాడు:

"నేను చాలా బీదవాడినని మీాకు తెలుసు. ఒక్కొక్కసారి నా దురదృష్టాన్ని గూర్చి ఆలోచించు కుంటే నాకు నిద్రకూడా పట్టదు. కిందటి రాత్రి అలాగే జరిగింది. నిద్రపట్టక అర్ధరాత్రివేళ లేచి బయల్దేరాను. 'టెంపరెన్స్' హోటలు పక్కన ఇటికల దుకాణందగ్గిరికి వచ్చేటప్పటికి, ఎవరో ఇద్దరు నా ఎదురుగా రావటం కనిపించింది. నేను గోడచాటుగా నక్కాను. ఒకడి చంకలో ఏదో వుంది. వాళ్లు ఎక్కడో దొంగతనం చేసి వస్తున్నారాప తే ననుకున్నాను. ఒకడు చుట్ట తాగుతున్నాడు. రెండో వాడికి నిప్పు కావల్సివచ్చింది. అందుకని నా ఎదురుగానే నిలిచి చుట్ట ముట్టించుకున్నాడు. చుట్టల వెలుతురులో ఒకడు చెవిటి, మూాగ స్పెయిన్ దేశస్థుడని గుర్తుపట్టాను. మరొకడు చిరిగి, మాసిన బట్టలు కట్టుకుని జుట్టు విరబోసుకుని పిశాచంలా వున్నాడు."

"చుట్టల వెల్తురులో వాడి బట్టలుకూడా కనిపించాయా నీకు?"

ఈ ప్రశ్నతో హాక్ కొంచెం తడబడ్డాడు.

"ఏమో కనిపించినట్టే అనుకున్నాను."

"ఊఁ. తరవాత వాళ్లు బయల్దేరారు..."

"అవును. నేను వెంటపడ్డాను. వాళ్ల ధోరణి చూసి అనుమానం పుట్టింది. వాళ్ల సంగతి కనుక్కో వాలనిపించింది. వాళ్లు అమ్మగారి ఇంటిదగ్గర్లో ఆగారు. చిరుగుగుడ్డల మనిషి అమ్మగార్ని చంపవద్దని బతిమా లాడు. స్పెయిను దేశస్థుడు ఆమె ముక్కు చెవులు మాత్రం కోసి వదిలిపెడతా నన్నాడు..."

"అరె. వాడు మూగవాడు, చెవిటివాడు అని అన్నావుగా?"

హక్ మళ్ళీ గొప్ప పొరపాటుచేశాడు. ఆ స్పెయిన్ దేశస్థు డెవడో వృద్ధుడికి తెలియకుండా దాచాలని హక్ ప్రయత్నం. కాని ఎంత జాగ్రత్తగా ఆలోచించి మాట్లాడుతున్నా అతని నాలిక ఆ రహ స్యాన్ని బయటపెట్టేసేస్తోంది. ఏదో విధంగా వృద్ధుడిని నమ్మించాలని చూశాడు. కాని కంగారువల్ల తప్పు తరవాత తప్పు నోటివెంట వచ్చింది.

వృద్ధుడు చివరి కిలా గన్నాడు :

"అబ్బాయ్! నువ్వు భయపడుతున్నావు అనవ సరంగా. నీ తలపై వెంట్రుకకుకూడా అపాయం రాకుండా చూసే పూచీ నాది. ఆ స్పెయిన్ వాడు మూగ, చెవిటి కాదు. అది నీ నోటివెంటే బయట పెట్టావ్. కనక దాన్ని నువ్వు కాదనలేవు. వాణ్ణి గురించి నీకు చాలా తెలుసు. దాన్ని దాచా లనుకుం

టున్నావ్. నా మాట నమ్ము. నిన్ను తప్పక రక్షి స్తాను. ఆ రహస్యం చెప్పు."

మంచితనం ఉట్టిపడే వృద్ధుడి కళ్లలోకి చూసి, హాక్ ధైర్యం తెచ్చుకున్నాడు. వృద్ధుడి చెవుల్లో మెల్లిగా చెప్పాడు :

"వాడు స్పెయిన్‌వాడు కాదు, ఇంజన్ జో!"

తుపాకిదెబ్బలాంటి ఆ ముక్కలు చెవిని పడేట ప్పటికి వృద్ధుడు కుర్చీలోంచి అదిరి లేచాడు. కాస్సే పటికి తమాయించుకుని,

"ఆ. ఇప్పటి కంతా అర్థమైంది. ముక్కు చెవులు కత్తిరిస్తా నన్నాడని ఇందాక నువ్వు చెప్పిన ప్పుడు నేను నమ్మలేదు. నువ్వు కలిపించి చెబుతున్నా వని అనుకున్నాను. ఎందుకంటే నాగరికులైన తెల్ల వాళ్లు అంత క్రూరంగా పగ తీర్చుకోరు. కాని ఇంజన్ జో!! వాడు ఎంతకైనా తెగిస్తాడు."

వేల్సు దేశీయుడు, హాక్ పొద్దుటి భోజనం కానిస్తూ ఈ విధంగా సంభాషణ సాగించారు. వృద్ధు డింకా ఇలా చెప్పాడు.

"నేను, మా అబ్బాయిలూ తెల్లవారుకట్ల పడు కోబోయేముందు మళ్లీ లాంతరు పుచ్చుకుని అమ్మ గారి ఇంటివేపు వెళ్లాం. ఆ ప్రాంతంలో నెత్తురుమరక లేమన్నా కనిపిస్తాయేమో నని వెదికాం. కాని ఒక పెద్ద మూటమాత్రం కనిపించింది..."

"ఏమి టది?"

నలభై మైళ్ళ వేగంతో ఆ నాలుగక్షరాలూ హాక్ నోటినుంచి బయటికొచ్చాయి. అతని ఊపిరి ఆగిపోయింది. కళ్లు పెద్దవిచేసి నోరు తెరుచుకునే వుండి పోయాడు, "ఏమిటది?" అనే ఆ ప్రశ్నకి వృద్ధుడు అదిరి పడి హాక్ వేపు తేరిపారచూశాడు. రెండు సెకండ్లు... మూడు సెకండ్లు... నాలుగు... అయిదు... పది...

"దొంగల దగ్గిర వుండే పనిముట్లుమాత్రం వున్నాయి అందులో... ఏం? ఎందుకంత కంగారుపడ్డావు?"

హాక్ నిట్టూర్పులు విడుస్తూ "అమ్మయ్య" అన్నట్టు నిశ్చింతగా మళ్లీ కూర్చున్నాడు. వృద్ధుడు అతనివేపు ఆశ్చర్యంగా చూస్తూ.

"అవును. దొంగల పనిముట్లు తప్ప మరేమీ లేవు. ఏమిటంతగాబరా పడ్డావు? అందులో ఏమున్నాయని అనుకున్నావు?" అని అడిగాడు.

ఈ ప్రశ్నలతో హాక్ మరీ ఇరుకున పడ్డాడు. వృద్ధుడి వాడిచూపులు అతని గుండెల్లోపలికి గుచ్చుకుంటున్నాయి. లోపల రహస్యాలని వెదుకుతున్నట్టు గుండెని కెలుకుతున్నాయి. ఏమి సమాధాన మివ్వాలో హాక్‌కి తోచలేదు. చివరికి ఒక చెత్తసమాధానం తట్టింది. అది ఆయన నమ్ముతాడో లేదో ఆలోచించ టానికి కూడా హాక్‌కి వ్యవధి లేదు. అందుకని నీరసంగా అనేశాడు;

"స్కూలు పుస్తకాలున్నాయేమో నను కున్నా."

తన సమాధానానికి తనకే నవ్వు వచ్చింది; కాని నవ్వే ఓపిక లేదు. ముసలాయన మాత్రం 'హాహ్హాహ్హా' అని భీకరంగా వచ్చినంత ఉపద్రవంగా నవ్వాడు. శరీరం, బయటి అవయవాలూ, లోపలి భాగాలు నగైరాలూ వేటికవి ఊడి పడిపోతాయేమో నన్నంత ప్రళయంగా నవ్వాడు. పైగా, ఆ విధంగా నవ్వటం చాలా ఆరోగ్యకరమనీ, డాక్టరుకు సమర్పించుకో వలసిన బిల్లుల మొత్తం తగ్గుతుందని హక్‌కి ఉపదేశం చేశాడు. ఇంకా ఇలాగన్నాడు:

"నీకు వంట్లో బాగుండలేదు. మొహం చూడు, ఎల్లా పాలిపోయి నీరసంగా వుందో? అంచేతనే నీకు మనస్సుకూడా తిన్నగా లేదు. కాస్త నిద్రపోయి విశ్రాంతి తీసుకుంటే సర్దుకుంటుంది."

హక్‌కి తను అంత తెలివితక్కువగా ప్రవర్తించినందుకు తనమీద తనకే కోపం వచ్చింది. అసలు కిందటిరాత్రి దొంగల సంభాషణ వినగానే వాళ్ల చంక లోని మూటడబ్బు మూట కాదని అనుకున్నాడు. కాని ఖచ్చితంగా తెలియదు కనుక ఇంకా సందేహంలోనే ఊగులాడుతున్నాడు. వృద్ధుడు "మూటదొరికిం" దన గానే డబ్బుమూటే అయివుండాలని కంగారుపడ్డాడు.

అయితే మొత్తానికి అంతా సరిగానే వున్నట్టు తృప్తి కలిగింది. ఆ మూట "అసలు మూట" కాదని నిశ్చయమైంది. అది ఇంకా నంబర్ 2. లోనే వుండి ఉండాలి, ఈరోజున ఇంజన్‌జో, వాడి స్నేహితుడు

తప్పకుండా అరెస్టవుతారు. కనక ఈరాత్రే తనూ, టామ్ వెళ్లి డబ్బు ఎత్తుకు వస్తాగు. ఈ ఆలోచనలతో చాలా హాయి అనుభవించాడు హాక్.

పొద్దుటి భోజనం ముగిసే సమయంలో తలుపు ఎవరో తట్టారు. హాక్ ఎగిరి లేచి ఒకమూల దాక్కున్నాడు. రాత్రి సంఘటనతో తనకు సంబంధ మున్నదని మరోప్పటికైనా తెలియటం హాక్ కిష్టంలేదు.

వేల్సు దేశీయుడు తలుపు తెరిచాడు- బిలబిల మంటూ చాలామంది ఆడవాళ్లు, పెద్దమనుషులు లోపలికి వచ్చారు. వాళ్లలో డగ్లస్ అమ్మగారు కూడా ఉన్నది. ఇంకా ఊళ్లో జనం చాలామంది కొండపైకి ఎక్కుతున్నారు రాత్రి సంఘటన జరిగిన చోటు చూడ్డానికి. వార్త ఊరంతా వ్యాపించిం దన్నమాట.

వృద్ధుడు వచ్చిన అతిథులకి రాత్రి జరిగిన విశేషా లన్నీ ఏకరువు పెట్టాడు. అమ్మగారు తన్ను రక్షించినందుకు 'మీ ఋణం తీర్చుకోలే' నంది.

"అమ్మగారూ! అలా గనకండి. మా కర్తవ్యం మేము చేశాము. కాని మీరు నిజంగా కృతజ్ఞత చూపవలసింది నాకూ, మా అబ్బాయిలకూ కాదు. మరొకడున్నాడు, అయితే అతను బయటపడటాని కిష్టపడటంలేదు. అతను చెప్పకపోతే మేము రాత్రిఅక్కడికి వచ్చివుండే వాళ్లంకాదు," అని వృద్ధు డన్నాడు.

దీంతో ఆ అతిథిబృందంలో చెలరేగినకుతూహాలం చెప్పశక్యంకాదు. "ఎవరు? ఆ మని షెవరు

చెప్పండి" అని కొన్ని వేల సార్లైనా వృద్ధుడిని అడిగివుంటారు. కాని వృద్ధుడుమాత్రం గప్‌చుప్‌గా వుండిపోయాడు.

అమ్మగారిలాగంది: "నేను రాత్రి నాయింటి శైటు అంత రభస జరుగుతున్నా సుఖనిద్ర పోతూనే వున్నాను. మీరు నన్నెందుకు లేపలేదు."

"అనవసర మని భావించాము. వాళ్లు మళ్ళీ తిరిగి రారనీ, వచ్చినా వాళ్లకి పనిముట్లు లేవనీ నిశ్చయించుకున్నాము. అటువంటప్పుడు మిమ్మల్ని అంత రాత్రివేళ లేపి, ఈ గొడవ చెప్పి భయపెట్టడం దేనికీ అని ఆలోచించాము. పైగా, తతిమ్మా రాత్రిఅంతా నాముగ్గురు నీగ్రో నౌకర్లని మీ ఇంటిదగ్గర కాపలా పెట్టాను. వాళ్లు ఇంతకు ముందే తిరగి వచ్చారు."

ఈలోగా మరి కొందరు గ్రామస్థులు వచ్చారు. వాళ్లకి మళ్ళీ కథంతా చెప్పవలసి వచ్చింది. మరి రెండు గంటలసేపుదాకా "రెడ్‌వెల్చ్ మొదలాడమన్నట్టు" చెప్పిన కథే చెప్పటం జరిగింది.

ఆదోజున చర్చిలో ప్రార్థనలకి జనం చేరుకొనే సమయానికి ఈవార్త తెలియని పిల్లవాడు కూడా లేడంటే అతిశయోక్తి కాదు. దొంగ లిద్దరూ ఇంకా పట్టుబడ లేదని తాజావార్తలు వచ్చాయి.

ప్రార్థనలతర్వాత జనం ఇళ్ళకు తిరిగిపోతున్నారు. జడ్జి థాచర్‌గారి భార్య, జోహార్పర్ తల్లిని ఒక పక్కకి పిలిచి,

"ఏమమ్మా! మా బెకీ ఇంకా నిద్రపోతూనే వుందా? పాపం చిన్న 'పిక్నిక్' తో బాగా అలిసిపోయినట్టుంది పిల్ల."

"నే నెరగనమ్మా మీా బెకీసంగతి."

"ఏమిటి, రాత్రి మీాఇంట్లో పడుకోలేదూ మా బెకీ ?"

"ఊహూ. లేదు."

బెకీఅమ్మ ఉలిక్కిపడింది. ఆమె మొహంలో కత్తివాటుకైనా నెత్తురు లేదు.

ఇంతలో ఆ వేపుకి పోలీపెద్దమ్మ వచ్చింది. ఆమె ఇలా అంది.

"ఏమర్రా కులాసాగా వున్నారా? మా టామ్ గాడు మీా ఇద్దరిళ్లల్లో ఎక్కడ పడుకున్నాడు? చూడండి, పొద్దున్నే లేచి చర్చికి రావచ్చా? రాలేదు. ఎక్కడికి పోయాడో ఏమిటో? ఇవ్వాళ వాడి భరతం పడతాను."

శ్రీమతి థాచర్ ఇంకా తెల్లబోయింది. తల కాయ అడ్డంగా వూపింది.

"లేదమ్మా. మీావాడు మాయింటికి రానే లేదు," అని జోహార్పర్ తల్లి అంది. పోలీపెద్దమ్మకి కంగారెక్కువైంది.

"జోహార్పర్! మా టామ్ ఇవ్వాళ పొద్దున కనిపించాడా?"

"లేదండీ."

"నీకు వాడు ఆఖరుసారి ఎప్పుడు కనిపించాడు?"

జో ఆలోచించాడు. కాని నిశ్చయంగా ఏమీ చెప్పలేక పోయాడు. 'పిక్నిక్'కి వెళ్లిన వాళ్లలో ఎవరూ టామ్ బెకీల ఆచూకీ చెప్పలేక పోయారు. వాళ్లు తప్పిపోయినట్టే స్థిరపడింది.

ఈ భయంకరవార్త నోటినుంచి నోటికీ, గుంపు నుంచి గుంపుకీ, వీధినుంచి వీధికీ అగ్ని ప్రమాదం లాగా పాకిపోయింది. మరో అయిదు నిమిషాల్లో చర్చి గంటలు గణగణ వెర్రిగా మోగటం మొదలెట్టాయి. పట్టణమంతా అట్టుడికినట్టు ఉడికిపోయింది. గతరాత్రి అమ్మగారి ఇంటివెనక జరిగిన సంఘటన మరుపు తెర లమాటున మరుగుపడింది. వెంటనే గుర్రాలు సిద్ధమయ్యాయి. పడవలు రెడీ అయ్యాయి. అరగంటకల్లా రెండువందలమంది జనం వెర్రి ఆవేశంతో నదిమీద బయల్దేరారు గుహ కేసి.

ఆ దీర్ఘ మధ్యాహ్నమంతా గ్రామం శ్మశాన వాటికవలె నిశ్శబ్దంగా కూర్చుంది. పోలీ పెద్దమ్మ ఇంటికీ, శ్రీమతి థాచర్ ఇంటికీ ఆడవాళ్లు మూగి ఓదార్చటం ప్రారంభించారు. ఆ రోజురాత్రి కూడా గుహనుండి వర్తమానంకోసం ఎదురు చూశారు. తెల్ల వారింది. వార్తవచ్చింది. ఏమని? "ఇంకా కొవ్వొత్తులు, ఆహారసామగ్రి పంపవలిసిం" దని. శ్రీమతి థాచర్‌కు దాదాపు మతి చెడిపోయింది. పోలీపెద్ద మ్మకి వెర్రిచూపులు పడ్డాయి. జడ్జిథాచర్‌గారు గుహ

నుంచి ఆశాజనకంగా వర్తమానం పంపించారు. కాని ఆవార్త ఎవరిలోనూ ఆశకలిగించ లేదు.

వేల్సు దేశీయుడు తెల్లవారే వేళ గుహనుండి ఇంటికి తిరిగొచ్చాడు. అతని ఒళ్ళంతా కొవ్వొత్తుల మసి, బూజు, దుమ్ము. లోపలికి వచ్చి చూస్తే నిన్న ననగా మంచంమీద పడుకున్న హక్ ఇంకా అలాగే పడుకున్నాడు. ఒళ్లు సలసల కాగిపోతోంది. సంధించిందకూడా. డాక్టర్లందరూ గుహవద్దనేఉన్నారు. అందుచేత డగ్లస్ అమ్మగారు వచ్చి స్వయంగా రోగికి పరిచర్యలు చేస్తోంది. హక్ మంచివాడైనా, చెడ్డవాడైనా దేవుని సంతానం కనుక అతన్ని సేవించ వలసిన విధి తనమీద వున్నదని ఆవిడ చెప్పింది.

పది, పదకొండు గంటలకి అలిసిపోయి విసిగి నీరసించిన జనం గుహనుంచి తూలుతూ, తూలుతూ, ఇళ్లకి చేరుకున్నారు. కాని ఓపికవున్న దృఢకాయులు గుహని ఇంకా వెదుకుతూనే వున్నారు. తిరిగి వచ్చినవాళ్లని అడిగితే ఇలా చెప్పారు: గుహలో ప్రతిమూల మూలనీ వదలిపెట్టకుండా వెదుకుతున్నారు. పిల్లలిద్దరూ వినేందుకుగాను పిస్టళ్లు పేలుస్తున్నారు. ఒకచోట, అంటే, పిక్నిక్ వాళ్లెవరూ పోని ఒక దూరపు చోట,

"బెకీ—టామ్" అని కొవ్వొత్తి మసితో అక్షరాలు రాయబడి వున్నాయి. దాని పక్కన ఒకరిబ్బను కనిపించింది. అప్పుడప్పుడు దూరంగా వెలుగు కని

పిస్తుంది. "ఆ దొరికారు" అని సంతోషంతో, దగ్గరికి వెడితే అక్కడ తమలాగే వెదుకుతున్న మనిషి కని పిస్తాడు. ఎంత వెదికినా పిల్లలు కనిపించటంలేదు.

గుహాలో దొరికిన రిబ్బన్ చూసి శ్రీమతి థాచర్ దుఃఖం ఆపుకోలేక పోయింది. ప్రేమతో దాన్ని ముద్దు లాడింది. బెకీని జ్ఞాపకం ఉంచుకోవటానికి మిగిలిన చిహ్నం ఇదొక్కటే నంది.

ఈ విధంగా దుఃఖమయమైన మూడు పగళ్లు, రాత్రులు గడిచాయి. గంటలు బరువెక్కి కదలలేక కదలలేక గడిచాయి. యావన్మందిజనం దురదృష్ట వంతులైన టామ్, బెకీలకోసం ఏడ్చారు. 'టెంపరెన్సు' హోటలు యజమాని తన హోటలులో భోషెడు సారాయి దాచి వ్యాపారం చేస్తున్నట్లు అధికారులు కనుక్కున్నారు. మామూలురోజుల్లో అయితే ఈ విష యంమీద ప్రజలు పెద్ద అలజడి జరిపేవారు. కాని ఇప్పుడు దాన్ని ఎవరూ పట్టించుకోనే లేదు.

హక్ కాస్త నిమ్మళంగా వున్నరోజున మెల్లిగా హోటళ్ల ప్రస్తావన తెచ్చాడు. ఆ మాటా, యీమాటా అడుగుతూ, తను మంచాన పడ్డతర్వాత 'టెంపరెన్సు' హోటలులో ఏమన్నా దొరికిందా, అని అడిగాడు.

"ఆ" అన్నది అమ్మగారు.

హక్ హడలిపోయి లేచి కూర్చున్నాడు పక్క మీద: "ఏమి దొరికింది?" అన్నాడు.

"సారాయి. ఏమిటల్లా గాబరాపడతావ్?... ఆహోటలు మూసేశారు పోలీసులు."

"ఒక్క విషయం చెప్పండి. ఒక్కటే. టామ్ సాయరేనా అది కనుక్కుంది?"

అమ్మగారు కన్నీళ్లు ఆపుకోలేక పోయింది "ష్. ష్. నువ్వు అట్టే మాట్లాడకూడదని చెప్పలా. పడుకోమ్మా. నువ్వుచాలా బలహీనంగా వున్నావు."

కనక సారాయితప్ప మరేమీ దొరకలేదన్న మాట. డబ్బే దొరికివుంటే పెద్ద కోలాహాలం, రభస జరిగేదే. కనక ఆ డబ్బు శాశ్వతంగా మాయమై పోయిందన్నమాట... శాశ్వతంగా... కాని అమ్మగారు ఎందుకల్లా ఏడుస్తుంది? ఆశ్చర్యంగా వుందే!

ఈ ఆలోచనలతో హాక్ మనస్సు బరువెక్కింది. క్రమంగా ఆ బరువుక్రిందపడి నిద్రపోయాడు. అమ్మగారు ఇలా అనుకుంది:

"నిద్రపోతున్నాడు పాపం. టామ్‌సాయరేనా కనుక్కుంది, అని అడిగాడు. కాని టామ్‌సాయర్ నే కనుక్కోవలసిన స్థితి వచ్చిందని తెలియదు. ఆ పిల్లలు దొరుకుతారనే ఆశ ఎవరికీ లేదు. వాళ్లని వెదికే ఓపిక వున్నవాళ్లుకూడా అట్టేమంది లేరు. పాపం!" అని నిట్టూర్పు విడిచింది.

## 16

ఇక టామ్, బెకీల పరిస్థితిని కాస్త పరిశీలిద్దాం. మిగతా యాత్రికులతోపాటు వాళ్లు కూడా గుహ

లోని చీకటిదారుల్లో నడుస్తూ, అక్కడి వింతల్ని చూసి ఆశ్చర్యపోతూ గడిపారు.

"ఇది హాలు," "ఇది చర్చి," "ఇది అల్లాడిన్ భవనం" అని ఒక్కొక్క చోట ఒక్కొక్క "ముద్దు పేరు" పెట్టుకుంటూ తిరిగారు.

ఇంతలోకే దాగుడుమూతలు ప్రారంభ మయ్యాయి. అందరితోపాటు టామ్, బెకీలు కూడా దాగుడుమూత లాడారు. బాగా అలిసిపోయిన తర్వాత కొవ్వొత్తులు ఎత్తిపట్టుకుని దోవలో గోడల మీద పేర్లు చదువుకుంటూ లోపలికి నడిచారు. ఎప్పుడో, ఎవరో రాసిన పేర్లు, తేదీలు, అడ్రసులు నీతిసూత్రాలు ఇంకా ఏవేవో రాతలు చాలా కని పించాయి. ఇవన్నీ కొవ్వొత్తుల మసితో రాయ బడినవే.

అలా మాట్లాడుకుంటూ, నవ్వుకుంటూ ఇద్దరూ కొంతసేపటికి ఒక ప్రదేశాన్ని చేరుకున్నారు. అక్కడి గోడలమీద ఎలాంటి రాతలూ లేవు. అది మనుష్య మాత్రు డెవరో ఇప్పటిదాకా తొక్కి ఎరగని ప్రదేశ మని వారికి తెలియదు. ఒకచోట కొవ్వొత్తితో "బెకీ-టామ్" అని పేర్లు రాశారు. ఇంకా ముందుకు పోయారు. జలజల మని మృదువైన సంగీతం ధ్వనిస్తూ సన్నని సెలయేరు కనిపించింది. ఆ ప్రవాహం ఒక ఎత్తైన రాతిపలకనుండి జారి కిందపడుతూ చిన్నజల పాతంవలె ఉంది.

టామ్ ఆ సెలగోటిని దాటి, అవతల నుంచుని బెకీకి దాని అందాన్ని కొవ్వొత్తిసహాయంతో చూపించాడు. ఇంతలో టామ్‌కి నన పక్కనే రెండు ఇరుకు గోడలమధ్యగా మెట్లు కనిపించాయి. ఆ మెట్లు మనుషులు కట్టినవి కావు. వాటంతట అవే ఎగుడు దిగుడుగా ఏర్పడ్డాయి. అవి చూడగానే గొప్ప పరిశోధకుడైపోవాలని టామ్‌కి కుతూహలం కలిగింది. బెకీకూడా ఉత్సాహం చూపించింది. మెట్లదారంవద్ద కొవ్వొత్తితో గుర్తులు పెట్టారు తిరుగువాట దారి తెలుసుకునేందుకు పనికివస్తాయని.

ఆ మెట్లు ఈ పిల్లలిద్దరినీ ఎంతెంతో దూరం గుండా తిప్పాయి; లెక్కలేనన్ని మలుపులు తిరిగాయి. కొంత దూరం పోయాక మళ్ళీ గుర్తులు పెట్టారు. గుహ లోతుల్లో తాము చూసిన అద్భుత రహస్యాలనుగూర్చి పైవాళ్ళకి వర్ణించాలనే ఆశతో ఇంకా వింతలు చూడాలని ముందుకు సాగారు.

ఒకచోట విశాలమైన ఒక మందిరం కనబడింది. అందులో కప్పునుండి వందలకొలది రాతిఊడలు వేలాడుతున్నాయి. అవి ఒక్కొక్కటి మనిషి కాలంత పొడుగూ, లావుగా వుండి నిగనిగలాడుతున్నాయి. వాటిని మెచ్చుకుంటూ ఆ ప్రదేశమంతా తిరిగారు. ఎక్కడ చూసినా బోలెడన్ని ద్వారాలు కనబడ్డాయి. ఒక దాంట్లోంచి బయటికి వెళ్ళారు. అక్కడకూడా ఇందాకటి రాతి ఊడల్లాంటివి ఇంకా పొడుగైనవి

వేళ్ళాడుతున్నాయి. నేలమీదనుంచి ఆ మాదిరివే రాతిశిఖరాలు పైకి లేచి, రాతి స్తంభాలతో పెనవేసుకుని స్తంభాలవలె ఉన్నాయి. వీటితో ఆ ప్రదేశం ఒక మంటపంలాగ కనబడ్తోంది. మంటపం మధ్యలో ఒక నీటిబుగ్గ 'జలు' మని వస్తోంది. కన్నంనుంచి వేలాది గబ్బిలాలు ఒక్కొక్కటి గుత్తిగా కట్టుకొని అసంఖ్యాకంగా వేళ్ళాడుతున్నాయి.

కొవ్వొత్తుల వెలుగులు కళ్లల్లో పొడుచుకునేటప్పటికి గబ్బిలాలు వందలకొద్ది ఎగిరివచ్చి కీచుమంటూ కొవ్వొత్తులమీద ముట్టడించసాగాయి. వాటి ధాటికి ఆగలేకపోయారు. అక్కడ ఉండటం అపాయకరమని టామ్‌కు తెలుసు. వెంటనే బెకీ చెయ్యి పట్టుకుని మొదటగా కనబడ్డ దారిగుండా అవతలకి పరిగెత్తాడు. ఆ మంటపం దాటకముందే ఒక గబ్బిలం విసురుగా వాలి బెకీ కొవ్వొత్తిని ఆర్పేసింది. ఇలా చాలా దూరం తరిమాయి గబ్బిలాలు. కాని పిల్లలు ఏ దోవ కనిపిస్తే ఆ దోవలోంచి పారిపోతూ మొత్తానికి గబ్బిలాల అపాయం తప్పించుకున్నారు.

ఒకచోట పాతాళసరస్సు కనబడింది. దాని అవతల చివర కనిపించటంలేదు. అంచేత దాని తీరం వెంబడే నడిచి పోయి, వెడల్పులు కనుక్కోవాలని నిశ్చయించారు. కాని ముందు కొంతసేపు ఆ ఒడ్డున చదికిలబడి విశ్రాంతి తీసుకోవటం మంచి దనుకున్నారు. ఆ ప్రదేశంలోని గాంభీర్యం, నిశ్శబ్దం చూసే

టప్పటికి మొదటిసారిగా వాళ్లకి తా మెక్కడ వున్నదీ జ్ఞాపకం వచ్చింది. బెకీ ఇలా అంది :

"టామ్! మనం ఇటు వచ్చి చాలా సేపయిం దనుకుంటా. వాళ్లంతా ఎక్కడ వున్నారో?"

"బెకీ! మనం వాళ్లకి చాలా దిగువగా వున్నాము. ఉత్తరంగా వున్నామో, తూర్పో, దక్షిణమో తెలియదు. చూశావా, వాళ్ల మాటలు కూడా వినిపించటం లేదు."

దీంతో బెకీ కొంచెం గాబరాపడ్డది.

"మనం వచ్చి ఎంతసేపయిందో టామ్! ఇక వెనక్కి బయల్దేరటం మంచిది."

"అవును. పోవటమే మంచిది." అన్నాడు టామ్.

"నీకు దోవ తెలుస్తుందా? నాకు అన్నిదార్లూ ఒకటిగానే వున్నాయి."

"ఆ, తెలుస్తుందనుకుంటా. కాని ఆ గబ్బిలాల దోవన పోవద్దు. అవి మన కొవ్వొత్తుల్ని ఆర్పేశాయంటే చాలా చిక్కొస్తుంది. ఇంకో దోవన పోదాం."

"సరే కాని దోవ తప్పుతామేమో?"

ఇది తలచుకునేటప్పటికి బెకీ వళ్లు జలదరించింది. తప్పిపోతే?...అమ్మో!

ఇరుకుగావున్న ఒక సన్నవగుండా, మౌనంగా, చాలాదూరం నడిచారు. కొత్తదోవ కనిపించినప్పుడల్లా అది తెలిసిన దోవేనని ఆశతో చూసేవారు. కాని ఆ

దోవ లన్నీ కొత్తవే. ప్రతిసారి టామ్ పరీక్ష చేసి నప్పుడల్లా బెకీ అతనికేసి ఆదుర్దాగా ఏమన్నా దోవ దొరికిందేమోనన్న ఆశతో చూసేది. అతడు లేని ఉత్సాహం తెచ్చిపెట్టుకుని,

"ఆల్ రైట్. ఇది కాదు దోవ, కాని తప్పకుండా దొరుకుతుంది," అనేవాడు.

కాని కొంతసేపటికి అతనికికూడా నిరాశ ఎక్కువ కావటం ప్రారంభమైంది. దాంతో, ఏదోవ కనిపిస్తే ఆదోవనే పరిగెత్తటం ప్రారంభించాడు. ఇంకా "ఆల్ రైట్, ఆల్ రైట్" అంటూ నేవున్నాడు; అయినా అతని మనస్సును అప్పటికే ఆవహించిన నిరాశ, భయంవల్ల "అయిపోయింది మనపని," అన్నట్టు ధ్వనిస్తున్నాయి ఆ మాటలు. బెకీ అతన్ని అంటిపెట్టుకునే తిరుగుతున్నది. కన్నీళ్లు ఆపుకోవా లనుకుంది, కాని అవి ఆగక బొటబొట కారిపోతు న్నాయి. చివరి కిలా అంది:

"ఆ దోవనే పోదాం టామ్! గబ్బిలాలున్నా పరవాలేదు. మనకి అంతకంతకీ అయోమయమైపో తోంది."

టామ్ ఆగాడు. "విను," అన్నాడు. గాఢ నిశ్శబ్దం! ఎంత నిశ్శబ్దమంటే వారు ఊపిరి పీల్చటంకూడా బిగ్గరిగా వినిపిస్తోంది. టామ్ అరిచాడు. అరుపు నిర్జన గుహామందిరాలగుండా పరిగెత్తి ఆ దూరాన

ఎక్కడో ఆగి ప్రతిధ్వనించింది. ఆ ప్రతిధ్వని ఎవరో వెక్కిరిస్తూ నవ్వినట్లు భయంకరంగా వినబడింది.

"టామ్! అల్లా అరవవద్దు. చాలా భయంకరంగా వుంది."

"భయంకరంగానే వుంది. అయినా అల్లా అరిస్తే వాళ్లైనకన్నా వింటే వినవచ్చు," అని మళ్ళీ అరిచాడు టామ్.

దెయ్యాలు ఫక్కుమని నవ్వినట్లు వినిపించే ఆ ప్రతిధ్వనికన్నా "వింటే వినచ్చు" అనే ఆ మాట బెకీని ఇంకా భయభ్రాంతం చేసింది. టామ్‌లో చచ్చిపోతున్న ధైర్యాన్ని సూచిస్తోంది ఆమాట. ఇద్దరూ విన్నారు. కాని ఏమీ వినబడలేదు. టామ్ వెనక్కి తిరిగాడు. వచ్చినదోవనే పోదామని అతని ఉద్దేశ్యం. అతని కంగారు కొంతసేపు మాటాడాక గాని బెకీకి అర్థం కాలేదు; ఇప్పుడే దోవన వచ్చారో ఆ దోవకూడా టామ్ మర్చిపోయాడని.

"టామ్! నువ్వు గుర్తులైనా పెట్టలేదు."

"బెకీ! చాలా తెలివితక్కువపని చేశాను. ఎంత మూర్ఖుణ్ణి! మళ్ళీ వెనక్కి వెళ్లవలసివస్తుందని అనుకోలేదు. ఊహూ! దోవ తెలియటంలేదు. అన్నీ కలిసిపోయాయి.

"టామ్, టామ్! మనం దోవ తప్పిపోయాం. ఇక లాభంలేదు. ఈ పాతాళగుహనుంచి బయట పడలేము. అసలు మనం వాళ్లని వదలి ఎందుకు వచ్చాం?"

బెకీ కూలబడి గొల్లున ఏడవటం సాగించింది. ఆ ఏడుపు మరీ వికటంగా ప్రతిధ్వనిస్తోంది. ఆమె ఏడ్చే స్థితి చూస్తే గుండెలు అవిసి చచ్చిపోతుందో, పిచ్చెక్కి పోతుందో అనిపించింది. ఆమె పక్కన కూర్చుని భుజాల మీద చేతులు వేశాడు. బెకీ అతని రొమ్ముమీద వాలి వెక్కివెక్కి ఏడ్చింది. తన భయాలని, తను చేసిన పొరపాట్లని, అన్నిటినీ చెప్పుకుని ఏడ్చింది. అన్నీ ఆ ప్రతిధ్వనిలో వికటాట్టహాసంగా మారిపోయాయి. ధైర్యం తెచ్చుకోమని టామ్,—లాభంలేదని బెకీ—. అతను తన్ను తను తిట్టుకున్నాడు; బెకీని కూడా ఈ అపాయంలోకి ఈడ్చినందుకు తను ఉట్టి "వెధవ, పుండాకోరు, రాస్కెల్" అని దూషించుకున్నాడు. ఈ స్వయందూషణ బెకీమీద కొంతపని చేసింది. ధైర్యం తెచ్చుకోటానికి ప్రయత్నిస్తానంది; లేచి నడుస్తానంది; ఇందాకటిమాదిరిగా నిరాశగా మాట్లాడకుండా వుంటే, అతను ఎక్కడికి నడిస్తే అక్కడికి అనుసరిస్తానంది. టామ్ ఒక్కడిదే పొరపాటు కాదు, తనదికూడా పొరపాటేనంది.

అంచేత తిరిగి బయల్దేరారు. ఒకదిక్కు అని లేకుండా ఎటుపడితే అటు నడిచారు. ఒకొక్కసారి ఆశ తలెత్తేది; దాని వారికి కాదు—గాఢనిరాశలో వున్నప్పుడు ఎందుకో తెలియకుండా హృదయాల్లో ఆశ చిగురిస్తుంది; అది దాని స్వభావం.

కొంతసేపటికి టామ్ బెకీకొవ్వొత్తి తీసుకుని

ఆర్పేశాడు. అలా ఆర్పటం అత్యవసరం! దాన్ని మాటల్లో చెప్పక్కర్లేదు. బెకీ కర్థమైంది ఎందుకు ఆర్పేశాడో! టామ్దగ్గిర ఒక పూర్తి కొవ్వొత్తి, ఇంకా మూడు నాలుగు ముక్కలు జేబులోను వున్నాయి. అయినా వాటిని పొదుపుగా వాడటం అత్యవసరం!_బెకీ ఆశ మళ్లీ చచ్చిపోయింది.

చాలా దూరం తిరిగారేమో, బాగా అలిసిపోయారు. అలిసిపోయినట్టు అనుకోవటానికికూడా వారికి భయంవేసింది. కాలం ఇంత అమూల్యంగా పరిణమించినప్పుడు విశ్రాంతి తీసుకోవటమెల్లా? నడుస్తూ వుండాలిసిందే. ఎటో అటు తిరుగుతూవుంటే ఊరికే కూర్చోలేదనే సంతృప్తి వుంటుంది. కూర్చున్నారంటే మృత్యువు నాహ్వానించినట్టే.

చివరికి బెకీ సుకుమార పాదాలు ఒక్క అడుగు వెయ్యటానికికూడా నిరాకరించాయి. ఆమె కూర్చుంది. టామ్ ఆమెపక్కనే కూర్చున్నాడు. ఇంటినిగూర్చి, ఇంటిదగ్గిర స్నేహితుల్నిగూర్చి, అక్కడి సుఖమైన పరుపుల్నిగూర్చి, అన్నిటికంటే ముఖ్యమైంది వెలుతురుగూర్చి ఆప్యాయంగా మాట్లాడుకున్నారు. బెకీ ఏడ్చింది. ఆమె నోదార్చేందుకు, ధైర్యం పురికొల్పేందుకు టామ్ ఎన్నో ఉపాయాలు ప్రయత్నించాడు. కాని అన్నీ వ్యర్థమయ్యాయి. పైగా వెటకారంగా కనిపించాయి. బెకీ బాగా అలిసివుండటంచేత నెమ్మదిగా కునికిపాట్లుపడి

నిద్రపోయింది. టామ్ సంతోషించాడు. ఆమె ముఖంకేసి చూస్తూ కూర్చున్నాడు. ఆ పసిముఖం తన కష్టాల నన్నిటినీ మరిచిపోయి, సుఖస్వప్నాలు కంటున్నట్టు కలకదేరింది. నెమ్మదిగా ఆమె బుగ్గల మీదికి చిరునవ్వు పాకివచ్చింది. ఆ ప్రశాంతమైన ముఖంలో కనిపించే శాంతి టామ్ హృదయాన్ని వాన జల్లులా మెత్తగా చల్లబరిచింది. అతని ఆలోచనలు గడిచిపోయిన సుఖదినాలమీదికి, కలల్లాంటి జ్ఞాపకాలమీదికి పోతూంయి. ఇంతలో బెకీ నవ్వుతూ నిద్రలేచింది; కాని మరుక్షణంలో నవ్వు ఆగి పోయింది.

"ఓ...ఎల్లా నిద్రపోయానో? లేవకుండా అలాగే నిద్రపోతే ఎంత బాగుండేది. వద్దు, వద్దు, టామ్! అలా అనను లే. ఇంకెప్పటికీ అనను లే. అలా చూడబోకు."

"బెకీ! నువ్వు నిద్రపోవటం మంచిదే అయింది. ఇప్పుడు కాస్త నీరసం తీరింది నీకు. ఇక మనం దోవ కనుక్కోగలం."

"అవును, ప్రయత్నిద్దాం. కాని టామ్, నాకు కలలో బలే అందమైన దేశం కనిపించింది. మనం అక్కడికి వెడతా మనుకుంటా త్వరలో."

"ఉహూ. వెళ్ళకపోవచ్చు. ధైర్యం తెచ్చుకో బెకీ! లే."

లేచి చేతులు చేతులు పట్టుకుని బయల్దేరారు.

ఆశ ఏ కోశానా లేదు. తాము ఎంతసేపు గుహలో ఉన్నారో అంచనా కట్టడానికి ప్రయత్నించారు. రోజులు, వారాలు గడిచినట్టు అనిపించింది. కాని ఇది నిజం కాదని నిశ్చయమే. ఎందుకంటే కొవ్వొత్తులింకా అయిపోలేదు. కనక రోజులు గడిచాయనటానికి అవకాశం లేదు.

ఇంకా చాలాకాలం గడిచింది. ఎంతసేపో వాళ్ళకి తెలియదు. ఈ దగ్గర్లో ఎక్కడో నీటిబుగ్గ ఒకటి వుండాలని టామ్ అన్నాడు. చెవులొగ్గి విన్నారు. చివరికి నీటిబుగ్గ కనిపించింది. మళ్ళీ విశ్రాంతి తీసుకుందామన్నాడు టామ్. ఇద్దరికీ అలసటగానే వుంది; కాని బెకీ తను ఇంకా కొంతదూరం నడవగలనంది. టామ్ వద్దంటుంటే చూసి ఆమె ఆశ్చర్యపడింది. నీటిబుగ్గదగ్గరే కూర్చున్నారు. టామ్ కొవ్వొత్తిని తడిమట్టిలో ఎదురుగా గోడమీద అతికించాడు. చాలాసేపు ఏదో ఆలోచిస్తూ మౌనంగా కూర్చున్నాడు. చివరికి బెకీ నిశ్శబ్దాన్ని భంగంచేసింది.

"టామ్! చాలా ఆకలిగా వుంది."

టామ్ జేబులోంచి ఏదో తీశాడు.

"ఇదేమిటో తెలుసా?" అని అడిగాడు.

బెకీ చిరునవ్వు నవ్వింది.

"అది మన పెళ్ళి కేక్" కదూ.

"ఇదొక్కటే మనం తింటానికి మిగిలింది. ఇది పెద్ద పీపాఅంత వుంటే ఎంత బావుండును?"

"మనం పిక్నిక్‌కి తెచ్చిన సరుకులోంచి ఇది తీసి దాచాను. పెద్దవాళ్ళు చేసినట్లు సరదాగా మనంకూడా పెళ్లి "కేక్" ఆట ఆడుకోవచ్చుగదా అని. కాని ఇది మన —"

ఆమె వాక్యం పూర్తిచెయ్యకుండా ఆపింది. టామ్ కేక్‌ను తుంచి కొంత బెకీ కిచ్చి, కొంత తను తీసుకున్నాడు. దానిని పూర్తి చెయ్యడానికి కావలసినన్ని చల్లటి నీళ్లున్నాయి.

"బెకీ! ఒక విషయం చెబుతాను; ఏడవకుండా వుంటావా?"

బెకీ మొహంలో నెత్తురు వెనక్కి పోయింది. అయినా ఫరవాలేదు చెప్పమంది.

"ఏం లేదు, మనం ఇక్కడే వుండాలి. ముందుకు పోతే నీళ్లు దొరకవు. ఆ కొవ్వొత్తే ఆఖరిది."

బెకీ మళ్ళీ పెద్దపెట్టున గోలగా ఏడుపు ప్రారంభించింది. ఆమె నోదార్చటానికి టామ్ శాయశక్తులా ప్రయత్నించాడు; కాని లాభంలేదు. చివరికి బెకీ అంది:

"టామ్!"

"ఏమిటి?"

"వాళ్లు మనం కనిపించకపోతే వెదుకుతారు కదూ?"

"అవును. వెదుకుతారు. తప్పకుండా."

"ఇప్పుడు మన్ని వెదుకుతున్నారేమో?"

“అవును. కావచ్చు.”

“మనం లేమని ఎప్పుడు గ్రహించి వుంటారు?”

“పడవదగ్గిరికి వెళ్లి నప్పుడు చూసుకుని వుంటారు.”

“టామ్! అప్పటికి బాగా చీకటి పడివుంటుంది కదా! మనం రాలేదని తెలుస్తుందా?”

“ఏమో మరి. ఏమైనా, వాళ్లు ఇంటికి వెళ్లగానే మీ అమ్మకు నువ్వు రాలేదని తెలుస్తుంది.”

ఈ మాట విని బెకీ భయపడింది. టామ్ తను పొరపాటుగా మాట్లాడానని తెలుసుకున్నాడు. ఆ రాత్రి బెకీ మరొకళ్ల ఇంట్లో పడుకుంటానంది కనక వాళ్లమ్మ ఆ మర్నాడు కాని బెకీ రాలేదని కంగారు పడదు. అంటే ఆ మర్నాటికిగాని ఎవరూ వీళ్లకోసం వెదకటం ఆరంభించరు.

ఇద్దరూ మూగగా ఆలోచిస్తున్నారు. బెకీ మరొకసారి ఆపుకోలేని దుఃఖం ప్రదర్శించింది. బెకీ కూడా తనమాదిరిగా ఆలోచిస్తోందని టామ్ గ్రహించాడు. శ్రీమతి హార్పర్ ఇంట్లో బెకీ పడుకోలేదని శ్రీమతి థాచర్ గ్రహించేసరికి ఆదివారం పగలు సగం గడిచి పోవచ్చు.

ఆఖరి కొవ్వొత్తి మెల్లిగా కాలిపోతోంది. ఇద్దరూ దానికేసే భయపడుతూ చూస్తూకూచున్నారు. కొవ్వొత్తిముక్క నిర్దయగా హరించుకుపోతోంది. అరంగుళం పొడుగున్న వత్తిమాత్రం మిగిలింది. దీప శిఖ ఒక్కసారి ఉవ్వెత్తుగా లేచింది. కాసేపు రెప

రేప లాడింది. చివరికి టప్పుమని ఆరిపోయింది. ఇప్పుడు ఆ గుహ అంతటా గాఢాంధకారం రాజ్యం చేస్తోంది.

ఎంతసేపల్లా గడిచిందో తెలియదు. బెకీకి స్మృతి వచ్చేటప్పటికి ఆమె టామ్ మీద వాలి ఏడుస్తోంది. ఎన్నో యుగాలు గడిచినట్లు అనిపించింది. నిద్ర లేవగానే మళ్ళీ తమ అపాయపరిస్థితి అంతా జ్ఞాపకానికొచ్చింది. ఇది ఆదివారమో, సోమవారమో అయి వుంటుందన్నాడు టామ్. బెకీచేత మాట్లాడించా లని చాలా ప్రయత్నించాడు; కాని ఆమె నిరాశతో కుంగిపోయివుంది. ఈపాటికి తమకోసం ఊళ్లో వాళ్లు వెదకుతూవుంటారన్నాడు. వాళ్ళకి వినిపించాలని గట్టిగా కేక వేశాడు. దూర దూరాలనుంచి ఆ కేక వికృతంగా ప్రతిధ్వనించింది. అంతటితో కేకలు వెయ్యాలనే ఆలోచన మానుకున్నాడు.

గంటలు వ్యర్థంగా దొర్లిపోతున్నాయి. ఆకలి నిలువునా దహించేస్తోంది. టామ్ దగ్గిర ఇందాకటి సగం కేక్‌లో కొంచెం మిగిలివుంది. దాన్ని పంచుకుని తిన్నారు. ఆ కాస్త కేక్‌తో ఆకలి తీరకపోగా మరింత వృద్ధి అయింది.

ఇంతలో టామ్ "ఉష్! ఏమన్నా వినిపిస్తోందా?" అన్నాడు.

ఊపిరి బిగపట్టి ఇద్దరూ విన్నారు. కొంత అవతలనుంచి కేక వేసినట్లు ఏదో మందమైన ధ్వని వినవచ్చింది. వెంటనే టామ్ జవాబిచ్చాడు. ఆ ధ్వని

వచ్చేవైపుకి బెకీ నొకచేత్తో పట్టుకుని వెళ్లాడు. మళ్ళీ కేక వినవచ్చింది. ఈసారి దగ్గరగా వినబడింది.

"బెకీ! వాళ్లే-మన వాళ్లే—వస్తున్నారు ఇటే. పద త్వరగా"

ఖైదీ లిద్దరూ తమకు విడుదల సమీపించిందని ఆనందం పట్టలేకపోయారు. కాని త్వరగా నడవటానికి వీల్లేకపోయింది. ఆ చీకటిదోవనిండా గోతులున్నాయి. అందుచేత తడుముకుంటూనే నడవవలసివచ్చింది.

ఒక గొయ్యి అడ్డంవచ్చింది. ఆగిపోయారు. అది మూడడుగుల లోతుండవచ్చు. లేక మూడువందల అడుగుల లోతు ఉండవచ్చును. ఏమైనా, దాటటానికి వీల్లేదు. టామ్ బోర్లా పడుకుని అందినంతవరకూ చెయ్యి సాచాడు. లోతు అందలేదు. మనుషులు వచ్చేవరకూ అక్కడే వుండాలి. వళ్ళీ విన్నారు. ఆ దూరపు కేకలు మరీ దూరమైపోతున్నాయి. ఒక నిమిషం గడిచింది; మరో నిమిషంకూడా. ఆ కేకలు దూర దూరమై ఇక వినిపించలేదు. ఎంత దురదృష్టం! టామ్ గొంతుక పగిలిపోయేదాకా అరిచాడు. కాని లాభంలేదు బెకీతో ఉత్సాహంగానే మాట్లాడాడు. కాని ఒక యుగం గడిచిపోయింది భయంతో, నిరాశతో.

పిల్లలు మళ్ళీ సీటిబుగ్గదగ్గిరకి చేరారు. కాలం అలిసి అలిసి, మందంగా గడుస్తున్నట్టుంది. మళ్ళీ నిద్ర

పోయాగు. లేచేసరికి ఆకలి మరీ దుర్భరమైంది. ఇది మంగళవారమనే నిశ్చయానికి వచ్చాడు టామ్.

ఇంతలో ఒక మంచి ఆలోచన తట్టింది. దగ్గర్లో కొన్ని పక్కదోవలున్నాయి. వృథాగా, సెకండ్లు, నిమిషాలు లెక్కపెడుతూ కూర్చోటంకంటే ఆ దోవల్ని పరిశీలించటం మంచిది. జేబులో గాలిపడగ తాలూకు దారం ఉండ వున్నది. దానిని ఒక రాతికొనకి గట్టిగా కట్టాడు. ఉండని విప్పుకుంటూ ఇద్దరూ చీకట్లో బయల్దేరారు. 20 అడుగులు నడిచేటప్పటికి ఒక గొయ్యి అడ్డం వచ్చింది. టామ్ మోకాళ్ల మీద వంగి లోతు చూశాడు. అడుగు చేతికి తగిలింది. చెయ్యిసాచి చుట్టూ తడిమాడు. అదే నిమిషంలో-ఇరవై గజాల దూరంలో కొవ్వొత్తి పట్టుకున్న ఒక మానవహస్తం రాతిచాటునుంచి తొంగిచూసింది. టామ్ సంతోషంతో అరిచాడు. ఆ చెయ్యి వెనకనే దాని తాలూకు మనిషిశరీరం ఇవతల కొచ్చింది. ఇంజన్ జో!!!

టామ్ స్తంభించిపోయాడు ఉన్న చోటనే...కాని మరుక్షణంలో ఇంజన్ జో గిరుక్కున తిరిగి కాలికి బుద్ధి చెప్పాడు. తన గొంతుక గుర్తు పట్టలేదని, గుర్తు పడితే ఆరోజున వ్యతిరేకసాక్ష్యం ఇచ్చినందుకు మీద పడి చిత్రవధ చేసివుండేవాడని అనుకున్నాడు టామ్. ప్రతిధ్వనివల్ల టామ్ గొంతుక మారిపోయింది. అందు చేత అతన్ని పసికట్టలేదు వాడు.

భయంతో టామ్ ప్రతి అవయవమూ బిగుసుకుపోయింది. ఓపిక లేదుగాని, ఉంటే ఆ సెలయేరు దగ్గరికే పోయి అక్కడే శాశ్వతంగా ఉండిపోదామనుకున్నాడు. ఇంజన్ జో కంటబడటం కంటే అక్కడికి పోవటమే ఉత్తమమనుకున్నాడు. గను ఇంజన్ జోని చూసినట్లు బెకీకి చెప్పలేదు. ఎవరేనా వింటారనే ఆశతోనే కేక వేశాననిమాత్రం చెప్పాడు.

మళ్ళీ చాలాసేపు సెలయేరు దగ్గరే కాలక్షేపం చేశారు. నిద్ర లేచేసరికి ఆకలికి కడుపు నమ్మలు చుట్టుకు పోతోంది. ఈ రోజు బుధవారమో, గురువారమో, శుక్రవారమో, శనివారమో అయివుంటాదా లనుకున్నాడు టామ్. తమకోసం వెదకటం ఈపాటికి మానేసివుంటారనికూడా నిర్ధారణ చేసుకున్నాడు.

ఆకలి భయంకంటే బలమైనది. ఇంజన్ జో ఎదురుపడ్డా సరే, ఏదో ఒకదోవ వెదుకుదామని అన్నాడు. కాని బెకీ చెప్పలేనంత బలహీనంగా వుంది. నిస్సహాయస్థితిలో ఏర్పడే నిర్లక్ష్యంలో ఆమె మునిగిపోయింది. ఆశ పూర్తిగా చచ్చిపోయింది. మృత్యువు కోసం ఇక్కడే ఎదురుచూస్తూవుంటాననీ, మృత్యువు వచ్చి మింగటానికి ఇక ఆట్టేసేపు పట్టదనీ టామ్‌తో చెప్పింది. "నీ ఇష్టం. నువ్వు దోవ వెదికితే వెదుకు. నేను మాత్రం రాను" అని చెప్పింది. కాని ప్రతి అరగంటకీ వచ్చి తన్ను పలకరించిపోతూవుండమంది. "నేను చచ్చిపోయే సమయంలో మాత్రం నన్ను వదిలిపెట్టకు.

నా ప్రక్కనే వుండు. అంతా అయిపోయిందాకా నా చెయ్యి వదలకు," అని మరీ మరీ చెప్పింది. టామ్ అలాగేనని వాగ్దానం చేశాడు.

టామ్ ఆమె నుదుటిని ముద్దు పెట్టుకున్నాడు. అతని గొంతుకలో ఏదో గుండ్రాయిలా దుఃఖం అడ్డపడింది. అతికష్టంమీద, "దోవ తప్పక కనుక్కోగల" నని ధైర్యం చెప్పాడు. దారంతా విప్పుకుంటూ, చేతుల్తోనూ, మోకాళ్లతోనూ పాకుకుంటూ ఏనిమిషంలో మృత్యువునోట పడతానో అనుకుంటూ టామ్ బయల్దేరాడు.

## 17

ఆరోజు మంగళవారం. సాయంత్రమైంది. సెంట్ పీటర్సుబర్గ్ గ్రామంలో ఇంకా దుఃఖం తగ్గలేదు. టామ్, బెకీ లింకా దొరకలేదు. చర్చిలో పిల్లల క్షేమం కోరుతూ ప్రార్థనలు జరిగాయి. ఇళ్లలోకూడా చాలామంది హృదయపూర్వకంగా ప్రార్థనలు చేశారు. కాని గుహనుంచి ఎలాంటి మంచి కబురూ రాలేదు. గుహను గాలించినవాళ్లలో ఎక్కువమంది నిరాశ చేసుకుని, తిరిగివచ్చేశారు. పిల్లలు దొరుకుతారనేది ఇక కలలోమాటేనని వాళ్లు చెప్పారు.

శ్రీమతి థాచర్ మంచంమీదనుంచి లేవటం లేదు. ఆవిడకి సంధించినట్టుకూడా కనిపిస్తోంది. కూతుర్ని ఆమె పేరుపెట్టి పిలిచినప్పుడు వినేవాళ్లకి

గుండె బద్దలవుతోంది. బెకీ వచ్చిందనే ఆశతో లేచి తలఎత్తి చూసేది; మళ్లీ వాలిపోయి మూలిగేది. పోలీపెద్దమ్మకి ఉద్వేగంగా దుఃఖం రావటం మానేసి, సమానంగా సర్దుకుంది. గోధుమరంగుగావున్న ఆమె తల పూర్తిగా నెరిసి ముగ్గుబుట్టలా తయారైంది. మంగళవారం రాత్రి గ్రామస్థులు విచారభారంతో అలిసి నిద్రపోయారు.

అర్థరాత్రివేళకి గ్రామంలో గంటలు ఠణగోణ ధ్వనిగా మోగాయి. మరుక్షణానికల్లా వీధులన్నీ జనమయమైపోయాయి. "దొరికారు - దొరికారు-పిల్లలు దొరికారు," అని కేకలు మిన్నుముట్టాయి. ఊళ్లో పిల్లలు డబ్బాలు, బూరాలు ఏది దొరికితే అది మోగించి నానాగోల చేశారు. తండోపతండాలుగా జనం నదివైపు నడిచారు. టామ్, బెకీలని బండిమీద ఎక్కించుకుని కొందరు లాక్కువస్తున్నారు. జనం బండిచుట్టూ మూగి, దానితోపాటు కదుల్తూ, "హుర్రా, హుర్రా" అని కేకలువేస్తూ ఊళ్లోకి తిరిగి వచ్చారు.

ఊరంతటా దీపాలు వెలిగించబడ్డాయి. ఎవ్వరూ ఇళ్లకి పోలేదు. ఆ గ్రామంలో అంత గొప్ప కోలాహలం ఎప్పుడూ జరగలేదు. వందలకొద్ది జనం జడ్జిథాచర్ గారి ఇంటిని ముట్టడించారు. పిల్లల్ని ఎత్తుకుని ముద్దులుకురిపించారు. సంతోషంలో నోటమాట రాలేదు. వాళ్ల కన్నీళ్లు కాలవలు కట్టాయి.

కడవలో నీళ్లు నిండినట్లు పోలీపెద్దమ్మకి గొంతుక దాకా సంతోషం నిండి, ఆమెని ఉక్కిరి బిక్కిరి చేసింది. శ్రీమతి థాచర్‌కికూడా అంతపనీ అయింది. కాని ఆమె ఆ సంతోషంలో వొళ్లు మరిచిపోలేదు. జడ్జిథాచర్ ఇంకా గుహవద్దనే ఉన్నారు. వెంటనే ఆయనకి కబురు పంపింది పిల్లలు దొరికినట్లు.

టామ్ ఒక సోఫాలో పడుకున్నాడు. అతని చుట్టూ జనంమూగి, అతను వర్ణించే సాహస కృత్యాలు నోరు తెరుచుకుని వింటున్నారు. తను చెప్పే కథని ఆకర్షణీయంగా చేసేందుకుగాను టామ్ కోతలు కూడా కోశాడు. దోవ కనుక్కునేందుకు తను బెకీని వదలి ఎల్లా వెళ్లాడో చెప్పాడు. గాలిపటందారం విప్పుకుంటూ ఆ చీకట్లో ముందుకు పాకిపోయాడు. రెండు మలుపులు తిరిగేటప్పటికి దారం అయిపో యింది. అయినా దారాన్ని బాగా సాగదీసి మూడో మలుపుకూడా తిరిగాడు. ఇక లాభం లేదని వెనక్కి తిరగబోయాడు.

ఇంతలో చాలా దూరాన ఒక తెల్లటి చుక్క కనిపించింది. అది సూర్యకాంతిలా వుంది. వెంటనే దారం వదిలేసి, నెమ్మదిగా ఆ కాంతి కనిపించే చోటుకి పాక్కుంటూపోయాడు. అక్కడనించి ఒక చిన్న కంతగుండా తలదూర్చి చూశాడు. విశాలమైన మిసిసిపీనది హోరున ప్రవహిస్తోంది. అది రాత్రే గనక

అయివుంటే, ఆ తెల్లటిచుక్క కనిపించేదే కాదు. నిరాశ చేసుకుని వెనక్కి వెళ్ళిపోయేవాడు.

వెంటనే టామ్ బెకీవద్దకు పరుగున వెళ్లి బయటికిపోయేదోవ కనిపించిందని చెప్పాడు. ఆమె తన్ను ఇలాంటి అబద్ధాలతో నమ్మించవద్దని, తను ఎలాగూ చచ్చిపోవటం నిశ్చయమనీ, అసలు చచ్చిపోవాలనే వుందనీ అన్నది. ఆమెని నమ్మించేటప్పటికి తాతలు దిగొచ్చారు. మూడో మలుపు దగ్గరనుంచి ఆ తెల్లటి చుక్కని చూసిందాకా నమ్మకంలేని బెకీ, అది చూడగానే ఎగిరి గంతులువేసింది. టామ్ ముందు తను అవతలకు దిగి, తరవాత బెకీని చెయ్యిపట్టుకుని దించాడు. అక్కడ కూర్చుని చాలాసేపు ఇద్దరూ ఏడ్చారు.

ఇంతలో కొందరు ఒక పడవలో ఆ రేవునే ప్రయాణం చేస్తున్నారు. టామ్ వాళ్లని కేకలువేసి పిలిచాడు. తమ కథనంతా వాళ్లకి చెప్పాడు. వాళ్లు మొదట్లో టామ్ కథ నమ్మలేదు. ఎందుకంటే ఆ గుహ ద్వారం అక్కడికి అయిదుమైళ్ల ఎగువన వున్నది. చివరికి ఎలాగయితేనేం పడవలో ఎక్కించుకుని ఒక యింటికి తీసుకుపోయి, కడుపునిండా భోజనం పెట్టారు. చీకటిపడిన తర్వాత రెండుమూడు గంటలు విశ్రాంతి తీసుకున్నారు. తరవాత పడవవాళ్లే ఇద్దర్నీ సెంట్ పీటర్సుబర్గు తీసుకువచ్చారు.

తెల్లవారకముందే కొందరుపోయి గుహలో

ఇంకా వెదుకుతూవున్న జడ్జి థాచర్‌కి, మరికొందరికీ ఈ శుభవార్త తెలియజేశారు.

మూడు పగళ్లు, మూడు రాత్రులు గుహలో పడిన శ్రమ, ఆకలిబాధ ఊరికే పోలేదు. టామ్, బెకీలు బుధవారం, గురువారం మంచంమీదనుంచి లేవలేక పోయారు. శుక్రవారంనాటికి టామ్ కొద్దిగా లేచి తిరిగాడు. శనివారానికి మామూలు మనిషయ్యాడు. బెకీ ఆదివారానికి గాని తన గదివిడిచి రాలేకపోయింది. కాని పెద్ద జబ్బుపడి లేచినట్లు కనుపించింది.

హాక్ల్‌బెర్రీ జబ్బుగా ఉన్నాడని తెలిసి టామ్ చూట్టానికి వెళ్లాడు. కాని అతన్ని లోపలికి రానియ్యలేదు. శనివారం, ఆదివారం కూడా అలాగే జరిగింది. ఆ తరువాత రోజూ హాక్‌ని చూట్టానికి వీలైంది. తన సాహసాన్ని గాని, వేడుకిచ్చే మరే విషయాన్ని గాని హాక్ ఎదుట వాగవద్దని వైద్యులు హెచ్చరించారు. ఈ హెచ్చరికని టామ్ అమలు జరిపేట్టు చూట్టానికి డగ్లస్ అమ్మగారు పక్కనే కాపలా కాసింది.

కార్డిఫ్ మెట్టుమీద జరిగిన సంఘటన టామ్‌కి తెలిసింది. చిరుగు గుడ్డల మనిషిశవం నదిలో తేలుతూ కనిపించిందనీ, పారిపోవటానికి నదిలో దూకగా మునిగి పోయివుంటాడనీ కూడా తెలిసింది.

టామ్ గుహనుండి బయటపడి రెండు వారాలు గడిచింది. హాక్ ఈ లోగా బాగా కోలుకున్నాడు.

ఉద్రేకం కలిగించే ఏ సంగతైనా వినటానికి సిద్ధంగా ఉన్నాడు. అందుచేత తన సాహసకృత్యాలు వర్ణించెయ్యాలనే ఆరాటంతో టామ్ బయల్దేరాడు. దోవలో బెకీని చూట్టానికి జడ్జిథాచర్ గారింటివద్ద ఆగాడు. జడ్జిగారు, ఆయన స్నేహితులు టామ్ చేత తెగవాగించారు. టామ్‌ని ఉడికించటానికి ఒకాయన "మళ్ళీ ఆ గుహాకి వెళ్తావా?" అని అడిగాడు. వెళ్లటానికి తనకేమీ అభ్యంతరం లేదన్నాడు టామ్. జడ్జిగారిలాగన్నారు:

"టామ్! నీలాగా గుహాకి వెళ్లాలని ఇంకా కొంతమంది ఉబలాటపడుతుండవచ్చు. కాని అందుకు తగిన జాగ్రత్తలు మేము ముందే తీసుకున్నాం. ఇక ఆ గుహాలో ఎవ్వరూ తప్పిపోలేరు."

"ఏం"?

"ఆ గుహాద్వారాన్ని ఇనప తలుపులతో రెండు వారాలకిందటే మూసేశాం. పెద్దపెద్ద తాళాలు మూడు బిగించాము. తాళంచెవులు నాదగ్గరున్నాయి.

టామ్ మొహం మంచులా తెల్లబడిపోయింది.

"ఏమిటది టామ్! అరె!...... అల్లా వున్నావేం... ఏయ్, కాసిని నీళ్లు తీసుకురండి!"

టామ్ మొహంమీద చన్నీళ్లు చల్లారు. కొంచెం తేరుకున్నాడు.

"ఏమిటి టామ్?"

"జడ్జిగారూ! ఆ గుహలో ఇంజన్ జో వున్నాడు.

మరికొన్ని నిమిషాల్లో ఈ వార్త వూరంతా పాకింది. డజనుపడవల్లో జనం బయల్దేరారు. ఆ తర్వాత ఇంకా అనేకమంది ప్రయాణీకుల్ని ఎక్కించుకుని రహదారి పడవ బయల్దేరింది. జడ్జిగారెక్కిన పడవలోనే టామ్‌సాయర్ వున్నాడు.

గుహాద్వారం తెరవగానే చాలా విషాదకరమైన దృశ్యం గోచరించింది.

తలుపులోని పగులుదగ్గిరగా మొహం పెట్టి, కాళ్లు చేతులు చాచుకుని, ఇంజన్ జో చచ్చిపడివున్నాడు. ఆ పగులులోంచి కనబడే సూర్యరశ్మికేసే ఆఖరి నిమిషందాకా దీనంగా చూస్తూ చూస్తూ ఆరిపోయినట్లున్నాయి వాడికళ్లు. టామ్‌కు చాలా జాలి కలిగింది. ఎందుకంటే తాను గుహలోపడిన దుర్భర యమయాతనలనుబట్టి ఇంజన్ జో ఎంత బాధపడి చచ్చిపోయి వుంటాడో గ్రహించాడు. అయినప్పటికి అతని గుండెల్ని ఇంతకాలమూ నొక్కిపెడుతున్న ఒక పెద్ద బరువు తొలగిపోయినట్లయింది. ఇంజన్‌జోకు వ్యతిరేకసాక్ష్యం ఇచ్చినప్పటినుంచి క్షణ క్షణమూ తను ఎంత భయపడుతూ గడిపాడో ఇప్పటివరకూ టామ్ పూర్తిగా గ్రహించలేదు. హంతకుడి శవం చూసిన తర్వాత అతని మనసాక్కసారి తేలికైంది.

ఇంజన్‌జో పక్కన అతనికత్తి రెండు ముక్కలై

పడివుంది. తలుపులకింద వున్న గడప కొంతవరకూ పెల్లగించబడింది. కాని ఇంజన్ జో శ్రమ అంతా వ్యర్థమే. ఎందుకంటే గడప కవతల ఇనుముకంటె బలమైన రాతిపలకవుంది. కత్తి దాన్నేమీ చెయ్యలేక పోయింది. పైగా తనే విరిగి పూరుకుంది. ఒకవేళ బయట రాతిపలక లేకపోయినా ఇంజన్ జో శరీరం తలుపు అడుగునుంచి బయటపడగలగటం అసంభవం. ఈ సంగతి ఇంజన్ జోకి తెలుసు. అయినా ఏదో విధంగా దుర్భరమైన కాలం గడపాలి. అందుచేత కత్తితో కొయ్యగడపని గీరుతూ కూర్చున్నాడు.

సాధారణంగా గుహాలో అక్కడా యిక్కడా యాత్రికులు వదలివెల్లిన కొవ్వొత్తిముక్కలు కని పిస్తాయి. కాని ఇప్పుడొక్కటైనా లేదు. ఇంజన్ జో వాటిని తినేశాడు. కొన్ని గబ్బిలాలనికూడా పట్టుకు న్నాడు. వాటి పంజాలు మాత్రం వదిలివేసి మిగతా దంతా తినేశాడు. పాపం ఆకలికి మాడిమాడి చచ్చి పోయాడు.

ఆ దగ్గర్లో, ఎన్ని శతాబ్దాలనుంచో ఏర్పడు తున్న రాతి ఊడలున్నాయి. (గుహాకప్పునుంచి తేమ నీళ్లు ఊరి బొట్లుబొట్లుగా నేలపడతాయి. ఈ నీటి బొట్లలో కాల్షియాం అనే పదార్థం వుంటుంది. నీరు ఇగిరి కాల్షియం మాత్రం మిగిలి కొన్నేళ్లకి ఇలా రాతిఊడలు ఏర్పడతాయి. నేలమీద పడిన నీటి బొట్లుకూడా ఇగిరి కాల్షియం మిగిలి రాతికమ్మీలు

పైకి పెరుగుతాయి) ఇంజన్ జో దాహం తీర్చుకోటానికి, ఒక ఉపాయంచేశాడు. ఒకచిన్న రాతిఃలకని మధ్యలో గుంటచేసి పైనుంచి సీటిచుక్క కిందపడేచోట పెట్టాడు. ఆ సీటిచుక్క మూడేసి నిమిషాలు కొకటి చొప్పున పడుతుంది. 24 గంటల్లో ఒకచెంచా నిండుతుంది.

ఆ సీటిచుక్క ఈజిప్టులో పిరమిడ్లు కట్టబడిన కాత్తలో రాలింది; ట్రాయ్‌నగరం ధ్వంసమైన రోజుల్లో రాలింది; రోమ్ నగరం నిర్మింపబడే రోజుల్లో, ఏసు క్రీస్తును శిలువ వేసినప్పుడు, బ్రిటిషు సామ్రాజ్యపు పునాదులు కట్టబడేటప్పుడు, కొలంబస్ అమెరికాను కనిపెట్టినప్పుడు కూడా ఆ సీటిచుక్క రాలుతూనే వున్నది. ఇప్పటికీ అది పడుతూనే వుంది. చరిత్ర గర్భంలో ఇవన్నీ మునిగి మాసిపోయే రోజులు వచ్చినప్పుడుకూడా ఆ చుక్క అలా పడుతూనే వుంటుంది.

ప్రతి సంఘటనకీ ఫలానా ప్రయోజన మంటూ వుందా? ఈ మానవ కీటకానికి అవసర మొస్తుందేమోనని అయిదువేల ఏళ్ళనుంచీ ఆ సీటిచుక్క అలా పిసుగు, విరామంలేకుండా పడుతూన్నదా? లేకపోతే పదివేల ఏళ్ళ పిమ్మటనో, ఇంతకంటె మహాత్కార్యానికి దేనికో అది నిరీక్షిస్తోందా? ఏమో తెలియదు.

దురదృష్టవంతుడైన ఇంజన్ జో అమూల్యమైన ఆ సీటి చుక్కలకోసం రాతిగిన్నెనుపెట్టి ఎన్నో ఏళ్లు గడిచింది. కాని ఇప్పటికీ మెక్‌డుగాల్ గుహను చూడవచ్చే యాత్రికులు నరకబాధను తలపించే ఆరాతి

గిన్నెకేసీ; మూడు నిమిషాల కొకటిచొప్పున రాలే ఆ నీటిచుక్క కేసీ ఎక్కువసేపు చూస్తారు. ఇంజన్ జో గిన్నె గుహాలోని వింతలన్నిటికీ వింత. "అల్లాడిన్ భవనం" కూడా దానికి సాటిరాదు.

ఇంజన్ జోని గుహాద్వారం వద్దనే పాతిపెట్టారు. చుట్టుపక్కల ఏడుమైళ్ల దూరంనుంచి కూడా జనం పడవలెక్కి, బళ్లెక్కి వచ్చారు. పిల్లలతోను, భోజనసామగ్రితోను తర్లి వచ్చారు. ఇంజన్ జోని పాతిపెట్టినప్పుడు, ఉరితీస్తే వచ్చేటంత సంతృప్తి కలిగినట్లు వాళ్లంతా ఒప్పుకొన్నారు.

ఇంజన్ జోను క్షమించవలసిందని కోరుతూ గవర్నరుకు పిటీషను పెట్టడానికి ఇంతకు ముందే కొందరు నిశ్చయించారు. ఆ పిటీషనుమీద అనేక మంది సంతకాలు చేశాయి. గవర్నరు దగ్గిరికి ఏడుస్తూ వెళ్లి, క్షమాభిక్షను వేడటానికి ఒక ఆడవాళ్ళ కమిటీనికూడా ఏర్పాటు చేశారు. గ్రామంలో అయిదుగుర్ని ఇంజన్ జో చంపినట్లు పుకారు వుంది. అయితే ఏం? వాడు సాక్షాత్తు సైతాను అయినా సరే, క్షమించమని ప్రాధేయపడే మూర్ఖులు అనేకమంది ఉంటారు.

ఇంజన్ జో చచ్చిపోవటంతో పిటీషనుగొడవ కాస్తా తుడుచుకు పోయింది.

అంత్యక్రియలు జరిగిన మర్నాడు టామ్ హాక్ ని చాటుకి పిలుచుకు వెళ్లాడు ఒక ముఖ్య వ్యవహారాన్ని చర్చించటానికి.

వేల్సు దేశస్థుడిద్వారాను, డగ్లస్ అమ్మగారి ద్వారాను హాక్‌కి ఇదివరకే తెలిసింది టామ్ సాహస కృత్యాల విషయం. అయినా వాళ్లు చెప్పని ముఖ్య విషయం ఇంకోటి వుందన్నాడు టామ్. హాక్ విచార ముఖం పెట్టాడు. ఇలా అన్నాడు:

"టామ్! అదేదో నాకు తెలుసు. నువ్వు నంబర్ 2 లోకి వెళ్లావు. విస్కీ తప్ప మరేమీ కనబడలేదు. నువ్వేనని నాకెవరూ చెప్పలేదనుకో. అయినా, విస్కీ విషయం వినగానే నువ్వే అయివుంటావని నేను గ్రహించాను. నీకు డబ్బు దొరకలేదు. దొరికితే ఇంకెవళ్ళతో చెప్పినా, చెప్పకపోయినా నాతో తప్పకుండా చెప్పేవాడివి. ఆ డబ్బు మనది కాదని నేను మొదట్నుంచీ భయపడుతూనే వున్నాను."

"అదేమిటి హాక్! హోటలువాడి నేరం బయట పెట్టింది నేను కాదు. నేను శనివారంనాడు పిక్నిక్‌కి వెళ్లేటప్పటికి హోటలువాడి నేరం ఎవరికీ తెలియదు. అసలు నువ్వేగా ఆ రాత్రి కాపలా కాసింది?"

"అవు నవును. ఎప్పుడో ఏడాదికిందట జరిగినట్టుంది అదంతా. ఆ రాత్రే నేను ఇంజన్‌జోని అమ్మగారి ఇంటిదాకా వెంబడించాను.

"నువ్వు వెంబడించావా?"

"అవును. కాని ఎవ్వరితోనూ చెప్పకు. ఇంజన్ జో చచ్చిపోయినా, ఇంకా వాడి స్నేహితులున్నారు. వాళ్లు నావెంటపడి ఏడిపించటం నా కిష్టం లేదు.

ఆ రాత్రి వేనేగనక లేకపోతే ఇంజన్ జో ఈపాటికి టెక్సాస్ రాష్ట్రంలో ఖుషీగా తిరుగుతూ ఉండేవాడు.

తరవాత హాక్ తను చేసిన సాహస మంతా టామ్‌కి వినిపించాడు. టామ్ వెల్ష్ దేశస్థుడినుంచి కొంతభాగం మాత్రమే విన్నాడు.

"ఏమైతేనేం, నంబర్ 2. లో విస్కీ ఎవరు చూశారో వాళ్లే డబ్బు కాజేసివుంటారు. అది మన కెల్లాగూ దక్కదు," అని నిట్టూర్పు విడిచాడు హాక్.

"హాక్! డబ్బు అసలు నంబర్ 2. లో లేనే లేదు!"

"అరే! మరి అయితే ఎక్కడుంది?"

"గుహలో వుంది!"

హాక్ కళ్లు తళుక్కున మెరిశాయి.

"మళ్లీ అను ఆమాట."

"గుహలో వుంది డబ్బు!"

"వేళాకోళమా? నిజమా?"

"హాక్ సంతోషం! నా తోడు! దాన్ని కొట్టెయ్యడానికి నాకు సహాయంచేస్తావా?"

"తప్పకుండా! మనకేమీ అపాయం రాకపోతే, తప్పకుండా వెడదాం."

"ఇప్పుడక్కడికి వెళ్లటం అతి తేలిక. అంత తేలికపని ప్రపంచంలో మరోటిలేదు."

"నీ కెల్లా తెలుసు, గుహలో వుందని?"

"హుక్! కాస్త ఆగు. అక్కడ గనక డబ్బు దొరక్కపోతే నా చెవి కోసి ఇస్తాను. నా డప్పు, డాలు, ఇంకా నాకున్నవన్నీ ఇచ్చేస్తాను. పందెమేనా?"

"ఆల్ రైట్, టామ్! ఎప్పుడు వెడదాం?"

"ఇప్పుడే, నీకు ఒంట్లో ఓపిక వుందా?"

"గుహలో చాల దూరం పోవాలా? నేను మహా నడిస్తే ఒకమైలు నడవగలనేమో."

"మరెవడైనా వెళ్లాలంటే అయిదుమైళ్లదూరం నడవాలి కాని నాకు దగ్గరదోవ తెలుసు. నాకు తప్ప ఇంకెవరికీ అది తెలియదు. నిన్ను అక్కడికి పడవలో తీసుకువెళతాను. నేనే పడవ నడుపుతా. నువ్వు చిటికెనవేలు కూడా కదల్చక్కర్లేదు."

"అయితే బయద్దేరు."

"ఆల్ రైట్. మనకి కొన్ని రొట్టెలు, మాంసం, చుట్టలు, ఒకటిరెండు సంచులు, గాలిపడగ దారం, అగ్గిపెట్టెలు కావాలి. నే నిదివరకు అక్కడున్నప్పుడు ఇవన్నీ ఉంటే ఎంత బావుండునో, అనిపించింది."

ఆ మధ్యాహ్నం ఒక చిన్న పడవని "ఎరువు" తెచ్చారు. (పడవ యజమాని ఊళ్లో లేడనుకోండి.) వెంటనే నదిమీద బయల్దేరారు. గుహద్వారం దాటి కొన్నిమైళ్లు వెళ్ళాక, టామ్ ఇలా అన్నాడు:

"చూశావా, ఇక్కడిదాకా ఈ ప్రాంతం అంతా ఒకేమాదిరిగా వుంది. ఇళ్లుగాని, దొడ్లుగాని

ఏమీలేవు. పొదలుకూడా అన్నీ ఒకే మోస్తరుగా వున్నాయి. కాని నేను ఒక గుర్తుపెట్టుకున్నాను. అక్కడ నేల ఒరిగిపోయినట్టు కనిపిస్తోందే? అక్కడ తెల్లగా లేదూ? అదే నా గుర్తు. ఇప్పుడు ఒడ్డుకు పోదాం పద."

ఒడ్డు చేరారు.

"హక్! మనం నుంచున్నదగ్గిర్నించి గాలం కర్రతో తడిమిచూదాం. నేను ఇవతల కొట్టిన సొరంగం కనిపిస్తుంది."

హక్ ఆ చుట్టుపక్కల తెగ వెదికాడు. కాని ఏమీ కనబడలేదు. టామ్ సగర్వంగా ఒక పొదలోకి నడిచాడు.

"ఇదుగో సొరంగం! ఇంత మంచి, గొప్ప, అద్భుతమైన సొరంగం ఈ దేశంలో లేదు. కాని నువ్వు నోటికి తాళం వేసుకుని వుండు. ఎవరికీ చెప్పకు. నేను మొదటినుంచీ గజదొంగ కావాలని అనుకుంటున్నా. కాని ఇలాంటిది దొరకందే గజదొంగ కావటం కష్టం. దీన్ని మనమే అచ్చంగా ఉంచుకుందాం. అయితే మనకి దొంగల ముఠా ఒకటుండాలి గనక జో హార్పర్ని, బెన్ రోజర్సుని మాత్రం రానిద్దాం. "టామ్‌సాయర్ ముఠా" అని దానికి నామకరణం చేద్దాం. బావుంది కదూ, ఈ పేరు?"

"ఓ, చాలా బావుంది టామ్! ఎవర్ని దోచుకుందాం?"

"ఆ, ఎవరైనా దోచుకోవచ్చు. దార్లు కొట్టాలి."

"వాళ్లని చంపేస్తామా?"

"ఊహూం. అందర్నీ చంపకూడదు. వాళ్లని గుహాలో దాచి పరిహారం తీసుకోవాలి."

"పరిహార మంటే?"

"డబ్బు. డబ్బిస్తేగాని వాళ్లని వదిలిపెట్టమని వాళ్ల బంధువులకి ఉత్తరాలు రాయాలి. వీలైనంత డబ్బు గుంజాలి. డబ్బు రాదనుకో. ఒక ఏడాదిదాకా చూసి చంపెయ్యాలి. అది మామూలుగా చెయ్యాల్సిన పని. కాని ఆడవాళ్లని చంపకూడదు. వాళ్లని ఖైదు చెయ్యాలి; అంతేగాని చంపకూడదు. వాళ్లు అందంగా వుంటారు. బాగా డబ్బుకూడా వుంటుంది. వాళ్లసలే పిరికివాళ్ళు. నగలు వగైరా సరుకంతా తీసుకోవచ్చు. కాని వాళ్లతో ఎప్పుడు మాట్లాడినా టోపీ తీసేసి నెమ్మదిగా, మర్యాదగా మాట్లాడాలి. దొంగలంత మర్యాదస్థులు మరెవళ్లూ లేరు. ఏ పుస్తకం చదివినా అది తెలుస్తుంది. రెండుమూడు వారాలయ్యాక ఆడ ఖైదీలు ఏడవడం, తిట్టడం మానేసి, మన్ని ప్రేమించటం మొదలెడతారు. ఇక వాళ్లని పొమ్మన్నా పోరు. బయటికి తోలేసినా సరే, మళ్ళీ వెనక్కి వస్తారు. అన్ని పుస్తకాల్లోనూ అలాగే వుంది."

"బలే, బలే. సముద్రపు దొంగలావటం కంటే బందిపోటు దొంగఅయితేనే మజాగా వుంటుంది."

"అవును. కొన్ని విషయాల్లో ఇదే బావుంటుంది. ఇంటికి దగ్గరగా ఉండచ్చు. సర్కసులూ, అవీ చూస్తూ ఉండచ్చు."

ఈ లోపల అంతా రెడీ అయింది. ఇద్దరూ సొరంగంలో ప్రవేశించారు. టామ్ ముందు నడిచాడు. సొరంగం చివరిదాకా వెళ్లి, అక్కడ దారం కట్టారు. ఇంకా ముందుకు పోయారు. సీటిబుగ్గ దగ్గిరకొచ్చారు. దాన్ని చూసి టామ్ గజగజ వణికిపోయాడు. అక్కడ గోడమీద ఇంకా మిగిలిన కొవ్వొత్తి వత్తిని టామ్ స్నేహితుడికి చూపించాడు. తానూ, బెకీ అక్కడ కూర్చుని కొవ్వొత్తి రెప రెప లాడుతూ ఆరిపోతుంటే ఎంతబాధ అనుభవించిందీ వర్ణించాడు.

ఇప్పుడిద్దరూ గుసగుస లాడుతున్నారు తప్ప, బిగ్గిరగా మాట్లాడటం లేదు. ఆ గాఢ నిశ్శబ్దం, ఆ అంధకారం భయంకరంగా వున్నాయి. ఇంకా ముందుకు పోయి, పోయి, ఇంజన్‌జో ఆనోజున టామ్‌కు కనిపించిన ప్రాంతం చేరుకున్నారు.

"హాక్! ఇప్పుడు నీకు ఒక తమాషా చూపిస్తాను."

టామ్ కొవ్వొత్తిని ఎత్తి పట్టుకున్నాడు.

"నీకు ఆ మూల కనిపించినంత దాకా చూడు. కనిపించిందా? అక్కడ-ఆ పెద్ద బండరాయి మీద కొవ్వొత్తి మసితో గీసిన-"

"టామ్! అదే శిలువ!!"

"ఆ. ఇప్పుడు నీ నంబర్ 2. ఏమైంది? 'శిలువ కింద' హే! అదిగో, అక్కడనాకు ఇంజన్‌జో కొవ్వొత్తి పట్టుకుని కనిపించాడు!"

ఆ వింత శిలువకేసి హాక్ తేరి చూశాడు. తడబడే కంఠంతో ఇలా గన్నాడు:

"టామ్! పోదాం పద, ఇక్కణ్ణించి."

"అరె. డబ్బక్కర్లేదా?"

"అక్కర్లేదు. ఇంజన్‌జో దెయ్యమై తిరుగుతూ వుంటాడు ఇక్కడ."

"కాదు, ఇక్కడ ఉండదు దెయ్యం. వాడు చచ్చిపోయిన చోట తిరుగుతూ వుంటుంది."

"కాదు టామ్! నీకు తెలియదు. డబ్బున్న చోట అది కాపలా వుంటుంది. దెయ్యాల సంగతి నాకు బాగా తెలుసు."

టామ్‌కూడా హాక్ చెప్పింది నిజమే నని భయపడ్డాడు. ఎల్లాగురా, అనుకున్నాడు. కాని ఇంతలో మంచి ఆలోచన ఒకటితట్టింది.

"చూడు హాక్! మనం వుట్టి తెలివితక్కువ దద్దమ్మలం. పవిత్రమైన శిలువ దగ్గిరికి దెయ్యాలు వస్తాయా, ఎక్కడన్నా?"

ఇది బలే వాదన.

"అవును, టామ్! నాకీ ఆలోచనతట్టనే లేదు.

నిజమే. ఆ శిలువ అక్కడ వుండటం మంచిదే అయింది." అన్నాడు హక్.

ఆ బండరాయి దగ్గిరికి వెళ్లటానికి 20, 30 అడుగుల గట్టు అడ్డంవుంది. దాన్నెక్కి దిగారు. నాలుగు మలుపులు తిరిగిన తర్వాత రాయి కనిపించింది. మొదటి మూడు మలుపుల్లోనూ వెదికారు. కాని అక్కడ ఏమీ లేదు. రాయి దగ్గిరగావున్న మలుపులో ఒక చిన్న గొయ్యి వుంది. దాంట్లో కొన్ని కంబళ్లు కప్పబడి వున్నాయి. అక్కడ ఎంత వెదికినా డబ్బు పెట్టె కనబడలేదు. టామ్ చివరి కన్నాడు:

"శిలువకింద, అని ఇంజన్‌జో అన్నాడు. శిలువ కింద అంటే మరి ఇదేగా?—రాతికింద ఉండదు కదా;

మళ్ళీ వెదికారు; నిరాశ పుట్టి చదికిలబడ్డారు. హక్‌కి ఉపాయమూ ఏమీ తోచలేదు. కొంతసేపటికి టామ్ అన్నాడు:

"రాతికి ఒక పక్కన మాత్రమే కాలిజాడలూ, కొవ్వొత్తి మసీ కనిపిస్తున్నాయి. మిగతా పక్కలలేవు. కనక డబ్బు రాతి కిందనే ఉండాలి. నేను మట్టి తవ్వేస్తాను."

"అవును తవ్వి చూద్దాం."

టామ్ తవ్వ నారంభించాడు. నాలుగు అంగుళాల లోతు తవ్వాడో లేదో కొయ్య తగిలింది.

"హక్! హే! వినిపించిందా?"

హాక్ తవ్వ నారంభించాడు. కొన్ని కొయ్య చెక్కలు తవ్వి పైకి తీసేశాడు. వాటికింద ఒక గొయ్యి వుంది. ఆ గొయ్యి రాతికింద దాకావుంది. టామ్ అందులో దిగి కొవ్వొత్తి పట్టుకుని చూశాడు. రాతి కింద చాలా దూరందాకా చూశాడు. కాని, సొరంగం లాంటి ఆ గొయ్యికి అంతం కనిపించలా. ఇంకా ముందుకు పోదా మన్నాడు. వంగి వంగి ముందుకు నడిచాడు. హాక్ అనుసరించాడు. ఆ ఇరుకు దోవ నెమ్మదిగా భూమిలోకి దిగుతోంది. ముందు కుడి వేపుకి, తరవాత ఎడమ వేపుకి, ఆ దోవ మలుపులు తిరిగింది. తరవాత చటుక్కుని మరో మలుపు తిరిగింది. టామ్ కేకేశాడు:

"అరెబాప్! ఇక్కడ చూడు."

అది డబ్బు పెట్టె. నిజంగా ముమ్మాటికీ, డబ్బు పెట్టె. దాని పక్కన తుపాకి మందు దాచుకునే ఖాళీ డబ్బా వొకటి వుంది. తోలు సంచుల్లో రెండు తుపాకులు, ఒకతోలు బెల్టు, రెండు మూడు పాతజోళ్లు, ఇంకా ఏదో చెత్త, చెదారం చాలా వున్నాయి.

## 18

"దొరికింది, దొరికింది," అని హాక్ పరమానందంతో అరిచాడు. మకిలిపట్టిన డాలర్ నాణాలని గుప్పిళ్లతో ఎత్తి జారవిడుస్తూ, "అబ్బ! మన కెంత

డబ్బుందో! టామ్, ఇప్పుడు మనం ధనవంతుల మయ్యాం," అన్నాడు.

"హక్! నాకు తెలుసు, చివరి కెలాగయినా సంపాదించి తీరతామని. ఇంత డబ్బు దొరికిందంటే నమ్మటానికి కూడా శక్యంగాకుండా వుంది. కాని దొరికినమాట నిజం- ఇక ఇక్కడ ఆట్టేసేపు తారట్లాడకూడదు. బయటికి చేరవెయ్యాలి. పెట్టెని ఎత్తగలం మేమో చూద్దాం"

టామ్ పెట్టె నెత్తిచూశాడు. దాదాపు యాభై పౌనుల బరువుండవచ్చు. కష్టపడి టామ్ ఎత్తగలిగాడు. కాని ఆట్టేదూరం మొయ్యలేక పోయాడు.

"ఆ రోజున దెయ్యాల ఇంటి దగ్గర, వాళ్లు కూడా కొంచెం కష్టంమీదే మోసుకెళ్లారు; నేను చూశాగా. ఆ సంచులు తీసుకురావటం మంచిదే అయింది."

డబ్బంతా సంచీల్లోకి గుమ్మరించారు. "శిలువ" రాయిదాకా వాటిని చేరేశారు.

"ఆ తుపాకుల్ని, మిగతా వాటిని కూడా తీసుకొచ్చేద్దాం" అన్నాడు హక్.

"వద్దు, హక్! ఇక్కడే ఉంచుదాం. దోపిడీలకు పోయేటప్పుడు ఇవి మనకు ఉండితీరాలి. వాటినిక్కడే ఎప్పుడూ ఉంచుదాం. ఇక్కడే మనం విజయోత్సవాలు కూడా చేసుకుదాం. చాల బావుంది యీ ప్రదేశం."

"విజయోత్సవా లంటేఁ?"

"నాకూ తెలియదు. దొంగలముఠా లెప్పుడూ విజయోత్సవాలు చేసుకుంటూ వుంటారు. అందుచేత మనంకూడా చెయ్యాల్సిందే—

ఇక పోదాం, హక్! చాలా సేపయింది మనం వచ్చి. నాకు ఆకలిగావుంది. పడవలోకి వెళ్లాక కాస్త తిని, చుట్టలు కాలుద్దాం."

పొదల్లోంచి తొంగిచూశారు. నదీతీరం నిర్మానుష్యంగా వుంది. పడవలో కూర్చుని విందారగించారు. తృప్తిగా చుట్టపొగ వదలుతూ, ఆవులించారు. సూర్యుడు పశ్చిమదిశకు తిరగ్గానే, పడవ కదల్చి తిరుగు ముఖంపట్టారు. గ్రామసమీపాన ఒడ్డు చేరేసరికి చీకటి పడింది.

"హక్! అమ్మగారి కొయ్యపెట్టెలో అటక వుందే, దానిమీద డబ్బు దాచేద్దాం. పొద్దున్నే వచ్చి అంతా లెక్కపెట్టి, సమానంగా పంచుకుదాం. తరవాత అడవిలో ఎక్కడదాస్తే జాగ్రత్తగా వుంటుందో వెదుకుదాం. నువ్విక్కడే కాపలా వుండు. నేను బెన్నీటేలర్ బండి "ఎరువు" తెస్తాను. ఇప్పుడే-ఈ ఉమ్ము ఆరేలోగా వచ్చేస్తా."

టామ్ మాయమయ్యాడు. రెండు నిమిషాల్లో బండితో సిద్ధమయ్యాడు. రెండు సంచుల్నీ దానిమీద కెక్కించి పైన కొన్ని పాతగుడ్డలు కప్పారు. బండిని లాక్కుంటూ బయల్దేరారు. వేల్సు దేశీయుడి ఇంటి

దగ్గర కొచ్చేసరికి, కాస్త అలసట తీర్చుకుపోదామని ఆగారు. మళ్ళీ బయల్దేరబోయే సమయానికి వేల్సు దేశీయుడు బయటికి కొచ్చాడు.

"ఏమ్, ఎవరక్కడ?"

"హాక్, టామ్ సాయర్."

"ఓ, మీరా? రండి నాతో. మీకోసం అంతా కాచుకు కూర్చున్నారు. ఊఁ- గబగబా— మీరు ముందు నడవండి. ఆ బండిని నేను లాక్కొస్తాను. ఏమిటి?-బరువుగానే వుందే? ఏముంది బండి మీద? ఇటికలా? పాత ఇనుమా?"

"పాత ఇనుము," అని టామ్ జవాబిచ్చాడు.

"అదే అనుకున్నాను. ఈ ఊళ్లో పిల్లలు ఎక్కడెక్కడో కష్టపడి వెదికి, నాలుగు పాత ఇనపముక్కలు సంపాదించుకొస్తారు, ఫౌండ్రీకి అమ్మటానికి. అవి అమ్మితే ఏ మొస్తుంది, నాలుగు చిల్లిగవ్వలు- దానికి బదులు కష్టపడి పనిచేసి రెట్టింపు సంపాదించుకో వచ్చుగా-ఊహుఁ-అది చెయ్యరు. దానికి మనసొప్పదు- హుఁ ఏం చేస్తాం? మానవబుద్ధి. పదండి గబగబా."

'ఏమిటీ తొందర' అని పిల్లలడిగారు.

"మీ కిప్పుడు చెప్పను. డగ్లస్ అమ్మగారింటికి వెళ్లగానే మీకే తెలుస్తుంది."

హాక్ కి కంగారు పుట్టింది. ఉట్టిపుణ్యానికి చివాట్లు తినడం అతనికి మామూలు.

"జోన్సుగారూ! మే మేం తప్పు చేశామండి?"

వేల్సు దేశీయుడు నవ్వాడు హక్ కంగారు చూసి.

"నాకు తెలియ దబ్బాయ్, నువ్వేం తప్పు చేశావో? అమ్మగారికి నువ్వంటే ఇష్టమేగా?"

"నేనంటే ఆవిడకి చాలా దయఅండి."

"అయితే నీకు భయమెందుకూ?"

ఈ ప్రశ్నకి సమాధానం హక్ ఆలోచించుకునే లోగానే అమ్మగారి ఇంటికొచ్చేశారు. బండిని వాకిట్లోనే వదిలి, పిల్లలిద్దర్నీ లోపలికి తోసి వేల్సు దేశీయుడు ఇంట్లో ప్రవేశించాడు.

అమ్మగారి భవనం ధగద్ధగాయమానంగా దీప తోరణాలతో అలంకరించ బడింది. ఊళ్లో ప్రముఖులంతా విచ్చేశారు. థాచర్లు, హార్పర్లు, రోజర్సులు, పోలీపెద్దమ్మ, సిడ్, మేరీ, చర్చిఅధికారి, పత్రికా సంపాదకుడు, ఇంకా ఎందరో వున్నారు. అంతా ముచ్చటైన దుస్తుల్లో ముస్తాబై వచ్చారు.

డగ్లస్ అమ్మగారు టామ్, హక్‌లని ఆదరంతో ఆహ్వానించింది. ఇద్దరిబట్టలూ బురద, మట్టి, కొవ్వొత్తి మసీ కొట్టుకుని ఎంతన్నా ఇదిగా వున్నాయి. టామ్ వాలకం చూసి పోలీపెద్దమ్మ ముఖం అవమానంతో ఎర్రబడింది. టామ్ కేసి "నీ పని ఇప్పుడు కాదు," అన్నట్టు చూసి తల ఊపింది. అయితే అందరికంటె ఎక్కువగా టామ్, హక్‌లే తమ దుస్తుల్ని చూసి సిగ్గు పడ్డారు. వేల్సు దేశీయుడిలా అన్నాడు:

"టామ్ ఇంటిదగ్గిర లేడు. అందుచేత నే నొక్కణ్ణే రాబోతున్నాను. ఇంతలో మావాకిట్లో నే ఈ ఇద్దరూ ఎదురుపడ్డారు. వెంటనే వాళ్లని తోలుకొచ్చాను."

"రండర్రా ఇల్లా" అన్నది అమ్మగారు.

లోపల గదిలోకి తీసుకెళ్ళింది ఆమె వాళ్లని.

"ఇదుగో, శుభ్రంగా ఒళ్లంతా కడుక్కోండి. మీ ఇద్దరికి కొత్త చొక్కాలాగూ లివిగో. మేజోళ్లు, జేబు రుమాళ్లు అన్నీ వున్నాయి. దబ్బున ముస్తాబు కండి. మేము ఎదురు చూస్తూవుంటాం," అని వెళ్లిపోయింది.

ఆమె వెళ్లగానే హక్ అన్నాడు:

"ఏదన్నా తాడు వుంటే ఆకిటికీ లోంచి కిందకి దిగిపోవచ్చు. నేల కాట్టే ఎత్తు లేదు.

"ఛా. వెళ్లిపోవట మెందుకూ"

"నాకు ఆ జనాన్ని చూస్తే భయంగా వుంది. అలాంటి సభలు నాకలవాటు లేదు. నేను వెళ్లిపోతాను."

"అరె భాయీ! ఏం ఫరవాలేదు. చూడు. నే నేమన్నా భయపడుతున్నా నేమో? నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డం వేస్తాను, రా."

ఇంతలో సిడ్ వచ్చాడు.

"టామ్! పెద్దమ్మ నీ కోసం మధ్యాహ్నం నుంచీ ఎదురు చూస్తోంది. నీ ఆదివారం బట్టల్ని మేరీ

సిద్ధంచేసి వుంచింది కూడాను. మీ బట్టలనిండా ఆ బురద, మసి ఏమిటీ?"

"ఏయ్ సిడ్డీ! నీ కనవసరం ఆవిషయం...అయితే సరేగాని, ఏమిటీ ఈ గొడవంతా?"

"అమ్మ గారు ఎప్పుడూ విందులు చేస్తూ వుంటుందిగా, వాటిల్లో ఇదొకటి. తన్ను ఆ రాత్రి రక్షించినందుకు వేల్సు దేశీయుడికీ, ఆయన కొడుకులకీ విందు చేస్తోంది ఈసారి. ఏయ్, నాకో విషయం తెలిసింది. చెప్పనా?"

"ఏమి టది?"

"వేల్సు దేశీయుడు ఈరాత్రి ఒక గొప్ప రహస్యాన్ని బయటపెడతాడట. కాని ఆయన పెద్దమ్మకి చెబుతుంటే నేను చాటునించి విన్నాను. ఇప్పుడా రహస్యం అందరికీ తెలిసిపోయింది. అమ్మ గారికి కూడా తెలిసిపోయింది. కాని తెలవనట్టు నటిస్తోంది. హాక్ కూడా వుంటేగాని, ఆ రహస్యం చెప్పనని వేల్సు దేశీయుడు అంటున్నాడు."

"ఏమిటా రహస్యం, సిడ్?"

"అమ్మగారింటి దాకా హాక్ ఆ రాత్రి దొంగల్ని వెంబడించలా? అది. హఠాత్తుగా ఈ రహస్యం బయటపెట్టి అందరికీ ఆశ్చర్యం కలిగించాలని వేల్సు దేశీయుడు పాపం ఉబలాట పడుతున్నాడు. కాని అది అందరికీ తెలిసిపోయింది. కనక ఆయన పప్పులీసారి ఉడకవు."

ఈమాటలని సిడ్ చాలా గొప్పపని చేసిన వాడల్లే ముసిముసిగా నవ్వుతున్నాడు.

"సిడ్! నువ్వేనా ఆ రహస్యం అందరికీ చెప్పేసింది?"

"ఎవరైతే నీ కెందుకూ? ఎవరో ఒకరు చెప్పారు."

"సిడ్! ఇంత నీచమైన పని చేసేవెధవ ఒక్కడే ఉన్నాడీ ఊళ్లో - నువ్వే. నువ్వేగనక హక్ వైతే ఆ రాత్రి కొండకిందికి దొమతీసి, దొంగల విషయం ఎవరికీ చెప్పకుండా ముసుగుతన్ని పడుకునే వాడివి. నీది కుక్కబుద్ధి. నువ్వు చేసేవన్నీ వెధవపనులే. ఎవరన్నా మంచి పనులుచేస్తే పొగడటం చూసి ఓర్వలేవు. ఇదిగో, ఇది తీసుకో-ఇంకోటి, ఇంకోటి కూడా......" అంటూ టామ్ తమ్ముణ్ణి చెవులు మెలేసి తన్నులు తగిలిస్తూ గదిబయటికి గెంటాడు

"చెప్పుకో. చెప్పకుంటే నాకేం భయమా? పెద్దమ్మతో చెప్పుకో, కావలిస్తే. రేపొద్దున వుంటుంది నీ పెళ్లి."

తరవాత కొంతసేపటికి భోజన శాలలోకి అతిథులంతా వచ్చారు. పెద్దవాళ్లంతా ఒక పొడుగాటి బల్ల వద్ద కూర్చున్నారు. చిన్న పిల్లలకి పక్కగా చిన్న మేజాబల్లలు వేశారు. సమయం కనిపెట్టి వేల్స్ దేశీయుడు లేచాడు. అమ్మగారు తనకీ, తన కొడుకులకీ ఇంత గౌరవం, మర్యాద చూపిస్తున్నందుకు కృతజ్ఞత

చెప్పాడు. కాని అసలు మనిషి ఇంకోడున్నాడనీ, అత
నిదే ఈ గౌరవమంతా అని, చాలాసేపు బయట పెట్ట
కుండా ఉపన్యసించాడు. చివరికి 'హక్' మని తన
రహస్యం కాస్తా బయటపెట్టాడు. కాని ఆ "అసలు
మనిషి" హక్ అని ఇదివరకే తెలిసిపోవడంవల్ల ఎవ్వరికీ
నిజంగా ఆశ్చర్యం కలగలేదు. కాని మర్యాదకోసం
ఆశ్చర్యపోయినట్లు నటించారు. ముఖ్యంగా అమ్మ
గారు మరీ ఆశ్చర్యం నటించి, హక్‌ని తెగపొగడింది.
ఈ పొగడ్తల సముద్రంలో హక్ మునిగిపోతున్నాడు.
ఎప్పుడూ అలవాటులేని విలువైన బట్టలు తొడుక్కో
వటంవల్ల ఇందాకటినుంచీ పడే ఇబ్బందిని కూడా మర్చి
పోతున్నాడు. అందరూ తనకేసే తేరిపార చూస్తుంటే,
భూమి బద్దలై తనులోపలికి దిగిపోతే బావుండు
నన్నంత ఇబ్బంది పడ్డాడు.

హక్‌ని తన ఇంట్లోనే ఉంచుకుంటాననీ,
శుభ్రంగా చదువు సంధ్యలు చెప్పిస్తాననీ, తనకు కాస్త
వెసులుబాటుగా వున్నప్పుడు కొంత డబ్బిచ్చి యేదన్నా
వ్యాపారంలో ప్రవేశపెట్టిస్తాననీ అమ్మగారు ఉప
న్యాసం దంచింది.

టామ్‌కు బంగారంలాంటి అవకాశం లభించింది.
ఇలా అన్నాడు: "హక్‌కు మీరు డబ్బివ్వక్కర్లేదు.
అతడు చాలా ధనవంతుడు."

మర్యాదగా ఉండదని ఊరుకున్నారుగాని, లేక
పోతే అతిథులు ఈ "వేళాకోళానికి" పొట్ట పగిలేట్టు

నవ్వేవాళ్లే. ఎంత నవ్వితే బావుంటుందో అంతే నవ్వి ఊరుకున్నారు. తరవాత వచ్చిన నిశ్శబ్దం చాలా ఇబ్బందిగా వుంది. టామ్ మళ్లీ అన్నాడు:

"హాక్ దగ్గిర చాలా డబ్బుంది. మీరు నమ్మక పోవచ్చు. అంతమాత్రాన అతని ధనం లేకుండా పోదు...మీరేం నవ్వక్కర్లేదు లెండి. కావలిస్తే ఈ క్షణంలో మీకు చూపించగలను..."

టామ్ బయటికి పరిగెత్తాడు. అతిథులు ఒకళ్ల మొహాలు ఒకళ్లు చూసుకుంటూ చూసుకున్నారు. హాక్ కేసి చూశారు. అతడు నోటికి తాళంబిగించి కూర్చున్నాడు.

"సిడ్! టామ్ కేమన్నా జ్వరం తగల్లేదు గదా! అలా పిచ్చిమాటలు మాట్లాడుతాడేం? అమ్మమ్మమ్మ! ఈపిల్లడితో వేగలేకుండా ఉన్నా నమ్మా," అంది పోలీ పెద్దమ్మ.

పెద్దమ్మ తన వాక్యం పూర్తి చేస్తూండగానే టామ్ ప్రవేశించాడు, రెండు చేతులా సంచులు మోసు కుని, ఆ బరువుకి కాళ్లు అడ్డదిడ్డాలుగా వేస్తూ.

దీపాల వెలుతురులో బంగారు నాణాలు నిగనిగ మెరిసి పోతుండగా, టామ్ వాటి నొక బల్లమీద గుమ్మరించాడు.

"హేం!! నేను చెబితే మీరు నమ్మరు. ఇప్పుడేమంటారు? ఇందులో సగంనాది; సగం హాక్ ది."

ఈ దృశ్యం చూసేసరికి అతిథులు ఎక్కడి వాళ్లక్కడ బిగుసుకు పోయారు. అందరూ కళ్లప్ప

గించి, నోళ్లు తెరిచి చూడ్డమేగాని, మాట్లాడ్డం లేదు. కాస్సేపటికి తేరుకున్నారు ఈ అవస్థనుంచి.

వెంటనే "ఈ డబ్బు మీా కెక్కడిది" దని గద్దించారు. చెబుతానాగండని, టామ్ సవిస్తరంగా మొదటినుంచీ చెప్పకొచ్చాడు తమ కథ. టామ్ చెప్పటంకూడా చాలా బాగుండటంవల్ల, కథ ముగిసేదాకా ఎవరూ నోరు మెదప్పలేదు. చివరికి వేల్సు దేశీయుడిలాగన్నాడు :

"మీాకు ఆశ్చర్యకరమైన రహస్యం బయట పెట్టాలని ఎంతో సరదాపడ్డాను. కాని ఈ అద్భుత దృశ్యం ముందు అది ఏమూలకి?"

ధనం లెక్కపెట్టారు. పన్నెండు వేల డాలర్లపైగా, ఇంకా కొంచెం వుంది. అంత డబ్బు ఒక్కచోట కుప్పగా పడివుండటం అక్కడవున్న అతిథుల్లో ఒకళ్లూ ఇప్పటివరకూ చూడలేదు! (వాళ్లలో కొందరికి అంత కంటే ఎక్కువడబ్బు ఆస్తిరూపంలో ఉన్నప్పటికీ.)

* * * *

టామ్, హక్‌లకు లభించిన నడమంత్రపు సిరి సెంట్ పీటర్సు బర్గు గ్రామంలో అపూర్వమైన సంచలనం కలిగించింది. అంత పెద్దమొత్తం, గలగల్లాడే బంగారు నాణాల రూపంలో ఇద్దరు ముక్కుపచ్చలారని పిల్లలకు లభించిందంటే ఎవరూ మొదట నమ్మలేక పోయారు. దాన్నిగూర్చి రోజుల తరబడి చర్చలు జరిగాయి; జనం గుటకలు మింగారు; పిల్లల సాహ

షాన్ని కీర్తించారు. చివరికి ఈ అద్భుత విషయాన్ని గూర్చే అస్తమానం ఆలోచించటంలో చాలామంది మతిపోయే స్థితికి కూడా వచ్చారు.

సెంట్ పీటర్స్ బర్గ్‌లోనూ, చుట్టుప్రక్కల గ్రామాల్లోనూ ఉన్న "దెయ్యాల ఇళ్ల" లో ఒక్క దాన్నిగూడా వదిలిపెట్టకుండా, అన్నిటిసీ పునాదులతోసహా తవ్వేశారు, "గుప్తధనం" దొరుకుతుందనే ఆశతో. పిల్లలు కాదు పెద్దవాళ్లే; గడ్డాలు, మీసాలు నెరిసిన "పెద్ద మనుషులు" కూడా సిగ్గులేకుండా ఈ ఉద్యమంలో పాల్గొన్నారు.

టామ్, హక్‌లు కనిపించినచోట నల్లా వాళ్లకు అత్యుత్సాహంగా స్వాగతాలు, సత్కారాలు, మర్యాదలు జరిగేవి; ఇక పొగిడేవారి సంఖ్య లెక్కపెట్టడానికే వీల్లేదు. వాళ్లు రోడ్డుమీద పోతుంటే అమాయకులైన పిల్లలు నోళ్లు తెరుచుకుని అలా చూస్తూ నిలబడి పోయేవారు.

ఇదివరకు తాము మాట్లాడిన మాటల నెవరూ అంత లెక్కచేసినట్లు టామ్, హక్‌లకు జ్ఞాపకం లేదు. ఇప్పుడు మాత్రం వాళ్ల నోటి వెంట ఏమాట వచ్చినా దాన్ని అతిశ్రద్ధగా విని, తల వూపి, మెచ్చుకుని, వాళ్లు లేనప్పుడు మరోచోట ఆ మాటే పలికేవాళ్ల సంఖ్య జాస్తిఅయింది. టామ్, హక్‌లు ఏ పని చేసినా అది అద్భుతంగా వున్నదనుకునేవాళ్ల సంఖ్యకూడా జాస్తి అయింది. అసలు వాళ్ళకి "మామూలుపనులు"

చేయటం, "చవకబారు మాటలు" మాట్లాడటం కూడా చేతకాదేమో నన్నంత గొప్పవాళ్లయి పోయారు. కొందరు "చరిత్రపరిశోధకులు" ఈ పిల్ల లిద్దరి పూర్వచరిత్రాలని పరిశీలించి అందులో చాలా గొప్పతనాన్ని కూడా కనిపెట్టగలిగారు. గ్రామంలో వెలువడే పత్రిక వీళ్ల జీవితచరిత్రలు సంగ్రహంగా ప్రకటించింది.

హక్ ధనాన్ని అమ్మగారు 6 రూపాయిల వడ్డీ చొప్పున బ్యాంకిలో దాచింది. పోలీపెద్దమ్మ కోరిక మీద టామ్ ధనాన్ని కూడా జడ్జిథాచర్ గారు అలాగే బ్యాంకులో దాచారు. వాళ్ల కిప్పుడు చాలా పెద్ద ఆదాయం ఉంది. వారానికొక డాలరు, ఆదివారం నాడు మరో అర్థ డాలరు వాళ్లకిస్తారు. ఆ డబ్బు వాళ్లిష్టంవచ్చినట్లు ఖర్చుపెట్టుకోవచ్చు. చర్చి అధికారికి కూడా వారానికి వచ్చే ఆదాయం అంతే. (అసలు ఆ ఆదాయం ఆయనదాకా ఎప్పుడూ రాదు. పౌరులు ఊరికే ఇస్తామని అంటారుగాని చాలామంది ఎగేస్తారు.) ఆరోజుల్లో డాలరుంబావుతో ఒక పిల్లడికి ఉండేందుకు గది, భోజనం, స్కూలుచదువు అన్నీ వచ్చేవి. ఆ మాటకొస్తే బట్టలికి కూడా సరిపోయేది.

జడ్జిథాచర్ గారికి టామ్ అంటే విపరీతమైన అభిమానం ఏర్పడింది.

మరొక కుర్రాడెవడైనా అయితే బెకీని ఆ సోరంగ గుహాలోనుంచి రక్షించలేక పోయేవాడే నని

ఆయన అన్నాడు. పైగా బెకీ తండ్రితో రహస్యంగా మరో విషయం కూడా చెప్పింది: ఒక రోజున తనకు స్కూల్లో దెబ్బలు తగిలేవేననీ, కాని టామ్ అబద్ధమాడి తన దెబ్బలు అతనే తిన్నాడనీ. జడ్జిథాచర్ గారికి దీంతో టామ్‌మీద ప్రేమ ఇంకా ఎక్కువైంది. టామ్ ఆడిన అబద్ధం చాలా ఉదారం, ఉన్నతం అయినదనీ, టామ్ పేరు అమెరికా దేశ మూలపురుషుడైన జార్జి వాషింగ్టన్‌తోపాటు చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగినదనీ కూడా చెప్పారు. తండ్రి హాల్లో అటూ యిటూ పచార్లుచేస్తూ ఈ మాటలు అంటూంటే బెకీ ఆయన్నెంతో మెచ్చుకుంది. వెంటనే ఆమె పోయి టామ్‌తో ఈ ముక్కలు వాగేసింది.

టామ్ గొప్పలాయరో, సోల్జరో అవ్వాలని జడ్జిగారు ఆశపెట్టుకున్నారు. టామ్‌ని ముందు మిలిటరీ స్కూల్లో చేర్పించాలని, తరవాత దేశంలోకల్లా గొప్ప లాకాలేజిలో చేర్పించాలని ఆయన అనుకున్నారు.

హాక్ ఫిన్ ఇప్పుడు ధనవంతుడవటంమూలాన, అమ్మగారి ఇంట్లోనే నివసిస్తూఉండటంవల్ల, అతనికి కొన్ని ఇబ్బందులు కలగటం ప్రారంభించాయి. అమ్మగారి నౌకర్లు హాక్‌ని రోజూ శుభ్రంగా స్నానం చేయించి ఇస్త్రీబట్టలు తొడిగేవారు. నున్నగా దువ్వేవారు. చలవచేసిన తెల్లటి దుప్పట్లు పరిచిన మెత్తటి పరుపులమీద పడుకోబెట్టేవారు. ఆదుప్పట్లమీద

ఎక్కడన్నా, పొరపాటుగానైనా మాపుగాని, మసిగాని కనిపిస్తుందేమో, ముద్దుపెట్టుకోవాలని హాక్ వెదకేవాడు; కాని ఎప్పుడు చూసినా అవి తెల్లగానే ఉండేవి. భోజనందగ్గర చాకు ఫోర్కు, చిన్న రుమాలు, పళ్ళెం, కప్పు ఇన్ని వస్తువులు ఉపయోగించాల్సి వచ్చేది. ఇది కాక పుస్తకాలు చదవటం, చర్చికి పోవటం, ఎవరితోనన్నా మాట్లాడేప్పుడు మెత్తంగా, మర్యాదగా మాట్లాడటం మొదలైన అనేక ఇబ్బందులు సంభవించేవి. పాపం ఎటు తిరిగినా, నాగరికత అనే జైలుగోడలు అతనికి ప్రత్యక్షమయ్యేవి.

మూడు వారాలపాటు ఈ జైలులో ఓపిక పట్టాడు హాక్. ఒకరోజున హఠాత్తుగా మాయమయ్యాడు. 48 గంటలు కాలం అమ్మగారు హాక్ కోసం అన్ని చోట్లా వెదకించింది. గ్రామస్థులు కూడా గాబరా పడ్డారు. నదిలో పడ్డాడేమోనని గాలించారు.

మూడోరోజు పొద్దున టామ్‌సాయర్ హాక్ మామూలుగా అలవాటుపడిన చోట్లన్నీ వెదకి, చివరికి కసాయిదుకాణం వెనకవున్న ఒక ఖాళీపెట్టెలో మన కాందిశీకుణ్ణి పట్టుకున్నాడు.

హాక్ అంతకుముందే నిద్రలేచాడు; ఎక్కడెక్కడో ఎత్తుకువచ్చిన రొట్టెతుంపులు, మాంసంముక్కలు భోజనం చేశాడు. ఇప్పుడు తృప్తిగా, కాళ్లు చాచుకుని చుట్ట కాలుస్తున్నాడు. జుట్టు చిందరవందరగా వుంది; వళ్లంతా మట్టి, దుమ్ము; పూర్వాంతను స్వతంత్రంగా,

సంతోషంగా ఉన్న రోజుల్లో ధరించే శిథిలవస్త్రాలనే ధరించాడు. టామ్ అతన్ని జబ్బపట్టుకు లేవనెత్తి, గ్రామంలో అంతా ఎంత కంగారుపడుతోందీ చెప్పి, ఇంటికి రమ్మన్నాడు. హాక్ ముఖంలో ఇప్పటిదాకా వున్న ప్రశాంతిపోయి, విచారం వచ్చింది. ఇలా అన్నాడు:

"టామ్! ఇంటి సంగతి ఎత్తకు. నేను ప్రయత్నించాను; కాని లాభంలేదు. ఇల్లు అనే పదార్థం నాకోసం కాదు. నాకది అలవాటు లేదు. అమ్మగారు మంచిదే; నే నంటేదయే. కాని ఆవిడపద్ధతులు నాకు నచ్చవు. ప్రతిరోజూ ఒకే సమయానికి నిద్ర లెమ్మంటుంది. రోజూ స్నానం చెయ్యాలి; దువ్వెట్టు తల దువ్వించుకోవాలి; కొయ్యమెద్దులో పడుకోకూడదు; ఆ వెధవ సుభ్రమైన బట్టలు తొడుక్కోవాలి; వాటిల్లో ఉంటేనాకు ఊపిరాడదు; ఆ బట్టలు తొడుక్కొని కింద కూచోకూడదు; పడుకో కూడదు; ఆఖరికి దొర్లటానికి కూడా వీల్లేదు; చర్చికి పోయి ఆ చెమటలో కూచోవాలి. ఆ ప్రార్థనలు వింటుంటే చిర్రెత్తుకొస్తుంది; అక్కడ ఈగలు పట్టుకోటానికి, ఆఖరికి బిస్కట్లు నములటానికి కూడా వీల్లేదు; ఆదివారమంతా బూట్లు తొడుక్కుని ఉండాల్సిందే కదా! అమ్మగారు టైమ్ ప్రకారం తింటుంది; టైమ్ ప్రకారం నిద్రలేస్తుంది; టైమ్ ప్రకారం పడుకుంటుంది; ఇక నాలాంటివాడు ఏమైపోతాడు చెప్పు ఆ పరిస్థితుల్లో."

"హాక్! ప్రతివాడూ అలాగే చేస్తాడు."

"లాభంలేదు టామ్! నేను ప్రతివాణ్ణి కాదుగా! నేనక్కడ బతకటం కష్టం. చేపలు పట్టడానికీ, ఈత కొట్టడానికీ అన్నిటికీ అమ్మగార్ని అడిగి మరీ పోవాలి. మర్యాదగా అందంగా మాట్లాడాలి. అందుకే రోజూ ఒకసారి మేడమీదికిపోయి ఒక్కణ్ణే బూతులు మాట్లాడుకునే వాణ్ణి; లేకపోతే నోరంతా తిమ్మిరెక్కినట్టుండేది. అమ్మగారు నన్ను చుట్టకాల్చ నివ్వదు; కేకలెయ్యటం, ఆవులించటం, మెటికలు విరవటం ఒళ్లు విరుచుకోటం ఏమీ పనికిరాదు; ముఖ్యంగా "పెద్ద మనుషులున్నపుడు—(పెద్ద మనుషులు అనేమాట మహాకోపంగా అన్నాడు హాక్.) ఇక కొద్దిరోజుల్లో స్కూలు తెరుస్తారు. నేను రోజూపోయి చదువుకోవాలి. అంతకంటే చచ్చిపోవటం మంచిది. ధనవంతుడు కావటమంటే ఏమిటో అనుకున్నాను టామ్! అంతా బాధే! అంతా చెమటే! చూడు ఈ బట్టలు నాకు నచ్చాయి, సరిపోతాయి. ఈ పెద్దు నాకు బావుంది; నిన్ని నేను వదిలిపెట్టను. అసలునాకు డబ్బే లేకపోతే ఈ అవస్థంతా వచ్చేదికాదు. టామ్! నా వాటా డబ్బు కూడా నువ్వే తీసుకో. ఎప్పుడన్నా పది రాగిడబ్బులు పారేస్తూ వుండు. మాటిమాటికీ యివ్వద్దు. ఎంతో తంటాలుపడితేగాని దొరకని వస్తువులంటే నా కిష్టం. నన్ను వదలిపెట్టమని అమ్మగారితో చెప్పు."

"హాక్! ఏమిట్రా అలా గంటావ్?

నీ డబ్బెలా తీసుకోగలను? ఇదుగో చూడు, కొంత కాలం పోతే ఇవన్నీ నీకు అలవాటైపోతాయి."

"అలవాటా? అవును, అలవాటవుతాయి; కాని కుంపటిమీద చాలాసేపు మనిషిని కూర్చో పెడితే ఆ వేడి అలవాటైనట్టుంటుంది. టామ్! నాకు డబ్బక్కర్లేదు. ఆ మేడల్లో బతకలేను. నాకు అడవులు, నది, పెద్దులు ఇష్టం. అక్కడే ఉంటాను నేను. చూడు. మనం తుపాకులు, గిపాకులు అన్నీ రెడీ చేసుకున్నాం, దోపిడీలకోసం. ఇంతలో ఈ అవస్థ వచ్చిపడింది."

"హక్! నేను ధనవంతుడినైనా దోపిడీలు మానను."

"నిజంగానా?"

"నేను చచ్చినంత ఒట్టు. నువ్వు గౌరవస్థుడివి కాకపోతే మా ముఠాలో చేర్చుకోం." ఈ మాటతో హక్‌కి గాబరాపుట్టింది.

"ఎందుకని టామ్! అప్పుడు నన్ను సముద్రపు దొంగ కానివ్వ లేదా?"

"అది వేరు. సముద్రపు దొంగకంటే బందిపోటు దొంగ గొప్పవాడు. అసలు చాలా దేశాల్లో వాళ్లు మంత్రులుగానూ, జమీందార్లుగానూ ఉంటారు."

"టామ్! మనిద్దరం జతకాదూ. నన్ను వదిలేస్తావా? వదిలెయ్యవు కదూ? వదలెయ్యవు కదూ?"

"వదిలెయ్యటం నాకూ ఇష్టంలేదు. కాని అందరూ ఏమనుకుంటారు? 'హు! టామ్ సాయర్

మతాలో అంతా చెత్తాకాసి మనుషులే' అని వెక్కిరిస్తారు. నిన్ను చూసే అలా వెక్కిరిస్తారు. మరి అప్పుడు ఎల్లా?"

హాక్ చాలాసేపు మౌనంగా ఉన్నాడు. అంత రాత్రంతో కుస్తీలు పడుతున్నాడు.

"సరే. అమ్మగారింటికివస్తాను. ఒక నెలరోజులు ఎల్లా వుంటుందో చూస్తాను. కాని సి మతాలో చేర్చుకు నేట్టయితే నే—"

"ఆల్ రైట్ హాక్! పద. అమ్మగారితో చెబుతాలే, నిన్ను కొంచం స్వేచ్ఛగా వదలిపెట్టమని."

"టామ్! చెబుతావా? నిజంగా-నిజంగా? కొన్ని మరీ కష్టమైనవాటిల్లో నన్ను వదిలేస్తే చాలు. నేను చాటుగా చుట్టలు కాలుస్తాను; చాటుగానే బూతులాడతాను. కాని, ముఠా ఎప్పుడు మొదలెడతావ్? ఎప్పటినుంచీ దొంగతనాలు?"

"వెంటనే. మనవాళ్ళందర్నీ సమావేశంచేసి ప్రారంభోత్సవం చేద్దాం."

"ఏమిటీ అది?"

"ప్రారంభోత్సవం."

"అంటే?"

"ఏం లేదు. ఒకళ్ళనొకళ్ళు కాపాడతామనీ, ముఠారహస్యాలు వెల్లడించమనీ, ఒకవేళ ఎవరన్నా చెబితే వాణ్ణీ, వాడికుటుంబాన్నీ హత్య చేస్తామనీ ప్రమాణం చెయ్యాలి."

"బలేగా వుంది టామ్, బలే."

"ఈ ప్రమాణం అర్ధరాత్రివేళ, ఒంటరిగా, భయంకరమైనచోట చెయ్యాలి. దెయ్యాలు ఇళ్లయితే మరీ మంచిది. కాని వాటి నన్నిటినీ పిల్లగించేశారు."

"ఫరవాలేదు. అర్ధరాత్రిపూట చేస్తే చాలు."

"అవును. శవాన్ని ముట్టుకుని చెయ్యాలి ప్రమాణం. తర్వాత నెత్తురుతో సంతకాలు చెయ్యాలి."

"అక్స్, అల్లా వుండాలి బంది పోటుముఠా అంటే. సముద్రపు దొంగతనం కంటే ఇదే బాగావుంది. ఇదిగో టామ్! నేను చచ్చేదాకా అమ్మగారి ఇంట్లోనే వుంటాను. నేను గొప్ప గజదొంగనయ్యాక ఆవిడ కూడా నన్ను మెచ్చుకుని, అంత కష్టపెట్టదనుకుంటా."

---

ఈవిధంగా యీ చరిత్ర ముగిసింది. ఇది ఒక బాలుని చరిత్రగనుక ఇక్కడితోనే దాన్ని ఆపు చేయాలి; ఇంకా పొడిగిస్తే ఇది యువకుని చరిత్రఅయి పూరుకుంటుంది. యువకులనుగూర్చి నవలరాసే టప్పుడు రచయితకు ఎక్కడ ఆపుచెయ్యాలో తేలిగ్గా తెలుస్తుంది; అంటే ఓమంచి అమ్మాయినిచ్చి ఓమంచి ముహూర్తాన పెళ్లి చెయ్యడంతో ఆపెయ్యవచ్చు. కాని బాలురను గూర్చి రాసేటప్పుడు, ఎంత ముందు వీలైతే అంతముందు సమాప్తం చెయ్యడం మంచిది.

ఈపుస్తకంలో వచ్చే పాత్రలందరూ ఇంకా సుఖంగా బ్రతికేఉన్నారు; ఎప్పుడో ఒకసారి, వారి పిల్లల కథను తీసుకుని వాళ్లెటు వంటివారో చూడాలని అనిపిస్తే అనిపించవచ్చును. కనుక ప్రస్తుతానికి ఆ విషయాలేవీ తడవకుండా ఉంటమే మంచిది.

సమాప్తము



